# ప్రణయసరణి



ఒక శోకాంతమగు నాఖ్యాయిక.

---

రాళ్ళపల్లి గోపాలకృష్ణశర్మచే
రచింపఁబడియె.

---

మైసూరు మహారాజావారి కాలేజీ తెలుఁగు
పండితులగు శ్రీయుత రాళ్ళపల్లి
అనంతకృష్ణశర్మగారిచే
సరిచూడఁబడినది.

---

రాజమహేంద్రవర ఆంధ్రసారస్వత
వికేతనమువారిచే
మనోరమాముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1916

వెల రు. 1

"స్ఫురత్కలాలాప విలాసకోమలా
కరోతి రాగం హృది కౌతుకాధికమ్
రసేన శయ్యాం స్వయమభ్యుపాగతా
కథా జనస్యాభినవా వధూరివ"

(భట్టబాణుఁడు కాదమ్బరి.)

ఆర్యవరులారా !

నవలలు వ్రాయవలయునను కుతూహలము చాలదినములనుండి నాకుఁ గలదు. కాని యందుకుఁ దగిన సాధనములును, వ్యాసంగమును, కాలమును జాలతక్కువ. పొట్టకు బట్టకు వలయు వ్యాసంగమే కుత్తుకబంటిగనుండ, నిట్టి చిత్రకళలవిషయమే తలపోయుటకు వీలుండదుగదా ! కాని రానురాను నా కాపిచ్చి బలమగుచు వచ్చెను. విధిలేక యిదివ్రాయ దొరకొంటిని. వ్రాసితిని.

ఈకథ కేవలము నిర్మాణలనుగాదు. ఎంతభాగము సత్యమనిన జెప్పఁజాలను గాని కొంత సత్యము గలదు. సంఘాపేవేణనిపుణులగు మా చదువరులు దానిని గనిపెట్టలేకపోరని నమ్మినాఁడను. సమయమునకు సరిగ నామిత్రుఁడొకఁడు నాకాసత్యచరిత్రభాగము నెఱిఁగించెను. చరిత్రయుండఁగాఁ గట్టుకథలేలయని దానినే నవలయను పేరఁ గల్పించి వ్రాసితిని.

భావకల్పనములందును, పాత్రపోషణమునందును, స్వభావోన్మీలనములయందును లోపములు పెక్కు లుండకపోవని నాదృఢప్రత్యయము. అందును ప్రథమప్రయత్నమిది.

చదువరులు మన్నింతురుగాత !

ఇట్లు,

విన్నవించు విధేయుఁడు

రాళ్ళపల్లి గోపాలకృష్ణశర్మ.

అనంతపురము.

ఆనంద మాఘ
శుక్లదశమి.

## సంపాదకీయభూమిక.

—:o:—

దైవానుగ్రహమున నింతవఱకు పండ్రెండు గ్రంథములను ప్రకటింపఁగలిగితిమి. ఇంతటినుండి గ్రంథములనెంతవఱకు ప్రకటింపఁగలమో ప్రస్తుతపు కాగితాభావమువలన నేమియు చెప్పఁజాలము. వీలయినంతవఱకు యత్నించి త్వరలోనే యింకొక గ్రంథము నాంధ్రప్రపంచమున కీయఁగలమను నమ్మకముమాత్రము గలదు. పరాపేక్షాపరులమయిన మన హిందూదేశీయులకు, అందు ముఖ్యముగ మన యాంధ్రులకు ఏజపానుదేశమో కాగితమును దిగుమతీచేసి తగినధనము తీసికొనియైనను నింతభిక్ష పెట్టునెడల గ్రంథముద్రణము సాగును గాని లేనిచో ముద్రాలయములును, గ్రంథమండలులును, గ్రంథప్రకాశకులును నిరుత్సాహులై యుండవలసి వచ్చును. అట్టిదుస్థితియే తటస్థించునెడల మేమును చేయదగ్గదేమియును లేదు. ఈప్రణయసరణి ఆంధ్రులకు సంబంధించిన చక్కని సాంఘికనవల. విషాదాంతమగు గ్రంథమయినను మన వాఙ్మయమున నిట్టిగ్రంథ మింతవఱకు వెలువడినటులఁ గాన్పింపమి మేమీగ్రంథమును బ్రకటించితిమి. ఇంతటినుండి గ్రంథములను బ్రకటింపగలుగుదుమేని తఱచు సాంఘికనవలలనే ప్రకటింపఁదలఁచినారము.

సంపాదకుఁడు.

—:o:—

# అంకితము.

గీతమాలిక. మమ్ముఁ జిన్నటినుండి ప్రేమంబు మీఱఁ
గడుపునం బెట్టుకొని ప్రోచి కాచినాఁడు;
మాకు మాయింటికిని గొదలేక గట్టి
యూఁతగంబము గాఁగఁ దా నున్నవాఁడు;
తెలివిలేనట్టి మమ్మొక తీరుగాఁగ
మనుజులను జేసి నేఁటికిఁ దినెడి యుప్పు
సొంతముగఁ దెచ్చికొను దారి నూపినాఁడు;
అన్నదమ్ములకెచ్చుగ నరసినాఁడు;
కన్నకొడుకులవలె మమ్ముఁ గాంచినాఁడు:
మాదు సర్వస్వభూతుఁడు, మాదు హితుఁడు,
మాదురత్నము ! మాబావ ! ! మమ్మువిడిచె ! !
చిన్నతనమున, సుఖమును జెందువేళఁ
జిన్నిబిడ్డలఁగని సంతసించువేళఁ,
గడఁగి యాశ్రితులను బ్రోవఁగలుగు వేళ,
భవ్యమగు కీర్తి నార్జింప వలయువేళ,
మృత్యుదేవత యిటుదాఁపరించి నిన్నుఁ
గబళముగఁ జేయ నెక్కడఁ గాచియుండె !
బావ ! బావ ! యటంచును బ్రదికినపుడు
తిరిగితిమి వెంట, నీతిండి తింటిమయ్య !
పాపిదైవము మనల శాశ్వతముగాఁగ
నిట్టు లెడఁబాపె ! నెంతరోదింతు మింక !
మాకు నీకును నెన్నఁడో మాసెఋణము !
నీవు సని నేఁటికైదాఱు నెలలు గడచె !
బ్రదికినన్నాళ్ళు నీపేరు పాడిపాడి,

దేశదేశము లందును దిరిగి తిరిగి,
త్రిప్పె మైత్రియు నీయప్ప దీర్పఁగలమె ?
నిన్నుఁ దలఁచినయపుడు కన్నీరు విడిచి
యేడ్వఁగల మింతెకాని, యింకెట్లు నీకు
మాకృతజ్ఞతఁ జూపెడు మార్గముండు !
గదుఁ గృతఘ్నంబు మనుజుల యెడఁద తలఁప,
మాకు నీమీఁద నీదు నామంబుగూడ
మఱపునకు వచ్చునో యేమొ ! యెఱుఁగరాదు !
నిన్ను మానుండి కొనిచన్న నిర్దయాత్మఁ
డమ్మహేశ్వరుఁ డికమీఁద నట్టిబుద్ధి
మామనంబుల లేకుండ మాన్చుఁగాక !
ఎందుఁ గలవయ్య ? నీవిపు డే జగమున
నెట్టిరూపంబుఁ జెంది వర్తింతువయ్య ?
నీకు నీకృతి నొసఁగి, యెంతేని నీవు
మాపయిం జూపియున్న ప్రేమమున కిది
యుడుతభక్తిని జూపఁగ నున్నవాఁడ
నిర్మలంబుగ ధరపయి నిలిచినట్టి
నీయశోలక్ష్మి మంగళకాయమునకు
నిదియు నొక సొమ్ముగాఁగ నర్పించువాఁడ,
నీవు గైకొన దీని మన్నించితేని
ధన్య[illegible]ను గృతియంచుఁ దలఁవాఁడ.
నింతకన్నను మాచేత నేమిసాఁగు ?
నీవు ప్రాణంబువోలె మన్నించినట్టి
యనుఁగు మఱఁదికి నామాటలాలకించి
యాజ్ఞ యొసఁగుము ! త్రోసివేయకుము తండ్రి !
చారుగుణధుర్య ! సజ్జయాచార్యవర్య ! !

గ్రంథకర్త

శ్రీ

# ప్రణయసరణి

## మొదటి ప్రకరణము

—:o:—

### “అదృష్ట పరీక్ష”

“ మగువ! నీవు సెప్పు మందులు మాకులుం
నింద్రజాలములును నే నెఱుంగ.”

(భారతము, ఎఱ్ఱన.)



నేటికి పన్నేండ్ల మును పొకనాఁడు మధ్యాహ్నసమయమున బెంగుళూరునగరమునకుఁ జేరి ముఖ్యవీథుల కించుక దూరమునసున్న యొక యగ్రహారములోని యొక పెంకుటింటియావరణములోపల చిన్న యరుగుపై నిరువురు బాలికలు గూర్చుండి యుండిరి. సమీపమున నిరుప్రక్కలను బొడవుగఁ బెరిగియున్న రెండు నారికేళవృక్షము లాసమయమున, నించుక తీక్ష్ణముగఁ గాయుచున్న సూర్యాతపము నాకన్నియల మొగములపైఁ బడనీక యడ్డగించి చల్లనినీడ నొసంగుచుండెను. వారిలో నొక్కతె పదునాఱేండ్లవయసుగలసుందరి. రెండవది నామెకంటె వయసున రెండేండ్లు తక్కువయగు ముగ్ధ.

ఇరువ్వురును వివాహితలే. ప్రథమయగు కమలకు బాల్యము చాలవఱకు వీడిపోయి తారుణ్య మంకురించి సర్వాంగములయందును దలచూపుచుండెను. రెండవదియగు రుక్మిణి కింకను బాల్యము వదల లేదు. కమల యాయింటియజమానుఁ డగునాథశాస్త్రి కేకపుత్రి. రుక్మిణి పొరుగింటివారి పడుచు; కమలకు మిత్రము.

మధ్యాహ్నము మీఱినది. ఇంటిలోపల నెవరును లేరు. కమల చేతిలో నొక పుస్తకముఁబూని నిశ్శబ్దముగఁ జదువుకొనుచు నన్వయించుకొనుచుండెను. రుక్మిణి యన్ననో నునుపైన చలువదారముతో మేలితరగతి కరవస్త్ర మొక్కటి యల్లుచుండెను. కమల కీనవ నాగరక విద్యలన్నియు రావని చెప్పఁజాలముగాని యామెకు వానిపై నభిరుచి తక్కువ. చదువునం దభిలాష యెక్కువ. పూసలు గ్రుచ్చుట, కరవస్త్రము లల్లుట, రవివర్మపటములకుఁ గ్రొత్తగా వింతవింత సొమ్ములు వస్త్రములుఁగూర్చి యలంకరించుట, మొదలగు నీకాలపు వారి విచిత్ర విద్య లన్నియుఁ బైపూఁత మెఱుఁగు లనియు, కులకాంతల కంతగా నావశ్యకములు గా వనియు నామె తలంపు. ఏల? కమల రుక్మిణివలె పాఠశాలలో విద్య నభ్యసించుచుండలేదు. ఐననొక విశేషము. మాధవశాస్త్రి వైదికాచార తత్పరుఁడయ్యును శుద్ధఛాందసుఁడు గాఁడు. తన యేకపుత్రికకు తీరిక యున్నప్పు డెల్ల నించుక సేపు చెంతఁగూర్చుండి యక్కరతో చదువు చెప్పుచుండెడివాఁడు కమల తండ్రిబోధనచే నియామునకు తెనుఁగును జక్కఁగ వ్రాయను, జదివి యన్వయించుకొనను నేర్చినది. అందుకుఁ జగిశ్రోల్లు కొంతకుఁ గొంత సంస్కృతభాషకూడ నభ్యసించుచుండెను. ఇపు డామె చదువుచుండునది యాంధ్రభారతము.

కొన్ని నిమేషము లూరకుండి యేమో తలంపునకు రాఁగా పుస్తకముపయి నున్న చూడ్కి నించుక మరలించి రుక్మిణినిఁ జూచి కమల

"రుక్కూ! మీపాఠశాలలన్నియు నెపుడు మూయుదురే?" అని ప్రశ్నించెను.

"ఇఁక వారమురోదినములలో. ఎందుకు?"

"ఎందుకును లేదు—నేఁడు నీకు పాఠశాల లేదా?" యని కమల పుస్తకమువంకఁ దిరిగి చూచుచు నడిగెను.

"శనివారము గదా!"

మరల నెవరు వారి పనులలో నుండిరి. రుక్మిణి కమలయడుగు ప్రశ్నలకుఁ దలవంచియే యుత్తరము లిచ్చుచు, ప్రేలికి దారము చుట్టుకొని లాగుచు సూదితో ముళ్ళు వేయుచు మాటిమాటికిని దా నల్లిన యల్లిక బాగున్నదో లేదో పరీక్షించుచుండెను. కమల మరలఁ దన కథ నందెను. కొన్ని నిమేషము లెవరును మాటాడలేదు. చదువుకొనుచు నిశ్చలముగఁ దదేకాయత్తచిత్తయై యుండిన కమల మొగమునందు తటాలున నొక చిన్న మందహాస మంకురించెను. రుక్మిణి తలయెత్తి చూచి,

"ఎందుకే నవ్వెదవు?" అని యడిగెను.

"ఏమియు లేదు. ద్రౌపది సత్యభామకు మంచియుత్తర మిచ్చినది. అందుకు నవ్వితిని" అనిపల్కి కమల మరల నించుక నవ్వెను

కమల చదువుచున్న కథ భారతారణ్యపర్వములోని "సత్యాద్రౌపదీసంవాద" మనుట మాచదువరులు గుర్తించి యుందురు. రుక్మిణిప్రశ్నకు పైయుత్తరమునిచ్చి కమల, యందులో తాను మొదట చదువుకొని నవ్విన,

ఆ. "ఇట్టివర్తనముల నెపుడుఁ బాండవులకుఁ
దగిలి ప్రియముసేయఁ దగితిఁగాని,
మగువ! నీవుసెప్పు మందులు మాయలు
నింద్రజాలములును నే నెఱుంగ!"

అను పద్యమును మరలఁ జదివెను. విషయమును గ్రహింప లేక రుక్మిణి

"సత్యభామ యెవరే?" అని మరల ప్రశ్నించెను.

"అవన్నియుఁ జెప్పవలయునంటే చాలకాలము పట్టును. కాని మీ స్కూలులో భారతమును జెప్పరా?"

“ ఏమే కమలా! యిట్లడిగెదవు? చరిత్రలా? భూగోళములా? ఈపుక్కిటి పురాణములు మాకుఁ జెప్పెదురా?”

“ మీ రేపురాణము లనుకొన్నను సరే గాని నా కీభారతము లోనుండు రుచి యెక్కడను లేదు. నీవు లెక్కించిన వన్నియు ననుప యోగము లని నే ననను గాని, వానితోఁగూడ నిదియును జెప్పఁచుం డిన బాగుండును. మనుష్యులందఱు నేర్వవలసినధర్మము లిం దెన్నియో గలవు.”

“ ఏమి ధర్మములు?”

“ ఒకటి యని చెప్పుదునా? చూచినఁగదా తెలియును. వారు చెప్పినను చెప్పకున్నను నీవైన నింటిలో దీనిని చదువుట మేలు.”

“ ఆధర్మాలన్నియుఁ బెద్దవారికి సరి. మన కెందుకే పిల్లలకు?”

“ పెద్దవారిధర్మములు పెద్దవారికి; పిల్లలధర్మాలు పిల్లలకు; కులకన్యకలు నేర్వవలసినధర్మము లందులో నెన్ని లేవు?”

“ అసలు నాకర్థమైనఁ గదా?”

“ చదువకయే యర్థ మగునా? చదువుచున్నచో రాను రాను సులభముగ నర్థమగును.”

వీధిలో నెవరో పిలిచిన ట్లయ్యెను. ఇద్దఱును తిరిగి చూచిరి. వాకిట సమీపమున నొక కోతిచె ముసలిది—ముందునకైన నొక నల్ల వెండ్రుకకి గానరాని నిర్మలమగు శిరమ్మునపై నొక తాటాకుల బుట్టను మోసికొని, చేత నాలుగైదు గులకరాలు నించిన యాకుగలకలను బట్టి గలగలనాడించుచు, విచిత్రమైన స్వరముతో “ అవ్వో యవ్వ! కన్నతల్లి! కన్నతల్లి! కన్నతల్లి” యనికూయుచునిలువఁబడియుండెను. కరవస్త్రము నల్లుట నిలిపి రుక్మిణిమొగము కొంచెముగంటువేసికొని,

“ ఇప్పుడేమే? వేళ మీఱినది. పో!” అని గద్దించెను.

"తాళవే! పాపము. బిచ్చమైననిచ్చెదను." అని పల్కి కమల పుస్తకము క్రిందనుంచి తటాలునలేచి యింటివాకిటి పంచలో బిచ్చగాండ్ర కిచ్చుటకై యొక చిన్నగంపలోనుంచియుంచిన బియ్యపు నూకలను దెచ్చి "పట్టవే! ముసలిదానా!" యనుచు నాముసలిదాని తలపైనున్న బుట్టలో వైచెను.

"చల్లని తల్లి! చల్లని తల్లి! చల్లని తల్లి!" యనుచు దీర్ఘముగఁ బొగడుచు నాముసిలిది తిరిగిపోవుటకుఁ గాలు గదిలించి మరల కమలస్వభావము నెఱిఁగి కాంబోలు మొగము నీదిక్కునకుఁ ద్రిప్పి,

"సోదె వినవా తల్లీ!" అని యడిగెను.

"నీవు సోదె చెప్పగలవా?"

"రాకేమి నాతల్లీ!" యనుచు నవకాశము దొరికెనని యావృద్ధురాలు సంతసించి మరల వెనుకకుఁ దిరిగి నిరాక్షేపనుగ నాకన్నియలు గూర్చున్నతిన్నియ క్రింద బుట్ట దింపి కూర్చుండి,

"రా తల్లీ! చెప్పెదను" అనియెను.

"సోదె యేమే? నీకు పిచ్చి!" అని పక్కనుండి కమల మొగము చూచి పల్కెను.

"ఇది యొక యుబుసుపోక! చూచుచుందము"

అని పల్కి యించుక నవ్వుచు కమల యింటిలోనికరిగి యొక చేటలో ధాన్యమును తాంబూలమును బసపుకుంకుమలను గొనివచ్చి యుంచి యామసలిదానిముందుఁ గూర్చుండెను. అదియు తనబొంతను నేలపై బఱచి దానిపై తాటకులబుట్టనుంచి యొక కణ్ణతునకయు మంటి ప్రమిదయుఁ దీసియుంచి, వాటినిఁ బసపుకుంకుమలచే నలంకరించి, యిలువేల్పును దలఁచుకొని మ్రొక్కుమని కమలతోఁ జెప్పి చేతికాకఱ్ఱనిచ్చి తనబుట్టను దానితో ముట్టుకొమ్మనియెను. తరువాత "కొల్లాపురమ్మ, కొండలరాయఁడు, కదిరినరసింహుఁడు, కొమార

సామి, కాటమరాజు, ఎంకటేశుఁడు, ఏడుకొండలవాఁడు, పోతులరాజు, బల్లారిదుర్గమ్మ, కనకమారెమ్మా! వాకీయరే!" యని మొదలుగాఁ గొంతతడవు సస్వరముగఁ గొణిగి, గుంటకన్నులనొక్కింతమూసి యేమేమో ధ్యానించెను. పిదప, గడ్డ మన్నచో మగవాఁడనియు, చెక్కిలియన్నచో నాఁడుదియనియు, కుడిభుజమన్నచో మంచిదనియు, నెడమకన్నన్న యెడఁ గీడనియు మొదలుగ వారి సంకేతములు కమలకెఱుంగఁ జెప్పెను. గంభీరభావముతో నేమేమో మనసునఁ దలంచికొనుచుఁ గమల యావృద్ధురాలిముందు చెప్పినదెల్లఁ జేయుచుఁ గూర్చుండి యుండె. ప్రక్కన రుక్మిణి యదంతయుఁ గాంచి నవ్వుచుండెను.

వ్యత్యాసమింతయు లేని స్వరముతో సోయెఱుకసాని యరగంటప్రొద్దు సంకేతములతోఁ దెలియఁజెప్పిన సోదెలో, కమల, తనకు రెండుకోరిక లున్నవనియు, నందొకటి పురుషునకును మఱియొకటి స్త్రీకిని సంబంధించినవనియు, నీరెండు కోరికలలోను దొలుత నించుక యశుభము గలిగి తుదకు సుఖము సంభవించునని యు, ముఖ్యార్థములను సావధానముగ గ్రహించెను. రుక్మిణియు నెఱుంగకపోలేదు. గద్దె ముగిసినపిదప నా తాంబూలమును ధాన్యమును దానికియ్యఁగా "నీకడుపు చల్లఁగపండనీ తల్లీ!" యని దీవించి యాముసలిది తన కరాటము నంతయుఁ గైకొని యచ్చోటుఁ బాసిపోయెను.

అది వెడలిపోయినవెంటనే రుక్మిణి నవ్వుచు నాత్రమున "కమలా! నీ రెండుకోరికలేమే? అని యడిగెను.

"నాకే కోరికలును లేవు."

"అయిన నది చెప్పిన దంతయు నసత్యమే కదా!"

"ఏమో!"

"అట్లన్నావేమి?"

"ఎట్లన్నానే?"

ఇంతలోఁ గార్యార్థము పొరుగింటికిఁబోయియుండిన కమలతల్లి సుందరమ్మ యరుగుదెంచెను. రుక్మిణి పకపకనవ్వుచు నాయమ కెదురుగబోయి, „అత్తా!" అని కమల మొగముఁజూచి „కమలా! చెప్పుదునా?" యని నవ్వు బలముగాఁగా నెట్టకేల కాపుకొని,

„మీ కమల కెఱుకుసాని నేఁడు సోదె చెప్పినది!" అని పల్కి మరింత నవ్వెను.

„దానికంత నవ్వెందుకే?" సుందరాంబ గంభీరముగ నిట్లు పల్కెను „ఏమో యనుకొంటిని. ఏమి చెప్పినది?"

„ఏమో రెండు కోరిక లున్నవఁట! అందొకటి పురుషునకును రెండవది స్త్రీకిని సంబంధించినవఁట! ఈ రెండును దొలుత నించుక భయము గల్గి తరువాత మే లగునఁట!"

„సరి! తెలిసినదే యున్నది." అని పల్కి మరల సుందరమ్మ బిడ్డనుజూచి „రావే! కమలా! గులాబీపూవులు తెచ్చినాను. తలదువ్వి జడవేసెదను." అని యింటిలోపల కడుగు పెట్టెను.

ఆ మెమాట లర్థముకాక రుక్మిణి బేలయయి కమలవంకఁ జూచెను. కాని కమల ప్రత్యుత్తర మీయలేదు. నిరాశయై రుక్మిణి వారి వెన్నంటి „అత్తా! నాకును జడవేసెదవా? ఇంక నిపు డింటి కెవరు పోవుదురు!" అని యడిగెను.

„నీవును రా, అల్లెదను" అని పల్కి సుందరమ్మ లోపల కేగెను. ఇంటి లోపలి కేగునపుడు మరల రుక్మిణి కమల మొగముఁ జూచెనుగాని గంభీరమైన యాముఖబింబమునుండి చిఱునవ్వు దప్ప మఱి యేమియు నుత్తరము రాలేదు. ఇరువురు నింటిలోపల కేఁగిరి. పోవునపుడు కమలనోటినుండి మృదుస్వరమున నాద్రౌపదిమాటలే వెలువడుచుండెను.:—

„ మగువ! నీవు సెప్ప మందులు మాఁకులు
నింద్రజాలములును నే నెఱుంగ!"

———

# పరిణయసరణి

---

## రెండవ ప్రకరణము.

—:o:—

### “చిత్రపటము”

“విశాలం శాల్మల్యాః నయనసుభగం వీక్ష్య కుసుమం
శుక స్యాసీ ద్బుద్ధిః ఫల మపి భవే దస్య సదృశమ్,
సమాయాతే తస్మి న్ఫల మపి చ దైవా త్పరిణతం
విపాకే తూలోఽన్త స్సపది మరుతా సోఽప్యపహృతః”

(పండితరాయ జగన్నాథకవి)

పుష్యమాస మాసన్నమయ్యెను. దివసములు కుఱుచలుకాఁ జొచ్చెను. తెల దిమ్ముఁబట్టించు తమమున నేటియుష్ణము నెందు దాఁచెనోగాని, యెండలు నీరెండలై యనుభవించువారికమితాహ్లాదదాయకములయ్యె. అరజాము ప్రొద్దెక్కువఱకు నాకసమున దట్టముగఁ బొగమంచు గ్రమ్మి యర్కబింబము నావరించి తమకసి దీర్చుకొనుచుండెను. చలి యధికమయ్యెను.

పాఠశాలలు మూయఁబడియె. చలికాలపు సెలవుదినములారంభములైనవి. విధిలేక వ్యాసంగమునకై దూరసీమలకుఁ బోయిన తమ పుత్రు లెపుడువత్తురో యని కన్నతల్లు లెదురు చూచుచుండిరి. తమ్ము వదలిపోవునాఁడు సిగ్గుచే పలుకనలేక, దూరదేశముల వ్యాసంగము చేయుచున్న మనోహరులచిరవిరహము నోర్వఁజాలక లోలోనఁ బరితపించుచు, సెలవుదినము లెన్నఁడు మొదలో యని లెక్కించుచు, నూత్న కాంతలు, చింతించుచుండిరి. గుంపులు గుంపులుగ విద్యార్థులు వివిధ కుతూహలాకృష్టమానసులై స్వగ్రామములఁ జేర రా సాఁగిరి. ఎక్కువగా విరామకాలమునఁ గూడఁ జదివినచో బుద్ధిచెడిపోవునని కాఁబోలు, పగలంతయుఁ బుస్తకమును ముట్టక, కలవారు భార్యలతోను,

లేనివారు తల్లిదండ్రులు మొదలగువారితోను, యథావకాశముగఁ బాఠశాలలోఁ దమతమ శక్తియుక్తులను గూర్చియుఁ దామందిన బహుమానములఁ గూర్చియుఁ దమతమ యుపాధ్యాయుల బుద్ధి తక్కువలను గూర్చియు నిరర్గళముగఁ జర్చించుచు, సాయంకాలమున నాల్గుగంటలు గొట్టినవెంటనే పలుతెఱంగుల రంగులు రకములుగల యంగరకాలును మెడపట్టీలును ధరించి కాలిత్రిత్తులను దొడిగికొని జిన్ని బెత్తమును గ్రిందికి మీఁదికి నాడించుచు వ్యాయామమునకని రథ్యల వెంబడి నలుప్రక్కలఁగలయ నాలోకించుచుఁ బోవుచుండు విద్యార్థుల గుంపులా కాలమునఁ జూచువారి కెంతయు సంతసమొసంగఁ జాలినవని చెప్పవచ్చును.

పుష్యమాసము నడచుచుండెను. ఒకనాఁటి యుదయమున బళ్ళారిపురమున నొక చిన్న వీధిలోనున్న శ్రీనివాసశాస్త్రిగారి యింటి ముందు వసారాలోనున్న యొక చిన్నగదిలో నొక తరుణుఁడు పేప కురిచీపైఁ గూర్చుండి పుస్తకమొకటి చేతఁ గొని చదువుచుండెను. వయసు సుమా రిరువదిమూఁడు సంవత్సరములు దాఁటియుండును. పాలచెంగావి వస్త్రమును గట్టి ప్లానల్ చొక్కా తొడిగికొని సన్నని తెల్ల సెల్లా యుత్తరీయముగ వేసికొని సవిలాసముగఁ గూర్చున్న యాతరుణుఁడు చాలనందము గలవాఁడు. కుచ్చులు కుచ్చులుగ శిరఃపార్శ్వములఁ బెఱిగి మందమారుతవశమున విశాలమగు నతనిఫాలభాగమున కిరుప్రక్కలను గడముట్టించుఁ జిందులుద్రొక్కుచుండిన యతని చూర్ణకుంతలములు చాలముచ్చటగ నుండినవి. చలించిన కొలఁది తళతళలాడుచున్న రవలయుంటుజోడును, ఆవశ్యకతకై యందమునకై ధరించిన బంగారు పైపూఁతగల సులోచనములును, అతని మొగమున కొక క్రొత్తయందము నిచ్చుచుండెను. ప్రక్కనున్న బల్లపై దొంతరలుగనుంపఁబడిన గొప్పగొప్ప పుస్తకములే యతఁడొక గొప్పతరగ

తిలోఁ జదువుచున్నవాఁడని చెప్పక చెప్పుచున్నవి. ఇతఁడా భవనస్వామి
యగు శ్రీనివాసశాస్త్రిగారి కుమారరత్నము. పేరు 'అనంతనాథశర్మ'.

శాస్త్రిగారు వైదికవృత్తి నవలంబించినవారయ్యును, ప్రస్తుతా
చారమును మీఱక తన కుమారునకుఁ జిన్ననాఁటనుండి యింగ్లీషు
చెప్పించుచుండెను. పదునాఱవ సంవత్సరమునందే భారముఁ దెంచు
కొనవలయునని కుమారునకుఁ దనబంధువులలో నొక తొమ్మిదేండ్ల
దాఁటనికన్యకను బరిణయము గావించెను. ఏకపుత్రుఁడు గలవాఁడును
అభిమానియునగుటచేఁ గాఁబోలు, నావైదికశిఖామణి, హిందూ
నూతనధర్మశాస్త్రప్రకారము కుమారుని విద్యావ్యాసంగమునకు
వలసిన ధనము నియ్యవలసినభారము వియ్యంకునిపైఁ ద్రోయక
తానే వహించి నడుపుచుండెను. బళ్ళారిలో ప్రవేశపరీక్షలోఁ గడతే
ఱి చెన్నపురికరిగి, యనంతనాథుఁడు,నాలుగేండ్లనుండి యచ్చటి కళాశా
లలో పట్టపరీక్షకై వ్యాసంగము చేయుచుండెను. ఇప్పుడు వ్యాసంగము
ముగిసి పరీక్షనిచ్చి వచ్చియున్నాఁడు; కాని కృతార్థత యింకను దెలియ
లేదు.

నాగరకాచారము చొప్పున నాఁడు ప్రాతఃకాల పారణ నిర్వ
ర్తించి యనంతనాథుఁడు తనగదిఁ జేరి సుఖాసనమునఁ గూర్చుండి ప్ర
క్కనరలోనున్న పుస్తకముల వంక దృష్టి సారించెను. చరిత్రలు కావ్య
ములు పెక్కులుండెనుగాని, కలాశాలలో చదివి చదివి విసుకువచ్చిన
కారణమున నవియిప్పుడు పనికిరావు. నవలలు—అందును శృంగారవి
షయకములగునవి—కావలసియుండెను. పుస్తకములను దీసి తీసి చూ
డ అంతఃపురరహస్యములు అను నవల చేతికిఁ జిక్కెను. పత్రములను
ద్రిప్పి త్రిప్పి నడుమ నడుమఁ గొన్ని భాగములను జదువుచుఁ బైనఁ
జూచుచు మరల మరలఁ జూచి చదువసాఁగెను. కొంతసరికిఁ దన
ముఖమున మందహాసమంకురించెను. కారణ మెఱుంగరాదు కానితటాలు

నఁ బుస్తకము మూసి ప్రక్కలో వ్రేలాడుచున్న తన చొక్కాయిలో నుండి యొకవస్తువును దీసి చూచుచు మరల కూర్చుండెను. అదియొక ఛాయాచిత్రము. అభినవ తారుణ్యలావణ్యశోభితయగు నొక ముద్దు గుమ్మ యందు చిత్రింపఁబడియుండెను. మేజాపయినున్న దర్పణఫలక మును తనకభిముఖముగ సవరించుకొని యనంతనాథుఁడు చేత నాపట మును బట్టి రెప్పవాల్పక చూడఁ దొడఁగెను. నడుమనడుమ దర్పణ మునఁ దన ప్రతిబింబమును వీక్షించుచు మందహాస మభినయించి సాభిప్రాయముగ నధరమును విరుచుకొని చూచి యానందించుచుండె ను. కొంతవడి చూచి లేచి గోడను వ్రేలాడుచున్న తన ఫోటో చెంత దానిని నిల్పి చూచెను. మరలఁ గూర్చుండి కుర్చీ కానుకొని యాచిత్ర మును హృదయమున కానించికొని కన్నులరమోడ్చెను.

„అనంతా!" లోపలినుండి యెవరో పిలిచిరి, కానియాపిలుపు కర్ణపుటముల సోఁకలేదు. సర్వేంద్రియములును ఏకాగ్రముగ నిర్వృత్తిఁ జెందినవి. అనంతుఁ డిపుడెందున్నాఁడో యేమిచేయుచున్నాఁడో యనం తునకే తెలియదు!

నిమిషములయిదు పరువిడెను. అనంతనాథుఁడు కన్నులు విచ్చి చిత్రపటము నెత్తియొక్కమాఱధరమునుసోఁకించెను. మాసెననిశంకించె నేమో, దానికిరవస్త్రముచేఁ దుడిచి స్వస్థానముఁ జేర్చెను. తరువాత నేమో తలపోసి లేఖన సామగ్రిలందుకొని యొకలేఖ వ్రాయనారం భించెను. ఎట్లు ప్రారంభింపవలయునోయింకను నిర్ణీతముగాలేదు. ఇం తలో గదిలోనికెవ్వరో, వచ్చినట్లగుటు నించుక కార్యభంగము గలిగెను. తిరిగి చూడఁగా తల్లి పార్వతమ్మయు నామెవెంట తండ్రియు వచ్చి యుండిరి.

„ఎవరికిరా! జాబువ్రాయుచున్నావు?" శ్రీనివాసశాస్త్రి సమీ పించియడిగెను. అనంతుఁడు లేచి తలవంచి మెల్లగా —

“నాస్నేహితునకు” అని బదులిచ్చి, లేఖన సామగ్రుల పేటిక చో నుంచెను. పార్వతమ్మ ప్రేమబద్ధముగు నధికారముతో కొడుకును జూచి,

“బాబు వ్రాయుచున్నఁ బిలిచినను బలుకఁ గూడదా?” యనెను.

“ఎవరు పిలిచినది?”

“నేనే”

“ఎప్పుడమ్మా?

“ఇంతకుముందు”

“ఏమో. నేను వినలేదు”

కుమారుఁడు విడిచిన కుర్చీపైఁ గూర్చుండి శ్రీనివాసశాస్త్రి, ప్రక్కబల్లపైనున్న పుస్తకమొకటి త్రిప్పివేయుచుగొడుకును జూచి

“నీపరీక్షాఫల మెప్పుడు తెలియును?” అనియడిగెను.

“ఇంక నెలదినములలో బయలు పడును”

“బాగుగ వ్రాసినావా?”

“బాగుగనే వ్రాసినాను.”

కుమారుని చెంతఁ జేరి పార్వతమ్మ తల దువ్వుచుఁ జిక్కువడ్డ కుంతలములను విడఁదీయుచుండెను. రెండునిమిషము లెవరును మాటాడరైరి. మరల శ్రీనివాసశాస్త్రి తలయెత్తి,

“అయిన నిన్న నే నడిగిన దాని కేమి ప్రతినిర్ధారణ చేసితివి? ఇట్లూరక కాలము గడుపుట మంచిదిగాదు” అనిపల్కెను.

కుమారుని యుత్తరమున కవకాశమీయక పార్వతమ్మ,

“కసికంద! వాని కేమి తెలియును! ఈమాఘములో లగ్నము నిర్ధారణచేయుఁడని వ్రాయరాదా?” అనిపల్కెను.

“అట్లుగాదు. వాఁడు చెప్పిన వ్రాసెదను”

అనంతనాథుఁడేమియు బదులీయలేదు, తలవంచుకొని నిలిచి

యుండెను. అతనిముఖమునం దేమో గంభీరభావము పొడసూపు చుండెను.

"ఏమిరా మఱి అట్లూరకున్నావు ? పార్వతమ్మ" అనెను.

"నన్నేమి చేయుమందువు ?" అనంతుఁడు తలయెత్తి పల్కెను.

"కానిమ్మనరాదా!"

"ఈవిషయము నేనింకను నాలోచింప వలయును!"

"చూచితివా ?" శ్రీనివాసశాస్త్రి భార్యవంకఁ జూచెను.

"నాయనా ! పసివాఁడవుగావు. నీకెక్కువ చెప్పవలెనా? ఇప్పటికే నలుగురితో నాడికలయినవి. నీభార్య ఋతుమతియయి యిప్పటికే ఒకటిన్నరయేఁడు మీఱినది. ఇంకను నిలుపుట యపకీర్తికర మగును. చిన్నతనమున నీయిష్ట మడుగక చేసితిమను తప్పొక్కటితప్ప మఱేమియు లేదు. చిన్నది నక్షత్రమువలె చాల బాగున్నది. వివాహమైన నాఁటనుండి నీవొకనాఁడైనఁ బోయిచూడక వట్టిఅసహ్యపడుచున్నావు. ఎట్లో చేసితిమి. మా మొగముఁ జూచియైనను సమ్మతింపుము."

"ఏమి ? ఊరకున్న నెట్లు ? కానిమ్మనరా!"

"నాకింక నెనిమిది దినము లవధియిచ్చిన ... ..."

"ఏల ? అప్పుడైన సమ్మతింతువా?" శ్రీనివాసశాస్త్రి తలయెత్తి చూచి యడిగెను.

"అవునో కాదో చెప్పెదను" మెల్లగ ననంతుఁడు పల్కెను.

"సరి" శ్రీనివాసశాస్త్రి మెల్లన నిట్టూర్చెను.

"ఏమిరామూర్ఖత ! కారణము చెప్పరాదా ? నీవిపుడు వలదన్న నాచిన్నదానిగతి యేమి కావలయును ? దాని యుసురు నీకుఁ దగులదా ? ఈపట్టువలదు. సమ్మతింపుము. నామాటయైన విని యొప్పుకో" అని పార్వతమ్మ ప్రేమపూర్ణముగ కుమారుని వేఁడుకొనెను.

" ఎనిమిది దినములలో బెంగుళూరికిఁ బోయి వచ్చి చెప్పె దను. ఇంతమాత్ర మవధియిండు"

" బెంగుళూరికా ? " శ్రీనివాసశాస్త్రి ఆశ్చర్యమున నడిగెను.

" చిన్నదానిని జూచివచ్చునేమో ! కానిలెండు, " అనిపల్కి పార్వతమ్మ కొడుకుతో " మంచిది. పోయిరా " అనిపల్కెను.

" ఎప్పుడు వెళ్ళెదవు ? " తండ్రి యడిగెను.

" నేఁడు సాయంకాలపుబండికి "

" సరి. ఇంక మీరు కావలసిన వస్త్రాభరణాదులను సేకరింపఁ గూడదా ? " పార్వతమ్మ మగనినడిగెను.

" కాదు. వాఁడు పోయిరానీ."

అనిపల్కి శ్రీనివాసశాస్త్రి గదివిడిచి లేచిపోయెను. పోవుచు మనసులో "కాలము చాలఁ జెడిపోయినది. పిల్లలు చెప్పినట్టు వినరు" అనుకొనెను. కొన్ని నిమిషము లూరకుండి పార్వతమ్మ గదివెలుపలఁ దొంగిచూచివచ్చి—

" కాదురా ! మొన్న మద్రాసునుండి వచ్చునప్పుడు బెంగుళూరిమీఁదనే కదా వచ్చితివి. అపుడు చూడలేదా ? మరల నీప్రయాణమేల ?" అనియడిగెను. అనంతుఁడించుక నవ్వి,

" చూడవలసినదంతయుఁ జూచినాఁడను. ఐనను ఇంక గొంత మిగిలియున్నది."

" నీమాట లేమో నాకర్థము గాలేదు."

" వచ్చిన మీఁదఁ దెలియఁగలదు."

మరల ననంతనాథుని ముఖమున మందహాస మంకురించి మాటువడియెను. కొంతవడి కతఁడు పరిపూర్ణమగు ప్రీతిరసము కన్నులం దొలుకుచుండఁ దన్ను గాంచుచున్న తల్లిని జూచి మెల్లగ నిశ్వసించి యిట్లనియె.

„ అమ్మా! మంచి సుందరి యగు చతురయొక్కతె నీకోడలై యుండిన నీవెంత యానందించుచుందువో గదా!

„ ఆమాటలాడి యిపుడేమి ప్రయోజనమయ్యా! జరుగఁదగినది చూచుకొమ్మా. వట్టియడియాసలు మంచివిగావు. నామాటవిను. వారిది మొఱకుపట్టు. కోపమువచ్చినఁ గష్టము. వారికి సమాధాన మొనరించుట నీకుఁదగదు. ఇంతకును నీభార్య కురూపిణియుఁ ననాగరకయు గాదు. వయసువచ్చినందున చాల తెలివితేటలుగలిగి రూపవతిగ నున్నది. చదువను వ్రాయను బాగుగనేర్చినదఁట. నీవును నేఁడుపోయి చూచిరమ్మా. స్నేహితులవెంటఁ బడి తామసింపకుము. త్వరలో శుభము జరుగవలయును. లగ్నములు లేవఁట."

తల్లి యుపన్యాసము ముగియకమునుపే తనయుఁ డందుకొని, „ అమ్మా! వారముదినములలోఁ బోయి వచ్చెదను. ఆమీఁద నాలోచింతము లెమ్మా." అని ముగించెను.

ఇంటి ముంగిట నొక బిచ్చగాఁ డఱచుచుండెను. విని పార్వతమ్మ గదినుండి వెడలెను. తరువాత నొక్కింతతడ వాలోచించి యనంతనాథుఁ డేమో జ్ఞప్తికిఁ దెచ్చుకొని విద్యుద్వార్తా ప్రేషణాలయమునకుఁ బోవలయు, నని పయనమై యాగదిఁ బాసెను.

—*—

## మూడవ ప్రకరణము.

—:o:—

### బెంగుళూరు ప్రయాణము.

„ అసులభా సకలేన్దుముఖీ చ సా కిమపి చేద మనఙ్గవిచేష్టితమ్।
అభిముఖీష్వివ కాంక్షితసిద్ధిషు వ్రజతి నిర్వృతి మేకపదే మనః"
(విక్రమోర్వశీయము.)

అరుణోదయవేళ యగుచుండెను. తపస్సిద్ధుని హృదయము వలె తూర్పు క్రమక్రమముగ నిర్మలమగుచుండెను. అంతకుముందే

మేలుకొని తెక్కల విదిల్చికొని నిద్రాజాడ్యమును వదిలించుకొని కల కలధ్వనులఁ జేయుచుండు పక్షిజాలములచే నిండి యిరుప్రక్కల క్షణ మాత్రదృశ్యములగు నరణ్యతలములు, తమతమ పనిపాటులలో జాగరూకులగు కాఁపుగుంపులతో నిండియుండు గ్రామసీమలకు దృష్టాంతమునఁదగియుండెను. చంద్రుఁ డస్తమునుబొంది చాల సేపయి యుండుటచే, నందందు ధూమలమేఘశకలములచే నంతరితంబులై వెలవెలఁబాఱుచున్నను నొండురెండు నక్షత్రము లింకను బింకమువదలక మినుకుమినుకుమని కానవచ్చుచుండెను. పైన కాచగోళకములలో వెలుగుచున్న దీపకళికలుగూడ విరహవేదనచే రాత్రియంతయు వెఱ్ఱివెఱ్ఱియూహలచే నడియాసలువడుచు భ్రాంతులై పొరలుచున్న నూత్నవియుక్తవిద్యార్థుల మొగములవలె, కాంతివిహీనములు కాఁజొచ్చెను. సహజముగ మందముగ నుండవలసిన యాకాలపుమారుతము, వేగవశమున నమందమై, యప్పుడే సమ్మర్దము కొంత తొలఁగి సుఖముగ నిద్రింపఁ బూనిన బాటసారుల నిద్ర కించుక విఘాతముఁ గల్గఁజేయుచుండెను. స్వధర్మము నింతయైన నేమరక, కాలచక్రము, నిజధర్మరతులకు మార్గదర్శక మగుచుండెను. తెల్లవాఱెను,

ధూమశకటముగూడ వేళదప్పక 'యశవంతపురము' చేరినది. పాంథుల కలకలముచే శకటపంక్తిలోఁ బరుండి నిద్రించువారందఱును మేలుకాంచిరి. ఆతరుణమున నందలి రెండవతరగతిబండిలో నిద్రించుచున్న తరుణుఁడొక్కఁడు తటాలున మేలుకాంచి భ్రాంతుఁడై లేచి కిటికీలో, దలదూర్చి చూచెను. ఇంకను దన గమ్యస్థానముఁ జేరలేదని యర్థమైనది. మరలఁ గూర్చుండెను. ఇతఁడు మన యనంతనాథుఁడే.

వెనుకప్రకరణమున సూచించినప్రకార మనంతనాథుఁడు బెంగుళూరి కరుగుచున్నాఁడు. మూఁడవతరగతి బండిలో జనసమ్మర్ద మధికమనియో, లేక యందుఁగూర్చుండుట తన యోగ్యతకుఁ దగద

నిమో, యెఱుఁగము. అతఁడు రెండవతరగతిబండిలో బ్రయాణము
చేయుచుండెను. రాత్రియంతయు నేమేమో తలంపులు వచ్చినవి.
నిద్ర రాలేదు. ఇంతకుముందే యుంతకన్నులు మోడ్చియుండినవాఁడు.
కాని హృదయము నావరించియున్న కలవరమునకుఁ దోడుగ నిందలి
కలకలమును జేరి యతని నిద్రకు భంగము గల్గించినది. మరలఁ దల
నేలను వైచెను గాని నిద్రపట్టలేదు. "ఇంకేమి నిద్ర. పాడునిద్ర!"
యనుకొని లేచెను. నిద్రాదేవి వదలిపోయిన చిహ్నముల సవరించు
కొని కన్నులు నులిమికొని కూర్చుండెను. కిటికీలోఁ జూచెను. బండి
నడుచుచుండలేదు. నిమిషమాఁగి మరలఁ జూచెను గాని ప్రయోజ
నము లేదు. విసుగు జనించినది. కార్యగౌరవమెంతఘనమో కాని యనం
తనాథుఁ డెంతయు తొందరపడుచుండెను. కాని మనయాత్రమును
బొగబండి యెఱుంగఁగలదా? దాని పద్ధతి దానిది. నియమితకాలమున
నియమిత కార్యము మాత్రమే చేయ గలదు.

అనంతనాథుఁడు మరల యథాస్థానమునఁ గూర్చుండి, తల
ప్రేలవైచికొని కుడిచేతిని దానికాధారముగా నిడికొని, కన్నులు
మూసికొనియెను. అతఁ డేమి యోచించుచుండెనో మన మెఱుఁగము.
మరలఁ బదినిమిషములు గడచెను. బండి కేకవేసి కదలెను. "అబ్బ!
కదలినదే" యనుకొని యాతరుణుఁడు తన యుడుపులను సవరించు
కొన సాగెను. వెనుకను ముందును గుడి యెడమప్రక్కల నరకాళ్ళు
గూడఁ గప్పుకొను చుంగులు నేలఁ గోరాడునట్లు తెల్లనిచలువమల్లును
ధరించెను. విడిచియుండిన పాదరక్షలనుదీసి మైలఁదుడిచి తొడిగి
కొని, రకరకములయంగీలను మెడపట్టీలను ధరించి గులాబీవన్నెగల
పాగా యొకటిదీసి యోరగాచుట్టికొనియెను. తరువాత సులోచనము
లను దుడిచి ధరించికొని, చేతిపెట్టెలోనున్న యద్దమునుదీసి మోము
చూచుకొని, చెవులప్రక్కలఁ దిరిగి వ్రేలాడునట్లు చూర్ణకుంతలముల

సవరించుకొనియెను.

అలంకారపూర్తి యైనది. కిటికీలోఁ దొంగిచూచెను. బెంగుళూరునగర మింకను రాలేదు. విరామములేక బండియొకటే వేగమున 'కటకట' మని చప్పుడుచేయుచు ధీరముగఁ బరుగెత్తుచుండెను. చుట్టును బాగమంచు క్రమ్ముకొన్నది. నడుమఁ ద్రోసికొనిపోవుచుండుశకటము పర్వతగుహలోఁబోవుచున్నట్లు తోఁచుచుండెను. ఇదివరకు సహముగనున్న త్రోవ యిప్పు డొకింత యెటవా లయ్యె. బండీ వేగము దుర్నిరోధమయ్యెను. 'గడల్ కట్' అను ధ్వనికినిలుకడలేదు. ఒక్కచోట ప్రక్కలనే దట్టముగఁ బెరిగియున్న తరుగుల్మలతాదులు గిరగిరఁ దిరుగుచుఁ బొ(లి)పుచుండెను. మరియొకక్షణమునకు విశాలములైన పచ్చికబయళ్ళు,—వెంటనే యున్నతనారికేళవృక్షపరిశోభితములగు నాఁకుఁదోఁటలు,—మనోహరపల్లవపరికర్మితములగు గుజ్జుమామిడితోపులు—సేద్యగాండ్రతోనిండిన సస్యసమృద్ధప్రదేశములు, మొదలగు నానావిధ ప్రకృతిదృశ్యములు చిత్రముగ మాఱుచుండెను. ఏదృశ్యమును రెండవమాఱుచూడ నవకాశములేదు. అంతయు నింద్రజాలమువలెనుండి, యామనోహరప్రాతస్సమయమునఁ గన్నులఁ దన్పుచుండెను.

కాని మన యనంతనాథున కివి యొక్కటియు రుచింపలేదు. అతనిమన సంతయు బెంగుళూరిపై నున్నది. నిమిషము గడుచుట కష్టమైనది. ముందు గానవచ్చుమార్గమున బెంగుళూరిచిన్నె లేవైనను గానవచ్చునేమోయని దీర్ఘముగ వంగి తొంగి చూచెనుగాని యేమియుఁ గాన రాలేదు. "ఈపాడుబండికన్న గుఱ్ఱపుబండి మేలు!" అనుకొని విసుకుఁజెంది మరల నాసీనుం డయ్యెను. ప్రొద్దుపుచ్చుమార్గము గానరాలేదు. అదృష్టమునకు సరిగ నతఁడు గూర్చున్నబండిలో మఱెవ్వరును నుండలేదు. తాను వచ్చునప్పుడు 'గుంతకల్లు' లోఁ గ్రయము

నతనుఁ దీసికొనివచ్చియుండిన యొకయాంగ్లేయమాసపత్రిక యాచెంతఁ బడియుండెను. తీసికొని చదువనారంభించెను. పుటలుద్రిప్పెను. దాని నిండ ననేక విధములగు చిత్రపటము లుండినవి. కొన్నిటినూరక చూచెను. కొన్నిపంక్తులను జదివెను. కాని చూచిన దేమియో చదివిన దేమియో యర్థముకాలేదు. మరలఁ జదివెను. ఇపుడుమాత్ర మర్థమైనదా? ఆపుస్తక మేమైన నెఱుఁగు నేమో! కాని యనంతనాథుఁడుమాత్రము తన కర్థమైనదియు లేనిదియు నొక్కటియు నెఱుఁగడు. ఇంతలో నొకటిమాత్ర మతని మనస్సున కర్థమయ్యెను. ఏది? పొగబండి కూత!

అనంతుఁడు కిటికీలో నాత్రమునఁ దొంగిచూచెను. నిజముగ బెంగుళూరు సమీపించినది. ప్రక్కనుఁజూడఁగా రణరంగమునందుండు ధీరులవలె నిలువంబడియున్న యెత్తయిన పొగగొట్టములు పెక్కులు దృగ్గోచరము లయ్యెను. ఇంకను నార్పఁబడమిచే వీథుల వెంబడి విద్యుద్దీపములు స్తంభములపై రత్నాలతోరణములవలెఁ బొలుచుచుండెను. ఎత్తయి, విశాలములయి, ప్రాకారోద్యాన పరిశోభితములగు మేడలు, కర్మశాలలు, రాజకీయప్రాసాదములును కనులపండువుగా నొకటివెనుక నొకటి నిక్కుచు రాసాఁగెను. బండివేగమును మందగించినది. సూర్యోదయసమయమునకు శకటము గమ్యస్థానముఁ జేరి నిలిచెను.

అంతయుఁ గోలాహలము; అంతయు గడబిడ; అంతయు జనసమ్మర్దము; పిలుపులు, అరపులు, కూఁతలు, ఈలలు, ఎందుఁజూచినను బ్రతిధ్వను లిచ్చుచుండెను. తినుబండములను పండ్లను పలురకముల చిల్లరవస్తువులను తలలపై తట్టలలో మోసికొనుచుఁ గొందఱు బండి బండి కడకునువచ్చి వింతవింతస్వరములతోఁ దా మమ్ముచుండు సామానుల పేళ్ళను దండకముగాఁగూర్చుకొని పాడుచుఁదిరుగుచుండిరి. "బండి! బండి!" యని తొంగితొంగిచూచు బాడుగవారియఱపులును, "కూలి! కూలి!" యని కూతలువెట్టుచు నంగీకారము లేకయే

దిగుచుండు ప్రయాణికులచేతి మూటలను బలవంతముగ లాగుకొను కూలివారికోలాహలమును, తామే ముందు దిగవలయుననియున్న యా యింత చిన్నవాకిటిలో నొకరినొకరు త్రోసికొని మూటలను జేతఁగట్టిగఁబట్టుకొని తమమీఁదఁబడు నితరులకు మాటలచేతనో యేటులచేతనో బుద్ధిఁజెప్పుచుఁ దొందఱపడు బాటసారుల గడబిడయును, జేరి చిత్రతరముగనుండెను. కొందఱు రానున్న తమమిత్రులనో చుట్టములనో వెదకుచు బండిబండిలోను దొంగిచూచుచుఁ బేర్లుపెట్టి పిలుచుచుఁ బరుగెత్తుచుండిరి; మఱికొందఱుసామానుబండిలోనున్న తమతమపదార్థములఁ దీసికొనుటకై యచటి కర్మకరులను వేఁడుకొనుచు వారికిఁ గొంచెమాసఁజూపి కృత్రిమకోపము నాఁపుచుండిరి; ఇంక గొందఱు, తాము వేఱుకడఁ జూచుచుండ నపుడు చేయిచురుకుగల మహానుభావు లెవరో క్రింద దించియున్న సామానులను గత్తిరింపఁగా వానిని వెదకికొనఁ దత్తరపడుచు విభ్రాంతిఁబొందుచుండిరి; వెండియుఁ గొందఱు కూలివారితోను బాడుగబండ్లవారితోను గూలి విషయమునను బాడుగ విషయమునను గలహించుచుండిరి; ఈవిచిత్రము లన్నియుఁ జిఱునవ్వులతోఁ జూచుచుఁ గొందఱు తరుణులు విలాసముగఁ దిరుగాడుచుండిరి. జనసంఘమున నిసుక చల్లినను రాలదు. ఒక మొగముగాదు; ఒక దేశముగాదు; ఒక వేషముగాదు; ఒక భాషగాదు. ఒకమాటకు నింకొక మాటకును సంబంధములేదు. ఆసమయమున, నాచోటఁబోడకట్టు నాజాతి మత భాషావేషసాంకర్యమును జూచి తీరవలయును.

అనంతనాథుఁడు బండినుండి యవతరించి నలుదిక్కులఁ జూచెను. ఇంతలో నొక తరుణుఁడువచ్చి వానిచేయి పట్టుకొనియెను. అనంతుఁడును దటాలునఁ దిరిగిచూచి వికసితవదనముతో —

"ఓ! వచ్చితివా? ఎవరును రాలేదే యనుకొంటిని." అనెను.

"రాక పోవుదునా? నీవు తంతినిచ్చి యుండ లేదా?" యని

పల్కి యాతరుణుఁడు వెనుకనున్న యొక పనివానిని జూచి,

"అట్లునిలిచియున్నా వేమి? సామానుదించరాదా? యనెను.

"చిత్తము" అని పనివాఁడు సామానుదింపఁబోయెను. అనంతుఁడు, తనచెలికానిని జూచి "రామమోహనా! బండివచ్చినదా?" యని యడిగెను.

"ఓహో! రాకున్న నెట్లు! ఆవల నిలిపి వచ్చినాను. మనము పోదము రమ్ము"

అనిపల్కి రామమోహనుఁడు అనంతుని చేయిపట్టుకొని, వెడలుచు వెనుకకుఁదిరిగి పనివానితో సామాను మోసికొని రమ్మని చెప్పి ముందునకు వెడలెను. ఇద్దఱు నుజనసమ్మర్దమునుగడచియావల తమకై వేచియున్న యొకమహార్హమగు గుఱ్ఱపుబండి నెక్కిరి. ఆసమీపమున నున్న తక్కినగుఱ్ఱపుబండ్లు, రబ్బరుబండ్లు, మోటారుబండ్లు నన్నియు జనుల నెక్కించుకొని దిక్కున కొక్కటిగ నానగరవీథులంబడి పరుగెత్తసాఁగెను.

అనంతనాథుని బండిగూడ నిమిషమాత్రమున నావీథులంబడి యదృశ్య మయ్యెను.

—*—

## నాలుగవ ప్రకరణము.

—:o:—

### గమ్యస్థానము.

"మ. తళుకుం బంగరుఁ జెక్కుటద్దములపైఁ దాటంకరత్నద్యుతుల్
గులుకన్, వెన్నెలకొక్క వన్నెనిడు డాలుంగల్గు కొప్పింబట్టు దు
వ్వలుపం గాంచన కాంచి గాప్పిల జలజాభంబైన చోళంబు నా
కలికిం బోలెడు కన్నెగల్గదెట లోకంబందు...... "

(వావిలకొలను సుబ్బారావు. సుభద్రావిజయము. అం. ౧)

నిరంతర జనసంచార సంకులములైన బెంగుళూరువీథులం దాటి చన్నచో నావల విశాలములైన చక్కనిమైదానములును, రమణీయోపవనములును, నడుమ నడుమ నత్యున్నతములై మహోన్నతములైన హర్మ్యరాజములును గనుపట్టఁగలవు. రాజమార్గమతివిశాలము గొప్ప గొప్ప వారే యందు వసించుచుంటచేతను, ఆసమీపముల నంగళ్ళులేమిఁ జేసియు సామాన్యజనులును చిల్లరబండ్లును అందు సంచరించుటలేదు. అందును పగలంతయు నాప్రదేశము చాలవఱకు నిశ్శబ్దమున నిర్మలముగ నుండును. కాని యిపుడు సాయంసమయము గాన విహారార్థము తిరుగాడు వారు మాత్రము గొందఱు కనఁబడుచున్నారు. అందందు కృతకశిలావేదికలు కొన్ని గలవు. వానిపైఁ గూర్చుండి నిర్మలవాయు సేవఁ జేయుచుఁ గొందఱు విద్యార్థులు పుస్తకములఁ బట్టి చదువుచుందురు. కొందఱు తరుణశిఖామణులు సవిలాసముగ వచ్చియురాని రాగముల మెల్లగ నాలాపనచేయుచుఁ జేతిబెత్తములఁ దిప్పుచుఁ జరింతురు. కొందఱు హిందూతరుణీమణులు చక్కఁగ నలంకరించుకొనికిటికీలనుండి యాప్రదేశరామణీయకమును దిలకించుచు' మెల్లన నడుచుచున్న గుఱ్ఱపుబండ్లలోఁ బోవుచుందురు. ఆకస్మికముగఁ ద్రోవలో నెదురుగ సంధించి చిఱునవ్వుతో నొకచేత సలాముచేసి స్త్రీపురుష విభేదములేక చేతులు చేతులు గలిపి పిసికి కొనుచుఁ గుశలప్రశ్న లొనరించుచుఁ గొంద ఱాంగ్లేయహిందూ మహాజనులు నందందు సవిలాసముగఁ దిరుగాడుదురు.

ఇరుప్రక్కల నందందు గృహారామములనడుమ నిక్కుచుఁ బొడకట్టుచున్న సౌధముల నొకటి చూచిన కంటెకింకొకటిఁ జూడ రాదు. ఒకటి గొప్పవర్తకునిది; వేఱొకటి యొకన్యాయవాది మందిరము; ఇంకొకటి యొక న్యాయాధిపతిభవనము; మఱియొకటి యొక జమీన్దారునిదగు ఒకటికన్న నొకటిమిన్న. ఆవలనున్న 'యొకసౌధ

మతిమనోహరము, ఆమార్గమునఁ జరించువారు నాల్గునిమిషములైన నామేడముందునిలిచి దానివైభవమును దానిచెలువును మెచ్చి తల యూఁపకపోరు. ఇంటిచుట్టును గొప్ప యావరణము. దానిలోపల సుసజ్జీకృతమై వివిధపుష్పలతాకుంజమండితమగు నారామము. నడుమ మూఁడంతస్థులుగల యున్నతమైన స్ఫటికశిలాసౌధము. పలు తెలుంగుల రంగులతోఁ దీర్చి కట్టినయాభవనము సాయంతనారుణకిరణములసంగతిచేఁ దళతళలాడుచుండును.

ఏమిది ? రాజమార్గమున సంచరించువారందఱు నీయింటికడఁ జెవియొగ్గి వినుచుఁ దలయూఁచుచున్నారు. మనము గూడ విందమా! ఆహా! ఏమి యీగానమాధుర్యము ! భవనమున నెందుండియో తెరలు తెరలుగాఁ బొరలివచ్చి వీనుల నానందరసముఁ జిల్కుచున్నదే! ఈయవ్యక్తమధురస్వరముతోఁ బాడుచుండువారెవరు ? అలక్షితములమై జ్ఞానేంద్రియసాహాయ్యమున నీమందిరమునఁ బ్రవేశించిచూతము గాక !

"స్వామినాథసేన"

"న్యాయసర్వస్వనిధి, బెంగుళూరు"

ఆభవనపురోభాగమున నొక సుస్నిగ్ధ స్ఫటికశిలపైఁ జెక్కఁబడియుండిన పైస్ఫుటాక్షరములు, చూపరులకాయింటియజమానుని పరిచయమును స్పష్టముగఁ దెలుపకపోవు. ప్రక్కన నొక శాలలో సేవకులును, వ్యవహారవిషయముల నడుగవచ్చినవారును గూర్చుండియుండిరి. లోపల భవనప్రదేశమంతయు నతిసుందరము. గోడలపైనను క్రమముగఁ జిత్రవిచిత్రములగునానాదేశీయచిత్రపటములును, నిద్దములగు నిల్వుటద్దములును గట్టఁబడియుండెను. భూతలమంతయుమృదువై పలువన్నెలుగల విశాలరత్నకంబళములచేఁ బరువంబడియుండెను. అందందుఁ దగినచోట్ల సోఫాలు, కుర్చీలు, మెత్తలు, బల్లలు మొద

లగు నాగరకోపకరణములు తక్కువలేక కనులపండువుగ నమర్చి యుండిరి. రానురాను గానము మఱింతస్పష్టము కాసాఁగెను. సౌధముపై రెండవ యంతస్తునుండి యది వెలువడుచుండెను.

ఆగది చాల సుందరము. అలంకారముల నన్నిటికన్న మిన్న. లోపలనొక నీలవర్ణపుఁబట్టుమెత్తగల కురిచీపైఁ గూర్చుండి మూర్తీభవించిన సంగీతరసాధిదేవతంబోలిన యొకతరుణీరత్నము,ముందున్న 'హార్మోనియము' ను వాయించుచు రాగము నాలాపించుచుండెను. పదునేడు సంవత్సరములు దాఁటని పూర్ణమైన బాలప్రాయము. సౌందర్యసారమంతయుఁ దెచ్చి కరిగిపోసినట్లు, నిరుపమానరూపగరిమచేఁ బొలుచుచు, కోకిలాకల మధురకంఠస్వర మావాద్యధ్వనితోఁ జేరి యేకీభావము వహించునట్లు పూర్వపుున గానమాధురీరసమును జిల్కుచున్న యాచెలువను గాంచి "బాపురే" యని తలయూఁపని మహనీయుఁడెవఁడు? కదలినకొలఁది నిగనిగలాడుచున్న నాసాభూషణమునందలి రవలధాళధళ్యమును, చూచినకొలది వన్నెలుమార్చి మెఱయుచున్న తాటంకములలోని సీమకమలముల మిసమిసలును, జేరి, బంగారువన్నెగల్గి యంటినఁ గందునట్లుండు నామెనెమ్మొగమ్మునకు నొక నూతనాలంకార మొసఁగుచుండెను. గులాబీవన్నెగల సన్నని పట్టుచీరయు, కువలయకాంతిఁ బొలుచు పూర్ణకంచుకమును కృష్ణవర్ణముగల కాలితిత్తులును, ఆమె దేహప్రభతో నచ్చుమెచ్చుగఁ గలిసి యందము నిచ్చుచుండెను. లోకోత్తరమైన యాసౌందర్యమునువర్ణింప మాపొడిమాటలు పనికిరావు. మేమే ప్రబంధరూపముగ నీచరిత్రమును వ్రాసియుందుమేని, ప్రౌఁతవడి నీరసమగు వీణనువిడిచిపుచ్చి నూతనసాధనముఁ జేకొన్న సరస్వతి యని యాసౌందర్యరాశినివర్ణించి మాయాత్మతృప్తిఁ గల్గించికొని యుందుము.

సరేకాని, యీయపూర్వగానరసామృతము నాస్వాదించుచుఁ జెక్కు-న్ జేయిచేర్చి యెదుర సుఖాసనమునఁ గదలక కూర్చుండియుండు నా తరుణుఁ డెవ్వఁడు? సర్వాంగములు నిశ్చలములై యతనికర్ణములు నేత్రములు మాత్ర మొకదానినొకటి మించి రసానుభవముఁ జేయుచున్నవే! మా చదువరులు నతనియొక్క మూతిని మొగమును జూచి లేని సందేహముండదు. ఇతఁడు మన యనంతనాథశర్మయే!

ఇతఁ డిందేల యున్నాఁడు? బెంగుళూరునగరమున నాతని గమ్యస్థానమీ భవనమేయై యుండునా? ఈ సర్వాంగసుందరి యెవరు? ఏమో! ముఖచ్ఛాయ మాత్రము మన మొకసారి చూచినట్లున్నది. ఎందుఁ జూచియుంటిమి? స్మరించితిమి. నాఁడు బళ్ళారిలో శ్రీనివాసశాస్త్రిగారి యింట ననంతనాథుఁ డొంటరిగాఁ గూర్చుండి యొక ఛాయాపటమును జూచి యానందించుచుండఁగా మనకన్నులు గూడ నందొకింత వ్రాలి యుండెఁగదా! నిజము! ఈముద్దుమొగమే యందుఁ జిత్రింపఁబడి యుండినది. ఆహా! ఇట్టి యపూర్వసౌందర్యఖనియగు నాగరక తరుణీరత్నముఁ జేరవచ్చుటకే కాఁబోలు ననంతనాథుఁ డంత యాత్రము గొనియుండెను!

అయిన నీతరుణి యెవరు? ఈమె యవివాహితయా? స్వామినాథసేనుని కూఁతురై యుండనోపునా? ఈయమ చిత్రపట మనంతనాథునిచేత నుండఁ గారణ మేమి? వివాహితయై యుండిన సంసారి కులకాంతయెడ ననంతనాథునిబోఁటి నవనాగరకతరుణుఁడు, విద్యార్థి యట్లుచేరి కూర్చుండఁగలఁడా? చూతముగాక!

ఆతరుణి యింతవఱకు ఖరహరప్రియయను రాగము నాలాపించుచుండెను. ఆకంఠమాధురి యాందేనాని వేలుకడఁగానము! రాగము ముగిసినది. వెంటనే యీకృతిఁ బాడసాఁగెను.

"ఏ, సంకల్పమెట్టిదో మనసా!

సాకేత నిలయుండౌ రాముని ,

అ. పంకేరుహాసనాసీనుండైన

బ్రహ్మకైనం దెలియునో! తెలియదో!"

నిజము! అనుమానుభావుని సంకల్పమెట్టిదో యెవరెఱుంగం గలరు? ఆ సంతనాథుండు గూడ నిట్లే యనుకొనుచుండెను. ఎట్లైనను మనము గూడ నట్లే యనుకొందము!

ఆనంతనాథునికి స్మృతి తప్పునట్లు తోంచినది. నిమేషములు నిలిచెను. తన హృదయమున ప్రాణకళికయున్నదో లేక వేఱు శరీరముం జొచ్చినదో యతండు నిర్ణయింప నేరండయ్యెను. మనసున క్రొత్తక్రొత్త భావము లంకురింప సాగెను; గాని యవి యిట్టివనిగాని యిన్నియని కాని యతండే యెఱుంగండు! ముక్తుండైన యోగికివలె నతని దృష్టికి సర్వము నానందమయముగను తేజోమయముగను గానవచ్చుచుండెను. ఆనందరసప్రవాహముతో హృదయము నిండెను. అంగాంగములు, నాళినాళములును బరిపూర్ణము లయ్యెను. ప్రవాహము తగ్గలేదు.

తటాలున లేచి యనంతనాథుం డాతరుణి చుబుకమును బట్టి మృదుకపోల ఫలకమును గవుంగిట నొకమాఱు ముద్దుగొనియెను. హార్మోనియపు స్వరమును గాన మాధురియు నిలిచిపోయెను! అది లజ్జయో, సంకోచమో, యానందమో, యెఱుంగంజాలముగాని, యాతన్వి మొగమున నొక విచిత్రభావ ముదయించినది. తటాలున విడిపించుకొని యతని చేతుల నవలంద్రోయుచుం జుట్టును దిలకించి మోమున సంకురించు మందహాసాంకురమును మాటువఱుచుచు "ఇది సరియా?" యనియెను.

"నేనేమి తప్పుచేసితిని? చెక్కిలి మాసెనా?" అనంతనాథుండు చిఱు నవ్వాసరించెను.

"బాగున్నది! తప్పే! నేనింకను మీసొమ్ము గాను గదా!"

"నాసొమ్ముగాక మ రెవ్వరిసొమ్ము కాఁగలవు?"

"ఇంకను గాలేదే!"

"ఇంక మూఁడు నాళ్ళే కదా!"

"ఎన్నినాళ్ళయిన నేమి? ఇంతకు నేమో!"

"ఇదేమి? ఇంకను సందేహమా!"

సరళ కేమి చెప్పుటకును దోఁపక వెనుకకుఁదిరిగి చూచి,

"ఎవరైన చూచిన నేమందురు?" అనియెను.

"ఒకరి కొఱకా! ఐన మన్నింపుము."

అనంతుఁడు చిఱునవ్వు నవ్వుచు నామె రెండుచేతులును బట్టుకొని నిర్నిమేషమగు దృష్టి నామె నెమ్మొగమున నిలిపెను. అమూల్యమైన యాతరుణి తీక్ష్ణకటాక్షధార యొకటి యతని హృదయమును భేదించుకొని పోయినది. హృదయావేగమును నిల్పలేక మఱియొకమాఱు తనయభీష్టము నెరవేర్చుకొన శిరము వంచెను. ఇంతలో "సరళా!" యని యొక పిలుపు వినవచ్చినది. ఇద్దరు నులికిపడి వెనుకకు తిరిగి చూచిరి. వాకిట దాసి యొకతె వచ్చి,

"అమ్మాయీ! నాయనగారు పిల్చుచున్నారు" అనియెను.

"నాన్నా? ఎందుకు?"

"మార్వాడీ యొకఁడు రవలసొమ్ములు తెచ్చియున్నాఁడు. అవి మీరు చూడవలయునేమో?"

"ఎందున్నారు?"

"క్రింద వసారాలో"

"వచ్చెద"

అని యనంతనాథునివంకఁ జూచి మెల్లన వెళ్ళుచుంటినని యుచ్చరించి సరళ యాగదిని బాసిపోయెను. అనంతనాథుఁడు దృష్టిపథము

దాటువఱకు నామెను జూచుచు, నటుమీఁదఁ గురిచీపైఁ గూర్చుండెను. ముఖము నరచేత వ్రేలవేసి యేమేమో చింతింపఁదొడఁగెను. ముఖభావ మొకింత మాఱినట్లు గానవచ్చెను. అట్టితరి నాతరుణుని హృదయమున నెన్ని భావము లెంతతీక్ష్ణముగ నెన్నిత్రోవలఁ బర్వెత్తుచున్నవో యెవ రెఱుఁగుదురు ? తెప్పవాల్పక కొన్ని నిమేషము లతఁడా హర్మ్యని యము వంకఁ జూచుచుఁ గన్నులు మూసికొనియెను. ఏమి తలంచు చుండెనో కాని యాతనియంగమునఁ బులకోద్భేదము నగుచుండెను. కొన్ని నిమేషములట్లుండి లేచి యాఁగదిఁ బాసిపోయెను.

—:o:—

## ఐదవ ప్రకరణము.

—:o:—

"లేఖ"

"కామ రహితంబుగా రతిగలదె యెందు ?"

[నన్నెచోడుని కుమారసంభవము. ఆ. ౯.]

దివసము లైదాఱు గడచెను. కమల యొకటరిగ నింటఁగూర్చుండి యాలోచించుచుండెను. చేత నొక తంత్రీవార్తగల పత్రముఁ గొని మాటిమాటికిని జదువుకొనుచుఁ జూచుచు నుండెను. రుక్మిణితో సహవాసమున కమల కింగ్లీషు యక్షరములు మాత్రము గుర్తు పడి యుండెను. కాని పదార్థము నెఱుంగు జ్ఞానము లేదు. ఐనను తన తండ్రి దానిని మఱియొకరిచేఁ జదివించి యుండెనుగాన నందలి విష యము కమల యెఱిఁగినది. నాఁటి యుదయమున సివిద్యాబ్వాన్స్ బళ్లారిపురమునుండి వచ్చినది. అం దిట్లున్నది.

"అనంతనాథుఁడు అందుఁ గలఁడా? వ్రాసి యుంచు."

"శ్రీనివాసశర్మ"

ఇందుకు బదులుగ నచ్చటికి రాలేదని కమలతండ్రి యుత్తరముఁ బంపెను. ఈవార్త యాకస్మికముగ వచ్చుట కేమి కారణమని కాఁ

బోలు, కమల యొంటరిగ నాలోచించుచున్న యది.

కమల యనంతనాథుని భార్యయనుట వ్రాఁ చదువరులకుఁ దెల్లమే కదా! దాదాపుగ నెనిమిదేండ్లనాఁడు తన వివాహములోఁ జూచినది తప్ప మరల కమల తన భర్తనెఱుంగదు. నేఁటిదాఁక ననంతనాథుఁ డందు వచ్చియుండలేదు. కమల ఋతుమతియై దాదాపు రెండేండ్లు కావచ్చినవి. పట్టపరీక్ష నిచ్చునంతకు ననంతనాథుఁడు శాంతికల్యాణము నొల్లఁడనియు, వానివిద్యకు భంగము కలుగకుండఁ జూచుచుండుట తమ ధర్మమనియు, శ్రీనివాసశాస్త్రి కమలతండ్రికి యుత్తరము వ్రాసియుండుటచే నంతవఱకు నాతఁ డావిచారము మరల నెత్తలేదు. ఇపుడు పట్టపరీక్ష ముగిసినది. మాఘమాసములో శుభకార్యము జరుపుట బాగని మాధవశాస్త్రి తన వియ్యంకునకు మరల తెలిపియుండెను. అందుకు బదులు జాబు రాలేదు. నేఁడే తంత్రీవార్త వచ్చినది. అనంతనాథుఁ డిచ్చటికి పోదునని చెప్పి వచ్చియుండెనా? కాని యీవఱకు నిందు రాలేదు. ఎందుఁ బోయియున్నాఁడో! ఇంక నైన రావచ్చును. కాని యెనిమిదేండ్లుగ నొక్కనాఁడైన నిందు వచ్చినవాఁడు కాఁడు. కాక తనపై నింతకే యసూయ కలదని కూడ వినికిగలదు. శుభకార్యము విషయమై తన యభిప్రాయ మియ్యక కాలము గడపుచుండెనని బోయియుండునా? బెంగుళూరులో నింకెందుండును? స్నేహితు లెవరైన నుండఁగూడదా? ఈవఱకు రామిచే నిపుడు వచ్చుటకు సందేహించుచు నందేని మిత్రునియింట నిలిచియుండఁగూడదా? ఇక్కడికి వచ్చుటకును సందేహమా? తన యర్థాంగి యున్నచోట తన కెన్నఁడును స్వాగతమే కాక వేఱు మాట గలుగునా? లేక కమల నీవలెఁ జూచి యెఱుంగమిచే ననూయ బెంపడి హృదయప్రేమ శూన్యమై యెలయుండరాదు? ఇచ్చటికిఁ బోవుదునను నాసచే నందైన నేల యరిగియుండరాదు? ఆ యనేకరీతుల ప్రయత్నములు చేయుచుండ పల

యుఁగదా? విద్యావంతుఁడైన యనంతసాధుని బాలు తరుణ సుందర మూర్తిని నెవరాశింపరు? అయినచోఁ దన కర్తవ్య మేమి?

కమల యాలోచనములోని సారాంశము లిట్టివి. ఆయగాధ మగు నాలోచనాప్రవాహమునుండి దరిఁజేరి, కమల గదిచుట్టును విలకించి యాంతంత్రీవార్తను చెంతనున్న గూటిలోనుండు తన భారతి పుస్తకమున దాఁచెను. అక్కడనేయున్న "దేవి చౌధురాణి" యను నవల నొకదానిఁ జేకొని పఠింప నారంభించెను. ప్రఫుల్లముఖమామచే నిందిత యై పతిని బొందనేరక విలపించుఘట్టమును జదువసాఁగెను. చదువఁగాఁ జదువఁగా నాయమ విశాలనేత్రాంచలములార్ద్రములు గాఁజొచ్చెను. కన్నులఁ దుడుచుకొనునంతలో మాధవశాస్త్రియు సుందరమ్మయు నాగదిలోనికి వచ్చిరి. మాధవశాస్త్రిముఖమున విచిత్రమగు పరివర్తనము స్ఫురించుచుండెను. సుందరమ్మముఖము గూడ నాశ్చర్యముఁదోఁపఁ జేయుచుండెను. కమల సందేహించి, తటాలున లేచి నిలువంబడియెను.

"కమలా! ఇదిగో నీమగఁడు జాబు వ్రాసినాఁడు. చదువుకో!" అని మాధవశాస్త్రి హృదయమునందలి సంతోషము మొగమునఁ బ్రతిఫలించుచుండ నొకజాబు బిడ్డముందు విసరి పాఱవైచెను.

"సందర్భ మేమి? చెప్పరాదా?" యని యత్యాతురతతో సుందరమ్మ మగని మొగముఁజూచి బ్రతిమాలెను.

"కమలయే చదువును లెమ్ము."

కమల కిది యంతయు నర్థము కాలేదు. ఆమె హృదయము తటతటఁ గొట్టుకొన నారంభించెను. కాలుసేతులు గడగడ వడఁక మొదలిడెను. ఎట్టకేలకు మెల్లన నాలేఖనందుకొని విప్పి, తలవంచి లోలోనఁ జదువుకొనియెను. సగము వఱకుఁ జదివినంతలో నామొగము వివర్ణత నొందినది. కన్నులార్ద్రము లయ్యెను. ఇంచుక ప్రక్కకుఁదిరిగి

నయా నెన్నఁడును ప్రేమింపలేదు. మీనిర్బంధమువలన ప్రేమ నుండఁగి తముగాదు. ఈవిషయము మీరును అంగీకరింతురని తలంచెదను. మీ రంగీకరించినను అంగీకరింపకున్నను, భగవద్దత్తమైన స్వాతంత్ర్య జ్ఞానము నుపయోగించు ప్రతిమానవుఁడును నాయట్లు తలంచుట సహజము. దృఢచిత్తమును స్థైర్యమును లేని యనేకులవలె, వాస్తవముగ ప్రేమానురాగములు లేకున్నను వివాహ మనుబంధమునకు లోనై నిరంతర దుఃఖ మనుభవింప నాచిత్త మొగ్గదు. కావున నేనీవిషయమై చాలకాల మాలోచించి కర్తవ్యము నిర్ధారణచేసితిని. నామతము ద్రిప్ప నెవ్వరికిని వశముగాదు. అందుకై యింక నెవ్వరుగాని ప్రయత్నించుట వృథాప్రయాసము. నిష్ప్రయోజనము. నాభవిష్యత్సుఖమునందు నాకన్న నితరులు స్వాతంత్ర్యమును వహింపఁజాలరు. అన్నియుఁ జక్కఁగ యోచించి నాయిచ్ఛవచ్చిన వేఱొకన్యను నే నిపుడు బరిణయమాడి సుఖంబుగ నున్నాఁడను. కాన మీసుతను నేను మనఃపూర్వకముగఁ బరిత్యజించితిని. మీ కేకోరికయున్నచో నామెకు వేఱువివాహముఁ జేయ వచ్చును. దురాచార పిశాచములపాల్పడి యాబాలను నిరంతర దుఃఖ భాగినిగాఁ జేయుట మీకును హితముగాదని నాకుఁ దోఁచినంతలోఁ జెప్పెదను. అటుగానిచో భరణవ్యయమునైన నీఁగలను. మీకెట్లు హితమో చూచి యాలోచింపుఁడు.

ఈలేఖ వ్రాసి మీయందరకును మనఃఖేదముఁ గల్గించితినని నవెలుంగుదును. అందుకై యీ మీక్షమాపణము వేఁడెదను. విధిలేక వ్రాయవలసి వచ్చినందున వ్రాసినాఁడను.

ఇట్లు,

అనంతనాథశర్మ.

ఆలేఖ చదువుట ముగియకమునుపే సుందరమ్మ భూతావిష్ట యుంబోలె హతాశయై పరాలున నేలఁగూలఁబడియెను. ముఖము

వివర్ణతం జెందెను. కన్నులనీరునిండెను. కంఠము స్తంభితమయ్యె. మాధవ శర్మగూడ మాటాడలేదు. జాబు నా ప్రక్కఁ బాఱవైచెను. అతని కోపము శోకముగా మాఱినది. తానును గంటఁదడి వెట్టుకొనియెను. సుందరాంబ నిట్టూర్పు విడిచి "అయ్యో! కడకు కమలగతి యిట్లు పరిణమించెనా ?" యని విలపింపసాగెను. కొంతతడ వూరకుండి తల యెత్తి మరల మగనివంకఁజూచి "యేమి ముందుగతి !" యనియెను.

"గతియేమి ? నన్నేమి చేయుమందువు ? కూఁతురుగాదు కొడుకను కొందము !"

"అయ్యో ! కలకాలము దానిదుఃఖముఁ జూచుచు నెట్లు సహింపవలయును ?"

"నే నేమి చేయుదునే ?"

"మరల నాయన నే పోయి వేఁడిన ... ... ..."

"ఏమి ? ఎవనిని ?"

"కమల మగనిని" సుందరమ్మ మెల్లఁగఁ బల్కెను.

మాధవశాస్త్రికి సహన మంతరించెను. హృదయము మండ సాఁగెను.

"ఆ చండాలుని జూచుటకా ! కటికహృదయమున నిట్లు వ్రాసిన ఆ దుర్మార్గుని—నీచుని—దుష్టుని—నేను చూడఁబోవలయునా ? సిగ్గులేదా ? నేనింక నాజన్మములో వాని మొగము చూడను ! ఏమి పొగరు ! ఎంత గర్వము ! రెండు ఎ, బి, సి ముక్కలు వచ్చియు రాక యే యింత నిక్కవలయునా ? పశుబంధమఁట ! సన్యాసము మేలఁట ! దురాచారపిశాచమఁట ! నాకు స్త్రీభ్రష్టుం డుపదేశించువాఁడఁట ! ఇదంతయు నీమాహాత్మ్యమే ! ఈ యింగ్లీషు చదివిన దుర్మార్గులతో మనకు సంబంధము తగదో గోవిందా యని నోరు నొచ్చునట్లు చెప్పితిని ! నీవు వింటివా ? అల్లుఁ డధికారము చేయునని యువ్విళ్ళూరి

తివి! ఇదిగో చేయుచున్నాఁ డనుభవింపుము! ఈచండాలపు విద్య యెన్నఁడీ యార్యావర్తమున కాలుపెట్టెనో యపుడె యంతయు పాడయి పోయినది! ఛీ! ఈకాలమున మాబోటివా రుండరాదు!”

ఆవైదికశిఖామణి కన్నులెఱ్ఱఁబాఱెను. సుందరమ్మ యేమియుఁ జెప్పనేరక భయమంది క్షణకాల మూరకుండెను. తరువాత మెల్లన

“ఏయూరిలో పెండ్లిచేసుకొన్నది?” అని యడిగెను.

“వల్లకాటిలో! ఎందైనను పాడై పోనిమ్మా! ఇఁక వాని మాట నెత్తవలదు. నాదేహ మెల్ల మండుచున్నది!”

“ఏమైనను జేయనిచోఁ గమల జీవించు మార్గ మేమి?”

“నన్నడిగిన నే నేమి చేయుదును?”

“పోనిండు. బళ్ళారికైన పోయి మాటలాడి రారాదా?”

“ఏమో! నాకిపు డేమియుఁ దోఁపకున్నది. మొదలు కమల యెందుఁబోయినదో చూచుకొమ్మా! పో!”

సుందరమ్మ కన్నులనీరు తుడుచుకొని యాగదిఁబాసి పోయెను. మాధవశాస్త్రిమాత్ర మందే చాలసేపుకూర్చుండి చింతించుచుండెను. కమలను దలఁచుకొని యతని కన్నులనీరు నిరర్గళముగ బ్రవహింపసాఁగెను. పాపము! కమల మాధవశాస్త్రి యేకపుత్రి!

# ప్రణయసరణి

—:o:—

## ఆఱవ ప్రకరణము.

—*—

### మనోరథసిద్ధి.

"ఉ. ఆద్యంతము లెంచిచూడ జవరాండ్రయొడాటములందు శక్యమే
యెంతటివానికైనఁ జలియింపక బిగ్గ మనంబు నిల్పఁగన్?"

[చేమకూర వెంకటపతి సారంగధరచరిత్ర]

అనంతనాథుని యిష్టార్థము నెఱవేరినది; చాలకాలముగ నున్న యతని హృదయశల్యము తొలఁగినది. మానవజన్మ మెత్తినందుల కేది ఫల మని యతఁడు తలఁచెనో, యేది సమకూడనినాఁడు తన బ్రదుకే వ్యర్థమని యతఁడు తలఁచెనో, యట్టిభాగ్య మతని యఱచేతఁ జిక్కినది. మనసున నుఱ్ఱూతలూఁగుచున్న కోరికల కెల్ల ఫలము ప్రత్యక్షమైనది. అభినవలావణ్యశోభితయగు నాగరకతరుణీరత్నము అతని కేలువట్టి యానందసాగరమున నోలలాడించుచున్నది. అనంతనాథుఁడు ధన్యుఁ డయ్యెను.

యుక్తాయుక్తవివేకములేని చిన్ననాఁ డతని తలిదండ్రు లొకవైదికుని కూఁతును బరిణయబంధమున నంటఁగట్టిరి; కాని రానురాను నాగరకతరణుల సహవాస మలవడి, పాశ్చాత్యనీతులు రుచింపఁజొచ్చి, తన వివాహము నతఁడు నిష్కారణముగ ద్వేషింపసాఁగెను. ఏల? వివాహమున కాధారము పరస్పర ప్రేమ యని యతఁ డిటీవల నేర్చుకొని యుండెను; గాన, వివాహమైన దను నిర్బంధమున ప్రేమింపవలయు నన్న నతఁ డిష్టపడలేదు. రానురాను వేరుపాఱిన స్వాతంత్ర్యబుద్ధియే యతని కిట్టి పరివర్తనమును గలిగించినది. తన చిన్ననాఁటి

భార్య ఛాందసుని కూఁతురగుటచే, తనవంటి నాగరకవిద్యావంతునకు సరియగుజోడు కాదనికూడ నతఁడు తలఁచెను.

మనదేశమునందలి ప్రకృతస్థితిగతులుకూడ నందుకు దగినట్లే యున్నవి. కన్యలవరించుసందర్భమున ప్రాఁచిపనులఁజేయుచాతుర్యము బరికించుటలో నున్నంతశ్రద్ధ, దాంపత్యానుకూల్యవిచారమున మన వారికి లేదు. అది వారి కంతగా కాఁబట్టినట్లును లేదు. ఓలి తక్కువ యైనఁ జాలును ; తుదకు గ్రుడ్డిదైనను సరే! ఇట్టివారి మధ్యమునఁ బెరిఁగిన బాలికలు మననాగరకుల కెట్లు రుచింతురు ? చదువులు పాఠశాలలును వారికి గిట్టవు. అందున నాంగ్లేయ విద్య! 'హార్మోనియ' మును వాయించుచు హాయిగ రాగమునాలాపించుచు మనసును గరఁగించుట యన వారి కబ్బనిది. ప్రియులతో నీడుజోడుగ నిలుచుండి సరసాలాపములాడుటయన్న వారికిఁ గాని పని. మగవారి మొగము గానవచ్చిన మాత్రాన మరుఁగునకుఁ బరుగెత్తకున్నఁ జాలదా ? హరి హరీ యని లేచినదాదిగ నర్ధరాత్రమువఱకును పాఁతగడ్డల ధరించి ప్రాఁచిపనులఁజేయ నలవాటుపడినవారికి పరిశుభ్రతయన్నఁ గాలిలోనైనరాదు. మన నాగరక తరుణుల కివి సరివచ్చునా ?

ఇంతకును మనసుపొందనినాఁ డన్నియుఁ దప్పులే యగును. మఱియు నొకవిషయము నానాఁటికి యౌవన మంకురించుచున్న తన జాయను అప్పు డప్పుడు చూడఁగల్గియుండినచో, నసంతనాథుఁడు తనపై యభిప్రాయమును, మార్పవలసివచ్చుచుండెనేమో! కాని యదియు లభించినదిగాదు. తనభారముఁ దెంచుకొనుటకై చిన్ననాఁడే కుమారునకు వివాహ మొనరించెనుగాని, జాయనప్పు డప్పుడు చూచుచున్నయెడలఁ గుమారుఁడు మనశ్చాంచల్యమునకు లోనై విద్యావిషయమున నశ్రద్ధ వహించునేమోయని, తండ్రి యందుల కవకాశ మొసంగఁ డయ్యెను. ఈకారణములచే నొక్కనాఁడైన నత్తగారింటికిఁ

జోక, భార్య రెండేండ్ల వెనుకనే ఋతుమతియైయున్నఁగూడ, పూర్వాచారము ననుసరించి నిషేకము జరుగుటకు సమ్మతింపక పట్టుపరీక్ష నిచ్చువఱకు నక్కఱ లేదని యనంతనాథుఁడు కాలహరణముఁ జేయుచు వచ్చెను.

బళ్ళారిపురమునఁ జదువునాఁడే యంకురించిన యీనాగరకాభిప్రాయములు చెన్నపురిలో మఱింత పెరిగి బలపడెను. కాలము సరి వచ్చినచోఁ గార్యము లన్నియుఁ దమంత ననుకూలించుఁగాఁబోలు! కలాశాలలో రామమోహనుఁ డను తోడివిద్యార్థి యనంతనాథునకు జత యయ్యెను. ఇతఁడొక న్యాయవాదిసత్తముని కుమారుఁడు; సమయస్కుఁడు, ధనికుఁడును. „ఊరక యే యూఁగునమ్మ ఊరి దేవరలో మఱింత యూఁగె" నన్నట్లు రామమోహనుని సహవాసమున ననంతుని యాశలు మఱింత పెరుగసాఁగెను. విద్య యధికమగుకొలఁది మనంబున ధైర్య మతిశయించును. ఇతరులు నిందింతురని కర్తవ్యమును మానుట కేవల పామరకృత్యమని యతఁడు తలఁపసాఁగెను. అందున పురాతన నింద్యాచారపిశాచావేశమునఁ గన్నులు తెలియని శుద్ధ ఛాందసుల మాటలా గౌరవింపనగును? రానురాను తల్లిదండ్రులే మన్నను, సంఘమెట్లు తలఁచినను, ప్రథమభార్యను వదలి వేఱొక నాగరకతరుణీమణిని వరించి పరిణయమాడి జన్మము సార్థకము గావించుకొనుటయేకాక సంఘసంస్కరణమున నితరులకు మార్గదర్శకుఁడుగఁగూడఁ గావలయునని యతఁ డూహించెను.

దైవ మతని కోరిక కెంతయు ననుకూలుఁడగునట్లు తోఁచెను. రామమోహనున కొక తరుణ సోదరి యున్నదని ప్రస్తావవశమున నాతఁ డెఱిఁగెను. ఆబాల యాంగ్లేయ భాషలోఁ బ్రవేశపరీక్షలోఁ గడ తేఱినదనియు, గానవిద్యలోఁ జాల సమర్థురాలనియు, ననురూపుఁడగు వరుఁడు లభింపమి నింతవఱకు నవివాహితగా నున్నదనియుఁ బ్రస్తావ

వశంబున రామమోహనుఁ డతనికిఁ జెప్పెను.

అనంతనాథుని మనంబున నిపుడు నూతనకాంతు లుత్పన్నము లయ్యె. అనంతుఁడు సుందరతరుణుఁడు; విద్యావంతుఁడగు ఫాగరుకుఁడు; తన సహోదరి వరించినచోఁ దమ యభ్యంతర మేమియు నుండదని రామమోహనుఁడు వచించియుండెను. ఆమె యనంతునినేల వరింపదు? అతని కేమి గొఱంత? చాలును. ఇంతమాత్రము సామగ్రి లభించిన వెనుక నాకాశ మధ్యమున సౌధమును నిర్మించుట యొకచిటికెలోనిపని. ఈవిషయమున నసమాన చాతుర్యముగల శిల్పి తృష్ణ. మయు విశ్వకర్మలనుగూడ మించినది. విశాలమై నిర్మలమై నిగనిగలాడు నాకాశరంగమధ్యము! అందు తళతళమను మేలిపద్మరాగమణులచే నిర్మింపఁబడి చూపఱుల కనుల మిఱుమిట్లుగొల్పు నేడంతస్తుల యుప్పరిగ!! లోపల నవరత్నఖచితమై యప్రతిమానశోభాసనాథమై యతిమాత్ర మనోహరమైన తూఁగుటుయ్యెల!!! అనంతనాథుఁడం దూఁగఁ గోరెను. కానిమ్మని తృష్ణ యూఁపసాగెను! ఆహా! ఆయానందము, ఆసౌఖ్యపారవశ్యము, ఆభావతృప్తి—వీని పరిమితి ననంతనాథుఁ డొక్కఁడు మాత్ర మెఱుఁగును.

సెలవుదినము లెప్పుడు వచ్చునోయని యెదురుచూడవలసి వచ్చెను. ఎట్టకేల కవి వచ్చినతోడనే రామమోహనునితోడ బెంగుళూరునగరమున కరిగి యతని యింటనే విడిసెను. సుందరియగు నాకన్యను గాంచిన తఱినుండి యతనికి వేఱుప్రపంచమే కానరాదయ్యె. వేఱు యోజన లతని మనంబుఁ జొరలేదు. వేయిమాటలేల? పర్యవసానము మాత్ర మెఱిఁగింతుము: సర్వప్రయత్నములఁ జేసి యాకన్య నాశ్రయించి మాడలాడి తుదకు వివాహమున కామెసమ్మతిఁ బొందెను.

ఇప్పటికిఁ గోరిక కొనసాఁగినట్లే. ఐన జననీజనకుల కీవివాహ మనిష్టముగ నుండునేమో యను టొక్కటియే శంక. కాని సమాధా

నములు వేలకొలఁది యిట్టి గుణవతియగు కోడలు లభించుచో వారు మాత్రమేల సంతసింపరు? కుమారుని యానందము వారికానందము గాక వేఱేమగును? అందున నీమె గొప్పన్యాయవాది కూఁతురు, రూపవతి; చతుర; కాక విద్యావతియును. ఇఁక సందేహమేమి?

వివాహలగ్నము నిర్ధారణచేసికొని, విరహమున కోర్వఁజాలక కాఁబోలు నాకన్యక రూపపటమునుగొని జనకనివాసముఁ జేరెను. అందలి వృత్తము లెల్ల మనచదువరు లెఱిఁగియే యున్నారు. తలిదండ్రులకీనూతనాచారములు సరిరావని నిర్ణయించుకొని వారి కీవిషయమును దెల్పకయే మరల బెంగుళూరునగరమును జేరెను. ఇష్టార్థసిద్ధిగ తన మనఃప్రియను బెండ్లియు నాడెను. చాలకాలముగ నుఱ్ఱూఁతలూఁగుచున్న కోరిక లెల్ల ఫలించినవి. తాను వేఱుగ వివాహమాడిన విషయము తన మొదటి మామకుఁ దెలుపుటయు మన మెఱుఁగుదుము. జనకునకుఁగూడఁ గొన్నాళ్ళకీవిషయముఁ దెలిపెను గాని మరల బల్లారికిఁ బోలేదు.

వివాహానంతరము కతిపయ దినములయందే శాంతికల్యాణము నెఱవేరినది. విద్యారూపయౌవన సౌభాగ్యములతో నేమిటనుగొఱంత గానని యాతరుణీమణి యనంతనాథు నానందాంబునిధిఁ దేల్చుచున్న యది.

నాఁడు బెంగుళూరునగరమున ననంతనాథుఁ డవతరించునపు డతనిం జేరి కైదండయొసఁగి నగరములోనికిం బిల్చుకొని పోయిన తరుణుఁడే యతని సహపాఠియు, మిత్రుఁడును, అనుంగు మఱఁదియు నగు రామమోహనుఁడు. స్వామినాథ సేనుని కుమారుఁడు.

నాఁ డనంతనాథుని యెదుర 'హార్మోనియ' మును వాయించుచు నతని కర్ణపుటముల గాన రసామృతధారల నొలికించుచుండిన యా సుందరీతిలకమే యిపు డతని చేపట్టి యతని 'జన్మము' ధన్యముఁ జే

సినది. ఈమెయే స్వామినాథసేనుని ముద్దుగూఁతురు. రామమోహనుని గారాబు చెలియలు. అనంతనాథుని మోహపురాణి. ఆమె నామము సరళాదేవి !

ఆహా ! ఆనామాక్షరమణులే కోటి చేయును! ‘‘సరళ’’ యను నక్షర త్రయమును దలఁచి తలఁచి, చింతించి చింతించి--అనంతనాథుఁ డెంత యానంద మందుచుండెనో !

—♦—

# ప్రణయసరణి.

## ఏడవ ప్రకరణము.

—:o:—

### అద్వైతము.

‘‘తే. ఏల కలహింప?, బిగువులు చాలుఁ, దగిన
ప్రాయ మియ్యది కడచిన రాదు మరల!!;
నిత్తు మదనాజ్ఞఁబోలెఁ గోయిలలు పాటఁ
బతులఁగూడి రమించిరి పడఁతు లపుడు.’’

[ఆంధ్రరఘువంశము. రా. అనంతకృష్ణశర్మ]

ప్రపంచమున సుఖ మనుమాట చాల ప్రియమైనది. ప్రతి మనుజుఁడును దానిని గోరువాఁడే. ఎవ్వఁడును నిరాకరింపఁబూనఁడు. సుఖము లన్నియు నిస్సారము లనియు క్షణికము లనియు హేయము లనియుఁ దలపోఁడుగఁ వాదించు మహాత్ములు యోగీశ్వరులు సైతము ఏ సాయుజ్యరాజ్యముననో, యే సాలోక్యమును పేరుననో, తాము కోరుచున్నదియు సుఖమే యనుమాట మఱచుచున్నారు. వాదముల కేమి? మొత్తముమీఁద నది యనుభవింపని వాఁడీప్రపంచమున నరుఁడు.

అయినను సుఖ మెవ్వరి సొమ్మునుగాదు ; కాకయును బోలేదు. కావున నేసుఖము సాక్షాత్పరమాత్మస్వరూపమని „ఆనందో బ్రహ్మేయట న్న ప్రాజదువు" పల్కుచుండుటు లోకమున నొక్కొక్కరి కొక్కొక రూపమునం గానిపించుచు నది యనేకావతారములం దాల్చుచుండును. అయినను తత్స్వరూప మిట్టిదేయని తెల్పు మహానుభావుండుగాని శాస్త్రముగాని యెందునుగానరాదు. బిడ్డలకు సుఖము తల్లిని జూచుట యందే ; బాలుర కాటలందే ; తరుణులకు విషయవ్యాపారవిలాసము లందే ; ఇంచుక ముదిరిన వారికి ధనార్జనమందే ; వృద్ధులకు పిల్లల నాడించుటయందే ; సోమరులకు నిద్రయందే ; పండితులకుం దెగని శాస్త్రవాదమునందే ; ప్రబంధకవులకుం బోలుపొందులేని యతిశయోక్తులందే. వేయేల? ప్రతిమానవునకునుసుఖస్వరూపము వేఱువేఱుగా గోచరించుచుండును. ఇంతియ కాదు. ఒక్కనికొక్కవిధముగ నెల్లపుడును దోంపదు. నేఁడు సుఖము రేపు దుఃఖము; రేపు సుఖము మఱు నాఁడు కష్టము. అయినను మనము మాత్రము సుఖముసుఖమని భ్రమింపక తీఱదేమో !

అనంతనాథుండుగూడ సుఖము తనపాలిటి సొమ్మేయని తలంచెను. సుఖమన్న నిట్టిదేయని మనమున నిర్ధరించి సంతసించుచు నీప్రపంచమునే మఱచెను. నిజము. విజ్ఞానదాయకమగు నాంగ్లేయవిద్య ; మానసోల్లాసమునిచ్చు యౌవనము; సర్వవిధముల సురూపయు సుందరియునగు జాయ ; సంసారచింతల నించుకేని తన్నుం జేరనియ్యని శ్వశురగృహము ! చదువరులారా ! ఇంతకన్న మనుజుండు—అందును అనంతనాథునిబోలు నాగరక తరుణశిఖామణి, కోరునదేమి ? ఒక్కొక్కటే సుఖమునిపింపజాలియుండు నన్నియు నొక్కసారిగ నతనికిం జేకూఱినవి. ఇంతియకాక యనురూపులును విద్యావంతులైన మిత్రులు నతని లభించిరి.

ఇటీవల బెంగుళూరుపురమున నతనికి లభించిన మిత్రవర్గములలో నెల్ల "లక్ష్మీకాంతుఁడు" ముఖ్యుఁడు. ఇతని నివాస్థలము మైసూరు. ఇరువదియైదేండ్ల ప్రాయముగల సుందరుఁడగు తరుణుఁడు. న్యాయశాస్త్రమున పట్టపరీక్షనిచ్చి, తనబంధువును సుప్రసిద్ధుఁడునగు స్వామినాథసేనునికడ వాదము నభ్యసించుటకై బెంగుళూరికి వచ్చి యతని యింట నిలిచెను. తత్కారణమున ననంతనాథునికెడఁ బ్రాయనిమిత్రుఁడై న్యాయస్థానమునఁ బనియున్నపుడు దక్కఁ దక్కినసమయములలో నెల్ల నతనితో సంభాషణము లాడుచుఁ బ్రొద్దుపుచ్చుచుండును.

ధన్యుఁడనఁగా ననంతనాథునికన్న వేఱెవరు? ఒకవేళ మేడపైభవనమునఁ గూర్చుండి మిత్రులతో నర్మగోష్ఠిలోనుండును. మఱియొకకాలమున సరళ 'హార్మోనియము'ను వాయించుచు గానముఁ జేయుచుండఁగా మిత్రులతోఁగూడ వినుచుఁ దనియుచుఁ దలయూఁచుచుండును; ఒకవేళఁ దనయర్థాంగితోఁగూడ శయ్యాగృహమున సవిలాసముగఁ గాలము బుచ్చుచుండును. వేఱుసమయమునఁ దనమనోహారిణితోఁగూడి గుఱ్ఱపుబండినెక్కి విహారప్రయాణము నాచరించుచుండును; ఇంకొకతఱి లక్ష్మీకాంతుఁ డొకప్రక్కను సరళవేఱొకప్రక్కను గూర్చుండియుండఁగా నారామములోని విలాసమందిరకుట్టిమమున విశ్రమించి వారితోడ సల్లాపరసములందేల్చి యాడుచుండును. దివసము లొక్కొక్కటిగ బరుగిడుచుండెను గాని యనంతనాథున కంతయు క్షణములాగుండెను. కాలమన్న నెట్టిదో యాతరుణుఁ డెఱుంగఁడయ్యె.

దాదాపుగ రెండుమాసములు గడచెను. పట్టపరీక్షల ఫలితార్థములు వెలువడియెను. రామమోహనుఁడు కృతార్థుఁడయ్యెను. ఉద్యోగమును బరీక్షయు మనయధీనములుగాని ఫలము స్వతంత్రమైనది. అనంతనాథుఁడు పరీక్షలోఁ గృతార్థుఁడు కాలేదు.

రెండు మూఁడు దినసములు లనంతనాథుని యానందమున

కించుక యంతరాయము గలిగెను. నిరంతరాయముగ నాకసమున వెలుంగుచుండిన పండువెన్నెలకుఁ దటాలునఁ గాఱుమబ్బు గ్రమ్ముకొనియె. ఇది చందురుని దురదృష్టమో, లేక గాఱుమబ్బు దుందుడుకో యెవరు చెప్పఁగలరు? సాధ్యమగునంతవఱకుఁ దృప్తికరముగనే యనంతనాథుఁడు వ్యాసంగ మొనరించియుండెను, కాని ఫలమేమో యిట్లు విపరీతమయ్యెను! కారణమేమి? పొరఁబాటునఁ దన పేరు ప్రకటించుటఁ మఱచియుండఁ గూడదా? ఇంతలో సవరణ రావచ్చునను కొని యతఁడు కొన్నాళ్ళెదురు చూచెనుగాని యదియు జరుగలేదు. కృతార్థుఁడైన రామమోహనుఁడు నిర్మాణశాఖనభ్యసించుటకై పూనానగరమున కరిగెను. అనంతనాథుఁడు గూడ కృతార్థుడైయుండినచో న్యాయశాఖ నభ్యసింప నెంచియుండెను గాని మనోరథము కొనసాఁగలేదు.

ఇఁకముందు చేయఁదగినదేమి? మరల మద్రాసునకరిగి పట్టపరీక్షకయి యొకయేఁడు వ్యాసంగముఁ జేయవలసియుండెను. కాని యది సాధ్యమా? బెంగుళూరున కళాశాల యున్నది. గాని యతని యభిమతశాఖయగు చరిత్రము నందు బోధింపరు. వేఱుకళాశాలకే పోవలసివచ్చెను. అయినఁ దానొంటరిగాఁ బోయి కదా వ్యాసంగముఁ జేయవలయును? సరళను గూడఁ బిలుచుకొని పోయినచో నన్నివిషయముల ననుకూలమే. వ్యయమును భరించుటకై స్వామినాథ సేనుఁడు వెనుదీయఁడు. అయిన నొక్కటి. అందొంటరిగనుండుట సరళకుఁ గష్టమగునేమో! ఇంతకును సరళయిష్ట మెట్లున్నదో!

సమయమును చూచి సరళతో నేకాంతమున నీవిషయమును గుఱించి యుచితరీతిని బ్రస్తావించెను. పట్టపరీక్షనిచ్చుట యుక్తమనియు, చెన్నపురికిఁ దానరుగుదెంచి యందువసించుట కష్టమగుట యటుండ విద్యావ్యాసంగమునకుఁ గూడఁ దప్పనియంతరాయము

కలుగుననియు సరళ ప్రతి యిచ్చెను. న్యాయమే!

సరళకు బెంగుళూరు విడిచివచ్చుట కిష్టము లేదని యనంతనాథుఁ డెఱింగెను. నిజము చిన్ననాఁటినుండి యిల్లువెడలనిసుకుమారి నేఁ డొంటరిగఁ బరదేశమున నెట్లుండఁ గలదు? కాని తానొకఁడే యరుగుట చాలకష్టముగనుండునని తోఁచెను. యోజించిచూడ సరళకం దేమి కష్టము? సాధ్వికి పతితోడికష్టము కష్టమా? కాని రమ్మని ఖండితముగఁ జెప్పుటకు సరళ వైదికునికూఁతురా? కాదు. అనంతనాథుని కేమియుఁ దోపలేదు. ఈనిర్ధారణమునకై కొన్నాళ్ళుగడచెను. తరువాత నెట్లయినను బోఁదలఁచెను గాని, తటాలున తనమనోహారిణిని వదలిపోఁ జూచుట చాలప్రయాసముగఁ గానిపించెను. పోకతప్పదు గదా! ఇంతలో నేఁడు రేపు ప్రయాణమని మరల రెండు మూఁడు వారములు గడచెను. ఇఁకమీఁదఁ బోయిమాత్రము ఫలమేమి? పాఠములతిక్రమించియుండును. మఱియుఁ గలాశాలలో స్థలము దొరుకుటకూడ కష్టమే. కావున నీసంవత్సర ముపయోగము లేదనియు, వచ్చుసంవత్సరము చదువఁబోవలయుననియు నిశ్చయించి యనంతనాథుఁడు నిశ్చింతగనుండెను.

ఇంకేమి? మరలసుఖము! మరల నానందము! మరల విహారము!! ఇప్పుడు మిత్రులతో సల్లాపము! ఇప్పుడు సంగీతాకర్ణనము! ఇప్పుడు తనమనోహారిణి గోష్ఠి!! అనంతనాథుఁడు మరలఁ దన్నుదాను మఱచెను. పట్టపరీక్షను దలంపను లేదు. జననీజనకులఁదలపెట్ట లేదు! కమలను స్మరింపలేదు!! లక్ష్మీకాంతునితోడి సల్లాపమో సరళతోడివిహారమో తప్ప వేఱుప్రపంచమే యాతనికి గోచరింపదయ్యె. ఎప్పుడు సూర్యుఁ డుదయించునో, యెపుడస్తముఁ జెందునో, యెప్పుడు చీఁకటిగ్రమ్మునో, యెపుడు చంద్రిక ప్రసరించునో, ఆతరుణున కేమియుఁ దెలియదయ్యె! సర్వకాల సర్వావస్థలయందును సంపూర్ణముగ

నానందరసప్రవాహమునఁ దేలియాడుచుండుటచే ననంతనాథునకు తన్మయత్వము సిద్ధించెను. తక్కినప్రపంచమే మిథ్యయయ్యె. అఖండమై యవిదితవేద్యాంతరమైన యానందబ్రహ్మానుభవము సాక్షాత్కరించుటచే నతనికా సర్వశక్తితో నైక్యము చేకూఱెను. అద్వైతము కరతలామలకమయ్యెను !!

దివసములు పరువిడుచుండెను. వారములు నెలలగుచుండె. దాదాపుగ, వత్సరము సమీపించెను. మరలఁ గళాశాలలు మూయఁబడియెను. విద్యార్థులందఱును దమతమ నివాసములఁ జేరిరి. రామమోహనుఁడు బెంగుళూరునకు వచ్చెను. న్యాయస్థానము మూసియున్నందుచే లక్ష్మీకాంతుఁడుగూడ మైసూరునకుఁ బోవలసియుండెను గాని, తనమిత్రునివియోగము నోర్వరాక కాఁబోలు, నాప్రయత్నము మానుకొని యందేయుండి, వేఱుపనిలేనికతంబున నించుమించుగ నన్ని వేళలందును సరళానంతనాథుల గోష్ఠిలోనుండి సల్లాపించుచు వారి కానంద మొసంగుచుండెను.

---

# ప్రణయాసరణిం

---

## ఎసిమిదవ ప్రకరణము.

—:o:—

శపథము.

"అహా మేవ గురుస్సుదారుణానామితి హాలాహల మాస్మ తాత దృప్యః
నను సంతి భవాదృశాని భూయో భువనేస్మిన్ వచనాని కామినీనామ్."

[కువలయానందము.]

సాయంకాలము మీఱినది. సూర్యభగవానుఁ డింతకుమున్న యస్తముఁ జెందియుండెను. అతని యనుచారిణి సంధ్య యించుక సేపు

ప్రపంచమంతయు జపాకుసుమమాలికలచే నలంకరించి, పదపడి పతి వెన్నంటి యంతర్థానముఁ జెందినను, ఆరామము నాలుగుకోనలందును వరుసగ నాటఁబడి నేలముట్టుచుండు గుజ్జుమావిచెట్ల లేఁజిగురుటాకుల యందు మాత్రము నిలిచి యింకను నిజవైభవముఁ జూపుచుండెను. మఱియొకప్రక్క ప్రవాహ మప్పుడే తీసియుండఁ దనపైఁ బ్రతిబింబించి యుండు తరంగముల మనోహరముగ ఝుంకను జెదరకయుండు తరంగిణీ విశాలసికతాతలముఁబోలె, వాతవశమున విశీర్ణములైన ధవళ మేఘశకలము లందందు పలుదెఱంగుల నమర్పఁబడినట్లు విస్తరించి కొనియుండ, వినీలమై, నిర్మలమై, శాంతమూర్తినిజూపు నాకాశతల ముపైఁ గొంతవఱకునెక్కి నిరర్గళముగఁ జరించుచు నిండుచందురుఁడు సంధ్యాదేవి వేసిన వన్నెకంతయు మాఱువన్నె వేయఁదొడఁగుచుండెను. సుసజ్జితములై. నిర్మలీకృతములైన పూవుఁదోటలోని కృత్రిమ మార్గముల కిరుప్రక్కల నభినవజలసిక్తములైన శాద్వలప్రదేశముల నందందు క్రమముగ నమర్పఁబడియున్న చిన్నిపందిళ్ళనల్లుకొనియుండు మల్లితీవలలో నిండారు పండుమొగ్గలు, తాము సేకరించిన సౌరభద్రవ్యమును మంచిమాటలతోను ముద్దుజేతలతోను నపహరించుకొని పోవఁ జూచు సమీరకుమారుని వంచనకు లోనై వికసించి, గగనతలమునుండి తరంగ తరంగములుగఁ బొరలి వచ్చు సాంద్రచంద్రికాపూరంబులతో నచ్చుమెచ్చుగఁ గలిసి నవ్వులాడుచు నిరంతరామోదము ననుభవించుచుండెను. నేఁడు కార్తిక పూర్ణిమ.

ఆరామ మధ్యమున నొకరమణీయ విలాసమందిరము. మిగుల గొప్పది కాదు గాని, యది చాల మనోహరమై, యేకాంతవిహారములకుఁ గడు ననుకూలమై యుండెను. పట్టుమెత్తల కురిచీలును సోఫాలును మొదలగు మహార్హాసనముల కందు కొఱఁతె లేదు. చుట్టును అతి ప్రయత్నమునఁ బెంచఁబడి నవవికసితకుసుమమంజరుల నుపాయనముగ

వర్ధించుచున్న గులాబీ మొదలగు పూలచెట్ల కుండు లామందిరమునకుఁ బెట్టని యలంకారములు. ద్వారము ప్రక్కలనున్న నల్లరాతి తిన్నెల పొంతనుండి యంకురించి లేచి గోడపొడవున నెగఁబ్రాఁకి, మందమారుత విలాసములకు మెచ్చుచుఁ దలలాడించుచు నొండొంటఁ బెనఁగొనుచుండు నునుఁదీవ లాయింటికిఁ గట్టని పచ్చతోరణములు. గృహమధ్యమునందు పైనుండి వ్రేలాడు నొకకాచగోళములోని విద్యుద్దీపమంజరినుండి వెలువడు తేజఃపుంజములు, ప్రక్కలనున్న గొప్పనిద్దపు నిలువుటద్దములలోఁ బ్రతిబింబించి శతగుణములై చంద్రికాప్రభల నపహసించుచుండెను. ఆనునుగాలి తరితీపులును, ఆపరిపూర్ణచంద్రచంద్రికాతరంగవిలాసములును, ఆసుమజాలముల నవనవామోదవిలసనములును, ఆతేజోమయానందరసామృతరుచులును స్వానుభవగోచరములుగ నొనరింప నాయారామగృహ మెంతయుఁ దగు ననుట కన్న నెక్కువ నుడువఁజాలము!

ఆమందిర పురోభాగమునఁగల చలువపందిరిలో నొకతూఁగుటుయ్యెలపై సవిలాసముగఁ గూర్చుండి యూఁగుచు సల్లాపరసామృతము ననుభవించుచున్న తరుణదంపతు లెవరు? సందేహమేల? ఆయామోదము నచ్చోట ననుభవింప సంపూర్ణాధికారము వహించిన వారు సరళానంతనాథులు దక్క వే రెవ్వరు గలరు?

„సరళా!" అనంతనాథుఁడు ప్రేమపూర్ణమగు దృష్టితో దయితనుజూచి యనియెను. „కడచిన యేఁడీరాత్రి మద్రాసులో సముద్రతీరమునఁగూర్చుండి రామమోహనునితో చర్చించుచున్నపుడు నేఁడు నీతో సరసములాడఁ గలనని నమ్మియుండలేదు."

„ఏమి చర్చించుచుంటిరి?" సరళ చిరునవ్వుతో ప్రశ్నించెను.

„మన వివాహ విషయమే. అపుడు నాయాలోచన యిట్లు ఫలింపఁగలదని నమ్మియే యుండలేదు. దైవసంకల్ప మెంతఘనమో చూచితివా?"

"అంతయు మీ సంకల్పమే !"

"నాసంకల్పమేమి ! నీయనుగ్రహము."

"మీరు సంకల్పింపకుండిన నాయనుగ్రహ మేమిపనికివచ్చును ?"

"కాదు ! నీవనుగ్రహింపకుండిన నాసంకల్పము సఫలమగుచుండెనా ?"

"ఈమాటలకేమిగాని" సరళ వేఱుప్రస్తావము నెత్తి మగని మొగముఁజూచి యనియెను. "లక్ష్మీకాంత మెక్కడ ?"

"చిత్రమైన వ్యవహార మొక్కటి లభించినదఁట. మామగారితోఁగూడ కక్షిదార్లతో మాటలాడుచున్నాఁడు."

"అందఱికి నేమైన వ్యాసంగ ముండును. మన కిరువురకుమాత్ర మేమియు లేదు గదా !"

సరళముఖమున మందహాస మంకురించెను.

"ఇంతకన్న వ్యాసంగమా? సర్వవ్యాసంగములఫలమును నేననుభవించుచుండలేదా" అనుచుఁ జిరునగవంకురింప ననంతనాథుఁడు "ఇదిగో! ఇపుడుగూడ ననుభవించెదను" అనుచు దీర్ఘమైన తన వామబాహువు నాకాంతకంఠమునఁ జుట్టి తటాలున తనకడకు లాగి బలాత్కారమున నామె కొసరుచున్నను వీడక యొక్కమాఱా మెమ్మృదుకపోల దర్పణమును ముద్దుగొనెను.

మందహాసమునకు మాఱు మోమునఁ గోపము దీపింప నాతరుణి, తన రెండుచేతుల నాతనిపట్టువదలించుకొని ప్రక్కకొరిగి బొమలు ముడివైచుకొని కడగంట నతనింజూచుచు నిట్లనియె.

"మీకెప్పుడును కాలనిర్ణయమే లేదు! వచ్చిపోవువారి నైనఁ జూడరు!!"

"అపరాధమైనది! దేవీ!! క్షమింపుము!!" అనుచు ననంతనాథుఁడించుక వెగటుగ నవ్వి యాయమ చెంతకు మరలఁ బోఁ జూచునం

తలో లక్ష్మీకాంతుఁడందు వచ్చి నిలుచియుండెను.

"వచ్చితివా? కూర్చుండుము. మాకొక వ్యవహారమున్నది!"

"మీకు వ్యవహారమా?" సరళవంకఁ జూచి నవ్వుచు లక్ష్మీకాంతుఁడు చెలికాని ప్రక్కలోఁ గూర్చుండి, "ఏమి?" అనియెను.

"సరళా! చెప్పుదునా?"

"చెప్పుఁడు!" సరళ మందహాసముఁ జేయుచు మాఱుమొగమై "అతఁడు మాత్రము వేఱువ్యాసంగమే వలదనునా?"

"ఓ! సరి!" లక్ష్మీకాంతుఁడును నవ్వెను. "ఆతప్పు అనంతనాథునిదిగాదు. నీప్రభావమే!" "మీరుమీరు నొక్కటేగదా!" యని సరళ తలవంచి యించుక ప్రక్కకుఁ దిరిగి మోమున నుదయించిన వికాసమును మాటుపఱిచెను. లక్ష్మీకాంతుఁడు అనంతనాథుని వంకఁ జూచి "అయిన, అనంతా! మాసరళపరముగ నేను గొంచెము వాదముఁ జేయవలసియున్నది. నీవు పట్టపరీక్షకుఁ బోక మానుట మాకెంతయు విచారకరము"

"ఇంకెక్కడి పరీక్ష!" సరళ యెత్తిపొడిచెను.

అనంతనాథునివదనము ఇంచుక విన్నఁదనముఁ జెందెను. సరళా లక్ష్మీకాంతు లొకటియైరి! తనపరముగఁ దానే వాదించుకొనవలసివచ్చెను.

"నిజము! కాని యీపరీక్షలన్న నాకు తలనొప్పిపుట్టినది. ఈపరీక్షకులకు జ్ఞానమున్నదో లేదోయని నాకు శంక! నాకన్న నధములనెందఱినో పరీక్షలోఁ గడ తేర్చిరి. నాకుమాత్రము గుణముల నియ్యని కారణ మేమో నాకుఁ దోఁపదు. అందఱును మొదటి తరగతిలో నుత్తీర్ణుఁడ నగుదునని నిశ్చయించి యున్న నన్ను తుద కట్లుచేసిరి! ఇఁక మరల చదివిన మాత్రమున ఫలమేమి?"

"మీరు పరీక్షలో నుత్తీర్ణులైన తమ కవమాన మగునని

తలంచి వా రట్లు చేసిరి కాంబోలు !" సరళ మొగ మించుక వికసింప లక్ష్మీకాంతునివంకఁ జూచెను. అనంతనాథుఁడును సరళవంకఁ జూచెను. అనంతునిజూచి లక్ష్మీకాంతుఁడు,

"ఎట్లయినను మరల నొకతూరి వ్యాసంగ మొనర్చుట బాగని నామతము." అని పల్కెను.

"నిజమే కాని, యిచ్చట నాయభిమానశాఖ లేదు. చెన్నపురిలో నెండలు భరింపఁదరముగాదు—"

"మైసూరికిఁ బోవచ్చునే !"

"మైసూరిలో నుపాధ్యాయు లంత మంచివారు గారు. ఇంతకును అందు కళాశాల యేర్పాటే సరిగ లేదఁట—"

అతఁడు చెప్పుమాట సగములో నందుకొని సరళ,

"ఇవన్నియు నేమి ? సరళను విడిచిపోలే ననరాదా !"

అని పల్కి యారమణి మందహాసదీప్తులు మోమునకు వన్నె వెట్టఁగా కడగంట లక్ష్మీకాంతుని జూచుచు మో మావలకుఁ ద్రిప్పివేచెను. లక్ష్మీకాంతుఁడు నెంత ప్రయత్నించినను మందహాసమాఁపలేఁ డయ్యె.

అనంతనాథునిహృదయమున నీహాస్యము తీక్ష్ణశూలమువలె నాఁటెను. సరళ యెన్నియో మా ర్లీవిషయమున మాటాడినదిగాని, యపు డది హాస్యముగఁ దోఁపలేదు. ఏకాంతమున నిట్లాడియున్నచో నేఁడుగూడ నది సరసము క్రిందనే వచ్చుచుండెనేమో ! కాని నేఁడు పాకము దప్పినది ! సరసము ముదిరినది !!

వదనమండలమున వివర్ణత దోఁపగా ననంతనాథుఁ డేమనుటకు రాక వా రికపురిపై దృష్టి సారించెను. సరళ మొగమున చిరునవ్వింకను అడఁగి యుండలేదు. లక్ష్మీకాంతుఁడు మాత్ర మదను గాదని తలంచి కాంబోలు, నవ్వునాఁపియుండెను. అనంతనాథుని హృదయాల

వాలమున రోషబీజములు నాటుకొనెను. ఏమో పలుక నుంకించెను. గాని కంఠము నిరుద్ధమయ్యెను. సరళను దండింప నాలుకకు మాట వచ్చెను గాని, యంతలో తెలివి జనించెను. ఇష్టము వచ్చినట్లు దండింప సరళ యేమి వైదికులయింటి కూఁతురా? ఇదియుఁగాక విద్యావతి! భాగ్యవతి! పట్టపరీక్ష నియ్యకున్న తనకు మర్యాద గలుగదని దృఢమయ్యెను. రోషము ముప్పిరిగొనియెను. ఎట్టకేలకు అనంతనాథుఁడిట్లు పలికెను.

„సరళా! నీ వట్లు తలఁతువేని నేను రేపే చెన్నపురికిఁ బోయెదను. పరీక్షలో కృతార్థుఁడ నగుదాఁక మరల నీబెంగుళూరిలో నడుగు పెట్టను! ఇదే నాశపథము!!"

ఆశ్చర్యమునఁ గన్నులు వికాసమందఁగా సరళ,

„ఇదేమి శపథము! బాగున్నది! నాపై నిష్ఠురము త్రోయుటకు మార్గమా!"

„నిష్ఠురమేమి! నాధర్మ మిది యని నాకు బోధపడినది.!"

„సరసమాడినందులకై యింత కోపము సరికాదు! ప్రతి కార్యమును చక్కఁగ నాలోచించి చేయవలయును. పోవలసినఁబోవచ్చును; కాని యీశపథము లేల?

అని లక్ష్మీకాంతుఁ డనునయించెను.

„క్షమింపుము! ఇది నాదృఢాభిప్రాయము!"

„సరసమున కట్లాడిన నదియు తప్పా?" అనుచు సరళ మొగమునఁ జిరునగవు దోఁపఁగాఁ జేరవచ్చి నాథుని చేయిపట్టి,

„క్షమింపుఁడు! మీశపథమును వలదు! మీరు పోవనువలదు! రండు పోవుదము!" అని మృదువుగఁ బల్కెను.

„క్షమింప నేల? మంచియుపదేశ మిచ్చితివి!"

„సరి! ఈకోపము మానుదురా లేదా? హార్మోనియము మును

వాయింతము. రండు!"

అనుచు సరళ మృదుహస్తముల ననంతుని బట్టి లాగెను. "పోవుదము రమ్మా!" అనుచు లక్ష్మీకాంతుఁడును లేచెను. అందఱు నామందిరముఁ బాసిరి.

---

# ప్రణయసరణి

—:o:—

## తొమ్మిదవ ప్రకరణము

—•—

### సరళ జాబు

"అర్థ స్సుఖం కీర్తి రపీహ మా భూ
దనర్థ ఏవాస్తు తథాపి ధీరాః
నిజప్రతిజ్ఞా మధిరూఢమానాః
మహోద్యమాః కర్మ సమారభంతే"

(శార్ఙ్గధరపద్ధతి)

అనంతనాథుఁడు చెన్నపురికలాశాలలోఁ జేరి యైదుమాసములు కావచ్చినవి. ఆసుఖమును భోగమును విలాసమును ఇపుడెందుఁ బోయినవో కాని, రేవగలు నతిశ్రద్ధతో వ్యాసంగముఁ జేయుచు నితరముఁ దలపెట్టకున్నవాఁడు. నాఁటి సరళవాక్యమే నేఁటికిని నుపదేశగురువై యతనిని బోధించుచున్నయది. నవనాగరకలక్షణములన్నియును క్రమక్రమముగఁ దగ్గుముఖమువచ్చెను. నాఁటినుండి యతని గుణములయందును దలంపులందును మార్పు పొడకట్టసాఁగెను. పురాతనాచారములఁ దూలనాడిన వెంటనే గౌరవము గలుగదని యతఁడు తలపోయసాఁగెను. ప్రాచీన నవీనమార్గముల రెంటియందును లోప

ములు గలవని యతఁడు నిర్ధరించుకొనియెను. కళాశాల చేరుటకై బెంగుళూరువిడిచి వచ్చునపుడు వియోగమును సహింపలేక సరళ తన్నెంతయో బతిమాలెను గాని, పట్టినపట్టు నతఁడు వదలలేదు. స్వాభిమానముముందఱ ప్రియావిరహముగూడఁ బనికిరాదయ్యెను. తగిన సదుత్తరములనిచ్చి భార్యను సమ్మతిపఱచి మఱునాఁడే చెన్నపురికివచ్చి కళాశాలలో చేరి నాఁటినుండియు నత్యంతపౌరుషముతో వ్యాసంగము చేయుచుండెను.

ఆహా! స్త్రీల ప్రభావమెంతటిది! అనంతనాథునిబోలు మోహాంధునిమనసు ద్రిప్పవలయునన్న నెట్టివిద్యావంతులగుమహనీయులకైన సాధ్యమగుచుండెనా? అట్టి యానందసాగరమునఁ బారము గానక తేలియాడుచుండినవాని నొక్క సరళపోటుమాటదప్ప నింకెట్టివారి యుపదేశమైన గట్టునకుఁ దేజాలియుండునా? కల్ల! పాఠకమహాశయులారా! ప్రపంచమున మానవుఁడు వృద్ధినొందినను హీనగతిఁ గాంచినను దప్పక యది తరుణీమణుల ప్రభావముగానేయుండును. ఇందతిశయోక్తి లేశమును లేదు. యోగులెందఱో వారి మాహాత్మ్యమునకోడి జపతపములవదలి పేరుకు జోగులయిరి. ప్రపంచమున నతిహీనదశను గాంచినవా రెందఱో మహనీయతఁ గాంచిరి. ఇంతయయ్యును మనగ్రంధకర్తలపాలికి వా రబలలే! వేయేల? ఇప్పటి గ్రంథములును కవులును బదివేలరెట్లు హెచ్చినను, ఆయబలలప్రభావము పరిపూర్ణముగ వర్ణింపఁబడనేరదని మాదృఢవిశ్వాసము!!

ఎండకాలపు సెలవుదినములు గడచుచుండెను. విద్యార్థులందఱు యథాప్రకారముగఁ దమతమ నెలవులఁ జేరిరి. అనంతుఁడు మాత్రము చెన్నపురిని వదలలేదు. ఎట్లువదలఁ గలఁడు? సరళతో నాఁడు పల్కినబీరముల నతఁడింకను మఱచియుండలేదు.

ఒకనాఁటి ప్రాతఃకాలమున నతఁడొంటరిగఁ దనగదిలో నొక

కురిచీపైఁ గూర్చుండి యాలోచించుచుండెను. నేఁడతని మనసు చాల
భారముగ నున్నది. సహపాఠకులెవరును లేరు. నిరంతరము చదివి చదివి
యించుక విసుకుజనించియుండెను. కాక వేఱొక్క కారణము గూడఁ
గలదు. తాను చెన్నపురికి వచ్చిననాఁటినుండియుఁ దన ప్రాణప్రియనుండి
యొక్క లేఖయైన రాలేదు. ఇదియొక్కటి యాతని మనంబున కించుక
క్లేశదాయకమై యుండెను. వలదువలదని యెంత వేఁడుకొన్నను వినక
తన్నువదలివచ్చినందుకై సరళ కోపగించియుండనోపు! లేకున్న నొక్క
జాబైన ప్రతి వ్రాయకుండునా? ఆత్మాభిమానము ముందు ప్రేమము
నైనను మఱుఁగు పఱచుట స్త్రీల స్వభావముగదా! ఇందులకేమి
చేయుటకును అనంతునకుఁ దోపలేదు. తుదకు తప్పుతనదే యనుకొని
యెను. తనమనఃప్రియకు నిట్టిదుస్సహక్లేశముఁ గల్గించుటకై యతఁడు
చాలదుఃఖించెను. కాని యిపుడు చేయునదేమి? సెలవులలో నొక
నాఁడు బెంగుళూరునగరమునకుఁబోయి సరళ క్షమాపణ వేఁడి రావలె
నను తలంపు జనించెను గాని, తటాలున నాపాపిశపథ మొక్కటి
తలఁపునకువచ్చెను. అనంతనాథుఁడు దానినిదాఁటఁ గలఁడా?

ఇంతలో బయటనెవరో „ అనంతనాథశర్మగారు ! " అనిపిలు
చుట వినవచ్చెను. తిరిగి చూచునంతలో తపాలావాఁ డొకలేఖను
దెచ్చియిచ్చిపోయెను. అందుపై బెంగుళూరుముద్ర యుండెను. పై
యక్షరములు తన మోహంపురాణివి సరళవి!

మిగుల నాత్రమున నానందమునఁ బరవశుఁడై తటాలున లేఖ
విచ్చి తిలకింపఁగా నందుఁ దన మనోహారిణిసరళ చేవ్రాలగపడియెను.
మన సొక్కింత కుదురుపడఁగా „ ఇన్నాళ్ళకా మొదటిజాబు ! "
అనుచు మోమునఁ జిఱునవ్వు దోఁపఁ గూర్చుండి యాలేఖనామూల
ముగఁ బఠించెను. అందిట్లు గలదు.

ప్రాణాధికా

బెంగుళూరు
10 జూను

మీయెడ నేను మహాపరాధం బొనర్చినదానను. క్షమాపణ కనర్హనని నాహృదయమే నను బోధించుచున్నయది. ఐనను ప్రాణాధిపు లగు మీయెడ నాకుఁగల యపూర్వవిశ్వాసమే యీయపరాధము నకుఁ గారణమగుటచే దయాళురగు మీరది మన్నింపకపోరని సాహ సించి యీలేఖ నిపుడు వ్రాయఁదొడఁగితిని.

పసితనమునను చనవు పెంపునను తెలియక సరసమాడినందుల కై రోషమూని, మీరు తరువాతఁ బశ్చాత్తప్తులై యెంత వేఁడుకొ న్నను, వినక చెన్నపురికి వెడలినంత నాహృదయ మెట్లుండునో దైవ మెఱుఁగు! వియోగము నోర్వని హృదయప్రియ వేఁడికోలునైన నాద రింపక కట్టిఁడిమనసుతో వెడలిపోవుటచే, ముగ్ధజనసహజ మైనయభి మానమునకుఁ బొల్పడి, రోషవశమున నాక్షణమున నాపలుకు విన కున్నను పిదప పశ్చాత్తప్తులై యొకనాఁడైన మరలవచ్చి నన్నాదరించి యూరడింపకపోరను నమ్మకమున మీలేఖకుఁ బ్రతివ్రాయనై తిని. కాని యాదైవము నాగర్వమునకుఁ దగినఫలమనుభవింపఁ జేసెను. క్షణము యుగమై పరిణమించుచు వచ్చెను. నెలవుదినము లలోనైనఁ దప్పక వచ్చి నన్ను మన్నింతురని చాలనమ్మితిని. కాని యీరీతి మీయర్థాంగి నలఁతురని కలనైనఁ దలఁపలేదు. ఇపుడు నా యపరాధము నాకు బోధపడినది. నాయజ్ఞానము నాకుఁ దెలిసినది. నాదురభిమానమును పఱచినది. మీశపథము తీరువరకును నీనగరముఁ జొరరని స్పష్టమైనది. నాయాశలు వ్యర్థములైనవి. కాలము దుర్భర మైనది. చేయునదిలేక నాయజ్ఞానకృతమునకు నేనే ప్రతిక్రియ చేయ నెంచి యీలేఖ వ్రాయసాహసించితిని.

రేపు ప్రాతఃకాలము ఎనిమిదిగంటలబండిలో దానితో వెడలి

చెన్నపురి చేరుదానను. తెలిసియో, తెలియకయో, యిది నిర్ధరించితి. అబలను ముగ్ధను, సదా మీయధీనను.

ఇట్లు
తమ యర్ధాంగి,
సరళ.

ఈలేఖ ముగియునప్పటి కనంతనాథునిహృదయమున సంతోష విషాద సంభ్రమము లేకకాలమున నావిర్భవించి మితిలేని యలజడి జనించెను. మందహాసముగూడ మోము నలంకరించెను. కన్నులార్ద్రము లయ్యెను. మనసు తడఁబడ సాఁగెను. కర్తవ్యము తోఁపదయ్యెను. తన మనోహారిణి విషయమునఁ దా నొక గొప్పయపరాధమునకుఁ బాత్రుఁ డయ్యెనని యతఁడు చాలసంతాపము నందెను. నిజముగఁ బురుషులు కఠినహృదయులే! ముందు వెనుక లాలోచింపక తా నొనరించిన శపథమునకై యనంతనాథుఁడు తన్నుఁ దా నిందించుకొనెను.

„ అయ్యో ! నేనెంత పాపిని ! ఎంతటి యవివేకుఁడను ! నిష్కారణముగ నాప్రాణపదము నిన్నికష్టముల పాలుచేసితిఁగదా ! నేనెంత పిచ్చివాఁడను ! ఎవరైన నిట్టివెట్టిశపథముఁ జేతురా ? అందున నర్ధాంగి విషయమందా ! అక్కటా ! సరళ యెంత దుఃఖించెనో, ఎంతపరితపించెనో, నిర్దయుఁడని నన్నెంతదూరెనో, నాకై యెంతని యెదురుచూచెనో !! అట్టి జీవన సర్వస్వమున కెట్టి మూర్ఖుఁడైన బదులాడ నోపునా ? నాయభాగ్యమున నట్లు చేసితిఁగాక ! ”

ఇంచుక తడ విట్లు తలపోసి యనంతనాథుఁడు మరల నాలేఖను జదువసాఁగెను. మరల విషయము లన్నియు సమన్వయించుకొనియెను. ఆహా ! యేమి యాప్రేమ ! ఎంతటి వినయము ! ఎంతగొప్ప

మనసు ! అర్థాంగియన్న నిట్టి రత్నమునకుఁగాక తక్కుంగల వారి కా పేరు తగునా? నిజము. సత్యముగఁ దగదు. అనంతనాథుఁ డుప్పొంగెను. అతనికి భుజములు నాలు గయ్యెను ఆజానూసములనుండి యడఁగియున్న ప్రియావియోగ మంతయు వేయిమడుంగులుగ నొక్కమాత్రే వచ్చి యతని హృదయమును గలంచెను. అపుడు గాదిపుడు తన హృదయమున యితను జూడ మన సుత్కంఠించుచున్నదిగాని యాని మేష మింకను వేలకొలఁది యామడల దూరమున నున్నట్లు దోఁచెను. ఇట్టి జాబేమియు వ్రాయక సరళ తానే కట్టెదుర ప్రత్యక్షమైయుండిన నీప్రయాస ముండదు గదా!

చేతి గడియారమున నింకను బది గంటలే యగుచుండెను. రాత్రికిఁగదా సరళ వచ్చుట! అవును. అయ్యో! ఇంకను దొమ్మిదిపది గంటలు గడుపవలసి యున్నవి. ఇది చాల దుర్భరము; దుస్సహము. తన జీవితకాలములో నంతయు నింతటి కష్టము ననంతనాథుఁ డెన్నడును రుచిచూచియుండలేదు. లేఖను దీసియుంచి యాసనమునుండి లేచి యేమో మరచినట్లు ఆకసమువంకఁజూచుచు నించుకసేపు యోచించెను. కాని జ్ఞప్తిమార్గమున కేమియు రాలేదు. గదిలో నట్టిటుఁ బచారు చేయసాఁగెను. మరల గడియారమువంకఁ బరికించెను. మరల పాదచ్ఛాయలు వేయసాఁగెను. ఇంతలో నేమో జ్ఞప్తికి వచ్చెను. తటాలున మరల నాలేఖ నందుకొని చదువుకొనుచు నందలి ప్రతిపద నారస్యమును దలపోసి వ్యాఖ్యానము చేసికొనుచు నాసీనుఁ డయ్యె. క్షణములో మరల లేచెను. గదిబైటికరిగి యట్టిటు చూచి మరల లోపల ప్రవేశించెను. ఏమో పిచ్చిపట్టిన యట్లుండె.

పాఠకమహాశయులారా! అనంతనాథునియవస్థఁ జూచి మీకు నవ్వువచ్చునేమో! వలదు. ఈవిషయమున వాని తప్పేమియు లేదు. నిజముగ నిదియొక పిచ్చియే. ఈయవస్థలో నున్నవారి కేమియుఁ

దోఁపమి సహజము. ప్రజ్ఞ సర్వమును శూన్యమయి యుండును. గట్టిన నున్న మన మెన్ని పరాశరనీతులనైన నాడవచ్చునుగానియనుభవించు వారికిఁ గదా యందలి తత్త్వము తెలియఁగలదు! వారికింగల ప్రియావిరహ మెంత దుస్సహమో మన మెట్లెఱుంగఁగలము! అట్టి యపూర్వరూప లావణ్యతారుణ్య విద్యాసౌభాగ్యనిధియగు మనోహారిణికై యెవఁడు చింతించి విలపించి పిచ్చియెత్తి తిరుగకుండును? ఇవన్నియు ప్రబంధములలోని కవుల కల్పనలని భ్రమింపవలదు. నిజమారయఁ జూచినచో మన యనుభవములో నిందుకుఁ బెక్కు నిదర్శనములుండకపోవు. రేయుంబవలు నిద్రాహారములు మాని, చదువుసాములకు నీలు నీరొసంగి, నాయికను దలఁచి చింతించు వా రెందఱు లేరు? మనఃప్రియావిరహము నోర్వక “హా” యని కన్నులనీరు నించుచు దిక్కుదోఁచక వెంగలులుంబోలెఁ ద్రోవలఁబట్టి పోవు వా రెందఱుండరు? ఊహింపుఁడు. సరళవంటి సహధర్మిణీవియోగము ననంత నాథుఁడు మాత్ర మె ట్లోర్వఁ గలఁడు?

---

# ప్రణయసరణి.

## పదియవ ప్రకరణము.

—:o:—

### క్షమాపణము.

“మోహో న్మయా సుతను పూర్వ ముపేక్షిత స్తే
యోబద్ధబిన్దురధరం పరిబాధమానః
తం తావ దాకుటిలపక్ష్మవిలగ్నమద్య
బాష్పం ప్రమృజ్య విశతానుశయో భవామి.”

[అభిజ్ఞాన శాకుంతలము. అం. 2]

నాఁటిరాత్రి పది గడియలకు సరళ యనంతనాథుని భుజపంజరమునఁ జిక్కి యానందమునఁ దేలియాడుచుండెను. ఇఁక ననంతనాథుని యానందమునకు మేరయే లేదు. ఈప్రపంచమున సుఖ మను పదార్థ మొక్కటియున్న నది యిట్టిదేయని యతఁడు నిర్ధరించెను. ఇరువురును మై మఱచిరి. ఎవరును అధరస్పందము చేయలేదు. కన్నులరమోడ్చి, శాంతచిత్తులై సమాధినున్న తపోధనులఁ బోలి, యానందబ్రహ్మైక్యమును గనుచుండిరి. తా ముండునది యేలోకమో యేదేశమో యేయూరో యేయిల్లో యించుకయు వా రెఱుఁగరు! అహో! చిరకాల విరహతాపతప్తతనులగు నట్టి తరుణదంపతుల యేకాంత పరస్పరసంయోగ మెంత సుఖదాయకము! తక్కిన సుఖము లెన్నియైన నద్దానితో సరిపోలునా? అయ్యది యనుభవైకవేద్యముగాని వర్ణనమునకు సాధ్యమా? నీరసములైన మాఁపాడిమాట లెన్నియైన నేమి ఆయానందసాగరమునందలి సుఖకణశతాంశమునైన తృప్తికరము. వర్ణింపఁజాలునను నమ్మకము గలదా?

క్షణకాల మిరువురు నూరక చిత్రప్రతిమలఁబోలె స్తిమితులై యుండిరి. విశాలమైన యాతరుణుని యురమున ప్రక్కవాటునకొరగి యర్థనిమీలిత నయనయై తలవంచి యున్న యాసుందరీతిలకము నెమ్మనమున నెన్నిభావము లుత్పన్నములై యేకీభావముఁ బొందుచుండెనో యూహింప నెవరితరము? ఆనందరసాతిరేకమున వికసించి తాటంకమునందలి రవల దీప్తులచే నెంతయు తళతళలాడు నాసరళ సవ్యకపోలదర్పణమున చిందరవందరలుగ జారిపడి యుంగరములు దిరిగియున్న ముంగురు లాతరుణుని యవనత ముఖమునుండి వెలువడుచున్న నిశ్శ్వాసవాయుహతిచే మెల్లగ నాడుచుండెను. పరవశయై పడఁబోవనుండిన యాముద్దులగుమ్మ కాశ్రయమై కంఠమును జుట్టుముట్టి యామెరమణీయవక్షోభారముపైకొరగి యున్న యాతనివాము

హస్తము తదీయ శ్వాసవేగమునఁ గంపించుచుండెను. క్షణక్షణమున వారిశరీరముల విరియఁగాయుచున్న పులకాంకురములు హృదయముల నుద్భవించుభావవిశేషములకు సాక్ష్యమిచ్చుచుండెను.

నిమేషము లైదు గడచెను. అనంతనాథుఁడు కనులు విచ్చి హృదయేశ్వరిని గన్గొనియెను. సరళ యింకను సమాధిలోనుండెను. కొన్ని నిమేషములు రెప్పవాల్పక ఆసౌందర్యరాశిని గనులారఁజూచుచు తటాలున నాతఁడామె కరమును దనహస్తమునఁ గలంచిదీనస్వరమున,

"సరళా! నన్ను క్షమింపవా?" అనియెను.

సరళ కెందామరలఁబోలు తన నిడువాలు గన్నుల విచ్చిచూచెను. ఇరువురదృష్టియు నైక్యముఁ జెందెను. ఉదయించినచిఱునవ్వులకుఁ దోడు కన్నులఁ దోఁచు దీనత మోమునకు వన్నె వెట్టఁగా, సరళ క్షణకాల మనిమేషముగ నాథునింగాంచి తటాలున కనులర మోడ్చి మో మావలకుం ద్రిప్పెను. ఆమె కను లార్ద్రము లయ్యెనని యనంతుఁడు తలఁచెను. ఆతని ధైర్యము నీటికన్న పలుచనై పఱచెను. హృదయమున పరితాప మగ్గల మయ్యె. తనయవివేకమున కాతరుణుఁ డెంతయో చింతించెను. జీవితకాలమున నిం కెన్నఁడును తన హృదయేశ్వరి కప్రియ మాచరింపనని మనమున గట్టిశపథ మాచరించెను. మరల నాసుందరీచుబుక మెత్తి ముద్దుగొనుచు నతఁ డిట్లు పల్కెను.

"సరళా! సరళా! నే నపరాధిని!! మహాపరాధిని!!! నీవు మన్నింపకున్న నిం కెవరు మన్నింపఁగలరు? నాయవివేకమునకు నే నెంతయో చింతించెదను. ఇఁక మీఁద నెన్నఁడు నిట్లుచేయను. ఇదిగో! చూడు" అని యాతరుణి నెమ్మొగము నెత్తి తన కభిముఖము గావించుకొని "నన్ను మన్నింపవా?" అనియెను.

సరళ లేచి ముంగురులు రెండుచేతుల వెనుకకుఁ బాయఁద్రోచి చేరువఁగూర్చుండి చిఱునగ వొప్ప నాథునిం దిలకించుచు,

" నేనొక్క వరము వేఁడుదునా ?" యనియెను.

" అవశ్యము ! ప్రాణ మైన నిచ్చెద "

" మధ్యనగుట చేసాహసించియుటవచ్చితిని. క్షమింపవలయును "

" నేనా క్షమించుట ! బాగున్నది."

అనుచుఁ గడునాత్రమున నాతఁ డామెను గ్రుచ్చి కౌఁగిలించుకొనియెను. మరలఁ గొంతప్రొద్దెవరును మాటాడలేదు. అనంతనాథుఁడు పదపడి యేమో తలఁపునకు రాఁగా,

" సరళా ! ఇన్ని దినము లొక యుత్తరమైన వ్రాయఁగూడదా?"

" మీహృదయ మింత కఠినమని తెలిసియుండిన చో——" సరళ మందహాసముఁ జేసెను.

" నిజము——"

" ఏమినిజము ? అంతతప్పు నేనేమి చేసితిని ? "

" సరళను విడిచిపోలేనని నాఁడు నీవన్నమాట హాస్యముగఁ దలఁచితిని. అందునే నింతజరిగెను. "

" ప్రాణప్రియ యొక్క పరిహాసమాడినమాత్రమున నది తప్పుగాఁ దలఁచి నిష్కారణముగ కట్టడి మనసుతో విడిచివచ్చువారుందురా ? "

" సరళా ! " దీనముగ ననంతనాథుఁడనియె " పొరఁబాటైనది"

" పొరఁబాటేమి ? హృదయము రాయియైనగాదా ? పోనిండు! సెలవుదినములలోఁ గూడ బెంగుళూరికివచ్చి పోఁకూడదా ? అంతటి తప్పేనాది ?"

సరళకు తగిన ప్రత్యుత్తర మిచ్చుటకు ననంతనాథునకుఁదోఁపక పోయెను. తప్పు తనదికదా ! కావున నాతఁడు దీనత ముఖమునఁదోఁప నాతరుణిహస్తములఁబట్టి,

" ఆసాహసపథ మంత చేసినది ! నేనపరాధినని యొప్పుకొను

చున్నాను గదా! ఇంకేమి ? ” అని వేఁడెను. కడగంటి నాతనిగాంచుచు చిఱునవ్వుతో సరళ,

“ ఇప్పటిఁ గూడ శపథమేనా ? ” అని యతనియురముపై వ్రాలెను.

ఇంకెక్కడిశపథము ? ఇదియుఁగాక పట్టపరీక్షనియ్యక బెంగుళూరు చేరననిగదా యతని పట్టుదల ? అందుకేమిబాధ !

నిర్మలమగు నాకాశమున పూలఁజల్లిన తెఱంగున తారలు విరాజిల్లుచుండెను. పట్టణమంతయు నిశ్శబ్దముగ నుండెను. హాయి యనిపింపఁజాలిన సముద్రవాయువులు వీచుచుండెను. సముద్రము మాత్రము స్నిగ్ధముగ గంభీరముగ మ్రోయుచుండెను.

తటాలున నొక గొప్పగాలి భోరునవచ్చి యాంగడిలో మెలగుచున్న దీప కళిక నడఁచెను.

ఆతరుణి లిరువురు పక్కన నవ్విరి !

---

## పదునొకండవ ప్రకరణము.

చెన్నపురిలో వారముదినములు

సదా ప్రదోషో మమ యాతి జాగ్రతః
సదా చ మే నిశ్శ్వసతో గతా నిశా
త్వయా సమేతస్య విశాలలోచనే
మమాద్య శోకాన్తకరః ప్రదోషకః.

(మృచ్ఛకటిక)

“ సరళా ! నీవు నన్నెంతో నిందించియుందువుగదా! ”

“ ఏల ? ”

"సెలవుదినములలో రానందుకు"

"మీరేచూడుఁడు" సరళ మెల్లఁగఁ బల్కెను. "నిందింప వలయునో కూడదో!"

"తప్పక నిందార్హుఁడనే. పోనిమ్ము, ఇప్పుడైనను నన్ను క్షమించితివి గద!"

"అది నాకుఁ దెలియదు. పురుషుల మనసుకన్న స్త్రీలమనసు మృదువని యిప్పుడైనను మీకుఁ దెలిసినఁ జాలును. నేనే యంతటి యపరాధమును చేసియుండిన మీరు క్షమించుచుంటిరా?" సరళ పతి మొగముఁ జూచెను.

"సరళా! అన్నమాట మీఱలేక రోషమున నిక్కడికి వచ్చితిని గాని, తరువాత నెంత పశ్చాత్తప్తుఁడ నయితినో, యెంత దుఃఖించితినో, యెన్నిమారులు నిన్నుఁ దలఁచి తలఁచి కన్నుల నీరు నించితినో నేనిపుడెట్లు చెప్పఁగలను? 'గోరుచుట్టుపై రోకటిపో'టన్నట్లు జాబులెన్ని వ్రాసినను, ఎన్నినాళ్ళు నిరీక్షించినను, నీనుండి బదులొక్క జాబైన రానందున నాహృదయము మరింత వ్యాకులతఁ జెందినది. ఎంతయాలోచించినను నీయభిప్రాయ మిది యని తెలియలేక చాల కళవళపడితిని. దివసములు నడచుటయే దుర్భరమై తోఁచెను. మన్నింపఁబడఁగలనని ధైర్యముండినచో నాశపథమెట్లు పాడయిపోయినను, తప్పక బెంగుళూరికి వచ్చి నాముద్దుల సరళను మన్నింపవేఁడుచుంటిని. కాని, నీవు వలదన్నను వెడలి వచ్చితిని గావున నీవు కోపగించి యుందువని నమ్మి యట్లుచేయఁ జాలనైతిని. ఇంకను గొన్నిదినము లట్లే నీవనాదరమొనరించి యుండినచో నాహృదయ మెన్ని వ్రక్కలగునో నేనిపుడూహింపఁ జాలను. కాని యట్లుకాక, నాయపరాధము క్షమించి నాపాలిటి భాగ్యదేవత వలె నాసరళయే నన్ననుగ్రహించెను. ఈమహోపకారమునకై నాజీవితకాలమున, నాబంగారు సరళకు—"

అనుచు ననంతనాథుఁడు తన కెదురుగ సోఫాపయి తలగడ కాను కొని కూర్చుండి విశాల చంచల నేత్రమున నెడ తెగక తన్నుఁ గాంచు చు, చేతనున్న వార్తాపత్రికతో సవిలాసముగ నాడుచున్న యాతరు ణిని తటాలున తన రెండు చేతుల లాగి యొడికి దిగిచి, మందస్మిత సుంద రమై, యర్ధనిమీలితనయనమై, సంచలిత తాటంక ప్రభాపరిమండిత మగు నాదయితముఖబింబమును పలుమారు ముద్దుగొని,

“ఇంతకన్న వేఱేమియు బహుమతి నియ్యఁజాలను” అని తన యుపన్యాసమును ముగించెను.

వదలించుకొని తొలఁగిమిథ్యారోషమునసోరగంటఁజూచుచు,సరళ,

“ఈయాషాఢభూతి విద్యల కేమి? పుస్తకమును దీసికొనుఁడు”, అనుచు ప్రక్క బల్లపై నున్న చరిత్రపుస్తక మొకటి ముందు పడవైచెను.

“సరళముందు చరిత్రలా?” అనంతనాథుఁడు దరహాసిత మొనరించెను.

“అయిననిపుడే వెళ్ళెదను!” సరళ లేవఁబోయెను.

“నీపుణ్యము! వలదురమ్మ!” అనుచు ననంతనాథుఁడు పుస్త కమును చేతఁదీసికొని, సరళను మరలఁ గూర్చుండబెట్టుకొని, వెండియుఁ బుస్తకము నందు పడవైచి,

“మరచితి. సరళా! లక్ష్మీకాంత మెందున్నాఁడు?” అని వేరు ప్రస్తావ మెత్తి యడిగెను.

“మైసూరిలోనున్నాఁడు. అతని కేమి పుణ్యాత్ముఁడు!”

“అదియేమి?”

“అతని భార్య—యిందిర—గర్భవతియఁట!”

“సరి! అర్థమయినది”

అనంతుఁడు పక్కున నవ్వెను. సరళ కడగంట ప్రియుని జూచు చు పెదవి విరచి సాభిప్రాయముగ దరహాస మొనరించెను. మగల

ననంతనాథుఁడేమో పలుకఁబోవునంతలో, సరళ తటాలున సోఫానుం డిలేచి యాగది వెడలిపోయి బయట నిలచెను. కారణమెఱుఁగరాక మరల నాముగ్ధ కోపించెఁ గాఁబోలు ననుచుఁ దలఁచి “సరళా! సరళా!” యని పిలువఁగా, నావిలాసిని చిరునగవుదోఁప తాను లోపల రాఁగూడదని కాంతున కెఱింగించెను.

దినములు మూఁడు గడచెను. మరల నాల్గుదివసములదాఁక సరళ చెన్నపురియందే యుండెను. అనంతనాథునియానందమునకుఁ బారమే లేదు. అనుకూల తరుణసతీపతుల కొంటిపాటన్న పండుగు గదా! అతని కొక యాలోచన జనించెను. సరళ చెన్నపురియందే యేల యుండరాదు? నిన్న మొన్నటిదాఁక నెంతో కష్టమున వియోగ భారమోర్చి మరల నది తలపెట్టుటే యనంతనాథునకుఁ జాల భయంకరముగఁ దోఁచెను. సరళకు మాత్ర మిఁక నీవిషయమున విరుద్ధాభి ప్రాయ ముండునా? అయిన నింకొకటి. కలాశాల యింతలో తెరువఁ బడును. చెన్నపురిలో సరళతోడి యునికి వ్యాసంగమునకు చాలభంగ కారియని యనుభవమున నతఁ డూహింపవలసివచ్చెను. పౌరుషము లాడివచ్చి వ్యాసంగము చేయనిచో సహవాసు లవ్వకుందురా? ఇవ న్నియునుండ వేఱొక కారణముగూడ సంభవించెను. చెన్నపురియందలి శీతోష్ణస్థితి సరళకు సరివచ్చినట్లు గానము. ఎన్నఁడును బెంగుళూరు వదలిరాని కతంబున మార్పు సహింపక పోయియుండును. చెన్నపురికి వచ్చిన తరినుండి సరళ కాహారమే నాలుకకు రుచింపదయ్యె. ఆవులింతలును, సంకటమును బల మగుచు వచ్చెను. భుజించిన కొంతయాహారమును దక్కుచుండుటలేదు. పండ్లు ఫలములు నెన్నియో పతి మక్కువతోఁ దెచ్చియిచ్చెనుగాని, ఆశయున్నను నరుచికతంబున చవిఁ జూచి పరిహరించుచువచ్చెను. అనంతనాథుఁడు చాల భయపడి మందుల నిప్పింపఁ జూచెనుగాని, సరళ యనావశ్యకమని వారించెను. ఇదిగాక

మరలనెట్టైనను స్వగృహమునకుఁ బోయినచో నారోగ్యముగల్గఁగలదను నమ్మికచే నతఁడుగూడ నాప్రయత్నము మానుకొనెను.

చెన్నపురి వదలవలసివచ్చెను. మనోహరునివియోగము సైచుట సరళకు దుస్సహతరముగఁ దోఁచెను. తన మనోవేదన నాముగ్ధ యెన్నియో మార్లు నాథున కెఱిఁగించెను. వియోగము దలఁచి తలఁచి యెన్నియోమారులు నాథునివక్షము కన్నీటివరదచేఁ దడిపెను. ఇంచుక దూరమున నిలిచి సుందరమైన యనంతనాథుని సమ్మోహమును గనులారఁ జూచిచూచి యెన్నియో మార్లాతరుణి కన్నులనిండ నీరు నించెను.

ప్రయాణవేళ సమీపించెను. హృదయముల విషాదభర మధికమగుచువచ్చెను. కాని యెట్లును భరింపక తప్పదుగదా! నిర్గమనసమయమున తనకోమల బాహులతల ననంతనాథుని కంఠముఁ గౌఁగిలించి నయనమ్ముల నుష్ణవారిగ్రమ్మ, గళమున గద్గదిక దోఁప మోమెత్తి, యతనిమోముం గాంచుచు,

„ మీసరళపై దయ తప్పరుగద !” యనిసకరుణముగపలికెను.

„ నాప్రాణపదమా ! తప్పను. పోయిరమ్మ ! ” అనుచు నతఁడాయంగన నెదఁ జేర్చి యూరడించి, విడిచెను.

ఉత్తరక్షణమున దాసితోఁగూడ సరళ ధూమశకటము నెక్కి చెన్నపురిఁ బాసెను.

# ప్రణయసరణి.

## పండ్రెండవ ప్రకరణము.

—:o:—

### రెండు కోర్కెలు.

"........................

మహఉణ మఅణో దివావి రత్తింవి,
ణిగ్ఘిణ తవేఇ బలిఅం
తుఇ జుత్తమణోరహాఇ అంగాఇ''

[అభిజ్ఞానశాకుంతలము. 3. అం]

సరళ చెన్నపురిని వదలినంత ననంతనాథునకు ప్రపంచమే శూన్యమయినట్లు తోఁచెను. హృదయము కడుభారమై కార్యాంతరమే స్ఫురింపదయ్యెను. మనసు త్రిప్ప నెంతయో ప్రయత్నించెను గాని, ఫలములేదు. వచ్చిన సరళ నందే నిలుపక బుద్ధిమాంద్యమున మరల బెంగుళూరునకుఁ బంపినందుకై యాతఁడెంతయో పశ్చాత్తప్తుఁడయ్యెను; కాని కార్యము మించినది.

సరళను సాఁగనంపి మరల నిజనివాసముఁ జేరి ఖిన్నుఁడై యొక కురిచీపై నతఁడు కూలఁబడియెను. గృహమంతయు మునుపటిశోభ మాని యరణ్యమునందలి చీకటిగుహఁబోలె నాతనికిఁ గానవచ్చుచుండెను. తదేకధ్యానమున యోగివలె మౌనమున నొక్కింతతడవు గూర్చుండి యాలోచించుచుండి వేఁడియూర్పొకటి మోమున వెడలఁ గన్నులు మూసికొనియెను. కాని సరళ యీవఱ కాతనిం బాసి చాల దూరము పోయినది.

చింతించుట వ్యర్థమని తలపోసి మనసున నించుక ధైర్యమూని బల్లపై నున్న పుస్తక మొకటిదీసి పత్రములుత్రిప్ప సాఁగెను. ఫలమేమి? హృదయము తన యర్ధాంగికడకు ఱెక్కలుగట్టుకొని పరుగిడుచుండెను.

ఒంటరిగ నుండ రా దని నిశ్చయించి ప్రొద్దుపుచ్చుటకై వీథిలోని కరిగెను. చాల శ్రమమున నాల్గుదినములు గడచినవి.

అంతలో బెంగుళూరినుండి లేఖ వచ్చెను. దారిలో సుఖముగ ప్రయాణముచేసి నియమితకాలమునకు సరళ నిజనివాసమునకుఁ జేరెనని తెలియవచ్చెను. లేఖనసామగ్రుల నందుకొని క్షణమాలోచించి సరళ కొక ప్రతివ్రాసి తన మనంబున నున్నదంతయు నందు వెళ్ళఁబోసికొనియెను. మాపాఠకమహాశయులలోఁ దరుణు లారసికాగ్రణి వ్రాసినలేఖయందలివిషయము లెఱుంగఁ గుతూహలపడుదురేమో! కాని, యనురాగము పెంపునను, దుర్భరవియోగ మోర్వరానికతంబునను పిచ్చిపిచ్చిగ నతఁడు వ్రాసిన వ్రాఁతలన్నియు వెలికిఁజూపవ గురాక మానితిమి. చదువరులు మమ్ము మన్నింతురుగాక!

మరల పాఠశాలలు తెరువంబడియెను. అనంతనాథుఁడుగూడ వియోగమును గొంతవఱకు మఱచి, మనసు కుదిరించుకొని, తన సహపాఠులతోడ వ్యాసంగముఁ జేయ మొదలిడెను. నాఁడు తా నొనరించిన శపథముగూడ స్ఫురణకువచ్చెను. ఈసంవత్సరమునైన పట్టపరీక్షలోఁ గృతార్థుఁడు గాని యెడల నిఁక తనజన్మము నిరర్థకమని యించుక రోషముఁగూడ నుదయించినది. రానురాను చాలశ్రద్ధతో వ్యాసంగముఁ జేయసాఁగెను. పట్టబిరుదమును స్వీకరించినచో సరళ తన్నింకను విశేషముగ ప్రేమించి గౌరవించును గదా యను నాశయే యతనిని వెన్ను దట్టుచుండెను. మునుపటివలెఁ గాక యపు డపుడు హృదయప్రియునుండి కుశలపత్రికలు వచ్చుచుండుటచే నతనికి మనోదార్ఢ్యమును హర్షమును ఉత్సాహశక్తియు దరగకుండెను. ఆకారణమునఁ గాలము నించుకంతయేని వ్యర్థపుచ్చక నిండు పట్టుదలతోఁ దన పూనిక నతఁడు నెఱపుచుండెను.

మరల మూఁడుమాసములు గడచినవి. భాద్రపదమాసము

నడచుచుండెను. ఒకనాఁటి యుదయమున సరళకడనుండి యీక్రింది జాబు వచ్చెను.

,, మనోహరా ! { బెంగుళూరు. 25 సెప్టెంబరు.

రమారమి యిరువదిదినములనుండి యెదురుచూచుచున్నాను. మీకడనుండి వచ్చిన కుశలపత్రముఁ జూచుభాగ్యము మీప్రేయసికి లభింపదయ్యెను. కారణ మేమియో యెంత యోచించినను నెఱుంగ రాకున్నది. నిరంతరమును వ్యాసంగమునకుఁ జిక్కియుండుటే సాకుగ నుండనోపునని తలంచితిఁగాని, యిది చాల నిర్దయ. మీయవధియెప్పు డెపుడు తీరఁగలదోయని దినముల లెక్కించు చున్నదాన. కాని యాపుణ్యదిన మింక నెంతదూరమున నున్నదో తలఁచినఁ జాల వేదని యగుచున్నది. అయినను మిక్కిలిగ వ్రాయఁ జాల.

ఒకసంతోషవార్త! చాలకాలమునుండి నామనంబున రెండు కోరికలుండెను. అవి నాకెన్నఁడు చేకూరునో యని నిరంతరము దైవమును బ్రార్థించుచుందును. నిన్నరాత్రి యవి రెండును సఫలము లైనట్లు కలగంటిని. నిజముగ సఫలములే యాగును ధైర్యముగూడ నాకుఁ గలదు. ఆమనోరథములలో నొక్కటి తమ పట్టపరీక్ష. రెండవది——ఇపుడు నేవ్రాయఁజాలను. దైవకృపయున్నచో నిటువచ్చి నపుడు మీరేచూచి యానందింపఁగలరు!

ప్రాణాధికా! కాలమెంత త్వరితముగఁ బరుగిడుచున్నది. కంటి రా! నేను జెన్నపురి వదలి యపుడే యించుమించు నాల్గుమాసములు గావచ్చినవి గదా!

ఇట్లు
మీయర్ధాంగి,
,,సరళ''

లేఖ ననంతనాథుఁడు రెండుమూఁడుమారులు పఠించెను కాని యందలి గూఢార్థము గోచరింపలేదు. సరళ రెండవకోరిక యేమి? అదియేల వ్రాయదయ్యె? మనోహరునకుఁ గూడఁ దెలుపరానట్టిదేది? ఇంతకును సంతోషవార్త యనిగదా వ్రాసినది!

మరల నాలేఖ నాతరుణుఁ డామూలాగ్రముగ పఠించెను. నిజము. సరళ వెడలబోయి నాల్గుమాసములు గావచ్చినవి. కాని రహస్యము మాత్రమేమి? బెంగుళూరికిఁ బోయినపు డనంతనాథుఁడు చూడఁగలఁడఁట! సంతసింపఁగలఁడఁట! అట్టి దేమైయుండును? అనంతనాథున కిపుడొక్క యాలోచన మనసునఁ బొడమెను. కొంతవడికల్లే యాలోచించి యేమి తలఁచెనో కాని యాతని మోమునఁ దటాలున మందహాస మంకురించెను. మరల నాయుత్తరము చదివెను. తలయూఁచెను. "నిజము. అట్లేయుండవలయును." అనుకొని సరళ యెంతచమత్కారిణియని మెచ్చుకొనెను.

ఆతరుణమున ననంతనాథుని హృదయాంతరాళమునఁ బ్రభవించిన యానందరసమునకు మేరయే లేదు. ఱెక్కలున్నయెడల నపుడే పోయి తనమనోహారిణిని దర్శించి వచ్చియుండును. రెండుదినములు సెలవుదీసుకొని పోయిరావచ్చునుగదా! కాని యింతలో నాపాపిశపథము మరల మనసునకు వచ్చెను. ఉద్దేశము భగ్నమయ్యెను. తానేల శపథము నొనరించెనో యని యతఁడెంతయు నొచ్చుకొనెను. లేఖన సామగ్రుల నందుకొని ప్రతియొకటి వ్రాసి టపాలులోవైచి వచ్చి యీయరణ్యవాసమెపుడు తీఱునోయని చింతించుచుఁ గాలము గడపుచుండెను.

# ప్రణయసరణి

—♦—

## పదుమూడవ ప్రకరణము.

—:[o]:—

### గోరుచుట్టుపై రోకటిపోటు.

"జాతేతి కన్యా మహతీ హి చిన్తా
కస్మై ప్రదేయేతి మహాన్ వితర్కః
దత్తా సుఖం యాస్యతి వా న వేతి
కన్యాపితృత్వం ఖలు నామ కష్టమ్."

[ప్రాచీన సుభాషితము.]

జనులస్వభావము చాలఁ జిత్రమైనది. ఆనంద మన్న నందఱు నాకు నీ కని వచ్చువారేగాని సంకట మన్న నొక్కరును జెంతరారు. ఇతరుల నననేల? సరళానంతనాథుల యానందరసతరంగమున నీఁదులాడుచు, పాప మాహతభాగిని కమల గతియేమయ్యెనో మనమే విచారింపఁ బూనమైతిమి. జడమైన మాలేఖినికిఁ గూడ శృంగారరసపు పిచ్చి వీడినదిగాదు. ఇపుడైన నట్లు గొంత తిలకింతము.

కన్నకూతురుగతికి చాలవగచి మాధవశాస్త్రి కర్తవ్యము నూహించుటకై బల్లారిపురమునకుఁ బోయెను. తనవియ్యంకుఁడగు శ్రీనివాసశాస్త్రి యీవిషయమును గూర్చి చాల నిర్దాక్షిణ్యముగ నిందించెను. కాని యతఁడు మాత్ర మేమి చెప్పఁగలఁడు? ఈవివాహ విషయమంతయు నొకగొప్ప తంత్రముగదా! వివాహానంతరము కుమారుని నుండి జాబువచ్చువఱకు నాతల్లిదండ్రుల కీసమాచారమే తెలియదు. ఇంతేకాక తరువాతనైన ననంతనాథుఁడెన్నఁడైన బల్లారిపురమున కరిగియుండెనా? అతఁడాపాపమునకే పోలేదు! ఇట్లుండ మాధవశాస్త్రి నిందన కతఁడేమి ప్రత్యుత్తర మీయఁగలఁడు? తనకుఁ బుత్రుఁడు

గావించిన యమర్యాదకై యతఁడు వానిని చాల నిందించెను; ఇఁక జన్మమున వానిమొగమునే చూడనని పంతములు పలుక నారంభించెను; గాని మాధవశాస్త్రి కివియన్నియు నేమిప్రయోజనమునిచ్చును? తండ్రి కొడుకుమొగముఁ జూచిన నేమి? చూడకున్న నేమి? తనబిడ్డ చెడెనను టొక్కటే యతనికిఁ జింత! అయినను బల్లారికి వచ్చుటచే నతఁడొక విషయము గ్రహింపఁగలిగెను. అనంతనాథుఁడు వివాహానంతరమున తన తలిదండ్రులకు వ్రాసిన లేఖలోఁ దనద్వితీయభార్యనామాది విషయములఁ దెలియఁ జేసియుండెను. వానిఁ దెలిసికొని మరల నతఁడు బెంగుళూరును జేరెను.

కొన్నిదినములు కర్తవ్యము నూహించి తరువాత తనయల్లునిం జూచి వానితో నీవిషయమై చర్చింపవలయు నని యతఁడు తలఁచెను. గాని యంతలో స్వాభిమానము విఘ్నకారియయ్యెను. ఇతరులతోనైన నతనికిఁ జెప్పింపఁ దలఁచెనుగాని యాయుపాయము కుదురలేదు పలువిధముల నాలోచించి, పలువురమిత్రులనడిగి, తుదకొక్కతోవ నిర్ధరించెను. తానుగూడ నాఁడుబిడ్డను గన్నవాఁడగుటచేఁ గరుణించి కమలనుగూడ నాదరింపుమని తనయల్లుని కుపదేశమిచ్చుటకై స్వామినాథసేనుని వంటి మహనీయుఁడు వెనుదీయఁడని తలంచెను. అటుమీఁద నెన్నియో మారు లతని సౌధమువద్దఁ గాచికాచి యుండి సమయము నరసి యతని నీక్షించి యుచిత రీతిగ తన గోడెల్ల నతనితో వివరించి కమలను గూడ సరళాదేవికిఁ దోఁబుట్టువుగ నెంచి రక్షించి పుణ్యముఁ గట్టుకొమ్మని చాల దీనుఁడై వేఁడుకొనెను. శిలనైనఁ గరఁగింపఁజాలు నతని కథనువిని స్వామినాథసేనుఁడును జాల పరితాప పడియెను. తన యల్లుఁ డిట్టివాఁడని యతనికి మాత్ర మెట్లు తెలియును? మొదలే తెలిసియుండిన నీవివాహమున కంగీకార మతఁడిచ్చియుండఁడు గాఁబోలు! తుదకు, ఎట్లును కార్యము మించినదనియు, హృదయమున ననురాగ

ము లేనివారి కుపదేశమిచ్చినను ఫలము గలుగదనియు, నిష్కారణముగ నేకర్మమును గానని యీబాలిక నాజన్మాంతము దుఃఖముల పాలు చేయుటకంటె కాలయాపనముఁ జేయక యనాథాలయమునకైనఁ బంపి వేఱువివాహము చేయుట యుక్తమనియు, వలయునన్న నావిష యమునఁ దాను తగినంత సాయము చేయఁగల ననియు నుపదేశమీయ సాఁగెను.

మాధవశాస్త్రిహృదయమున దవాగ్ని పొగ రేగినది. తటాలునఁ బ్రజ్వరిల్లెను! కాని యీ పేదకోపము నెవరిపైఁ జూపవలయును? అతని యరణ్యరోదనము నాలకించు వారెవరు? యత్నముసాఁగక "ఔరఁ, నూకమల యదృష్టమింతటిది!" యనుకొని మనసు రాయిచేసుకొని యిల్లు సేరెను.

అయ్యో! ఈపాపియిరువదవ శతాబ్దమున నాఁడుబిడ్డలఁ గన్న వారి కష్టములు దుఃఖములు నెన్నియని వివరింప శక్యము? చిన్ననాఁటి నుండి పలుబాధల కోర్చి పెంచి పెద్దలఁ జేయు మాటయటుండ, వారి కిఁ దగిన కాలమున యోగ్యవరుల వెదకి సమకూర్చుటయే కడుపరి యాసము! శ్రమలెన్నియైన నోర్చి యెందరిచేతనో తిట్టువడి, కన్నకన్న వారినెల్ల నాశ్రయించి వరునొకని నేర్పరచినను వానికి వరదక్షిణలిచ్చి తృప్తిఁ బొందించుట శశవిషాణప్రాయము. ఏది యెట్లువోయినను నాయంశమున గోరంత కొరంత జరిగినను పడినపాట్లెల్ల వ్యర్థము. ఇల్లు తాకట్టు నడవుంచియైనఁ గోరినంత శుల్కము సమకూర్చి తీరవల యునుగాని వేఱువిధి లేదుగదా! ముందు వెనుకలాలోచించుచు నించుక కాలము గడపినచోఁ గన్యకలకు వయసు మీఱును. పదేండ్లు పిల్లకు దాఁటెనఁ బరలోకము పాడయిపోవును! సమాజమున నవమానము. కులమో నకులము గావలసి వచ్చును. మఠాధిపతులు "హా" మ్మని ధ్వజమెత్తుదురు! స్వామినాథ సేనుని వంటి నిర్భయజీవన మందఱకును

సాధ్యముగాదు! ఇవన్నియుఁ గడచి యెట్లో వివాహ మొనరించిన మాత్రాన "ఇప్పటికి ధన్యుఁడ" ననుటకున్నదా? నవనవాభిమానులగు నవనాగరక తరుణులకును కన్యకలకును దాంపత్యము స్థిరమై పొసఁగుట యరిది. ఆ యననుకూల్యముఁ జూచి సైచియుండఁ దరమా! పాపము! ఆకన్యల గతియేమి? ఎవరికి మొరలిడవలయును? అక్కటా! భారతమాతా! నీవైన నీసుతలపైఁ గరుణించి యీనవనాగరకమూఢులకును ప్రాచీన బాలకులకును దగినబుద్ధిఁ జెప్పఁ బూనవుగదా!—మఱచితిమి! అసలు నీపయి వారికి విశ్వాసముండినఁగదా! వారికట్టి మాతృభక్తి యున్నచో నీవేల నీసరివారి కన్నులలో నింత చులుకనగు చుంటివి! ! ఆపరమ పూరుషునకైన నీపయిఁ గరుణయెన్నఁడైనఁ గలుగునో!

ఈయరణ్యరోదనమేమి ఫలకారి! ముందు చూతము.

ఒకనాఁడు సాయంకాలమున మాధవశాస్త్రిగృహములోని బయటి గదిలో తలు పోరమూసి యుండఁగా, లోపలఁ గమల యొక చిఱుచాపపైఁ గూర్చుండి తలవంచి చేతనున్న పుస్తకమును తదేకనిష్ఠతోఁ జదువుచుండెను. పైటచెరఁగుసందులనుండి యొకించుక తోఁచుచున్న సౌవర్ణ మంగళసూత్ర మొకండు దక్క వేఱేమియు భూషణము లాజవ్వనిమేనిపైఁ గానరావు. తెల్లని వలిప మొకటి, ధరించి యుండెను. ఏయలంకారములేల? సద్యోవికసితమగు సంపఁగి పూవు సొబగును గ్రిందుసేయఁ జాలి, నవయౌవన విలాసభాసురములైన సుందర కోమలాంగములే యాతరుణి కలంకారములు. సుస్నిగ్ధమై శాంతమై యనన్యధీతకైతవ గంభమైన యాతన్వి ముద్దుమో మొకటి యన్ని సొమ్ములకును మాఱుసొమ్మనిన నతిశయోక్తి గా నేరదు. చూచిన మాత్రమున నెమ్మోమున స్ఫుటముగఁ బ్రతిఫలించెడు నిర్మలమై ప్రశాంతమయిన ముగ్ధత్వమే స్త్రీరత్నములకన్నిటినిమించిన

సౌందర్య మని భావించువారికి మాకమల కన్న వేఱొకయుదాహ రణ మావిషయమున దొరకుట కష్టము కాని, యాప్రశాంత సౌంద ర్యమునకుఁ దగినయానందము, ఆయానందమునకుఁ దగినప్రఫుల్లతయు దానితోడునీడలై యభినవతారుణ్యాపరమఫలమై, క్షణమున కొక తూరి యకారణముగ నధరబింబమును దాఁటియు దాఁటక వెలువడు దరహాసచంద్రికలును, నేఁడామొగ్ధముఖబింబమునందుఁ దోఁచు చుండ లేదు. కారణము మాచదువరులకు వేఱయుపన్యసింపవలయునా?

అయ్యో! పాపము! అదృష్ట మెవనియధీనము! ఎట్టి పాల వయసున నామె కెట్టిచింత!

కమల యిపుడు "ప్రఫుల్లముఖి" * యను సాధ్వీమణిచరిత్ర మును చదువుచుండెను. ఈవల నామెకు పలుమారీపుస్తకమును చదు వుట వాడుక. ప్రఫుల్లముఖి జీవితముతోఁ దన జీవితము సరిపోలునని యామె తలంచుచుండెడిది కాని యిపుడట్లుగాదని యామె నిర్ణయిం చెను. నిజము. అందలివ్రజేశ్వరునకును, అనంతనాధునకును జాల తారతమ్యముగలదు. 'సాగరకును' సరళకును చాలభేదమున్నది. ఇఁక కమలాప్రఫుల్లముఖులలోఁ ప్రఫుల్లముఖియే ధన్య. ఒకనాఁడయినమనో హరుని మన్ననఁ బడిసియుండెఁగదా ప్రఫుల్ల! కమలకాభాగ్య మెందు గలదు? ఎట్లయినను తుదకు వ్రజేశ్వరునను గ్రహమునకు ప్రఫుల్లపాత్ర మయ్యె. ఈకమలకాయాశ లెక్కడనుండి వచ్చు? కడకు దాసిగానుండు మన్నను కమల మనఃపూర్వకముగ నంగీకరింపఁగోరియుండునో యే మో! కాని యెవరి యత్నము!

* ఈగ్రంథము తొలుత 'దేవీచౌధురాణి' యనుపేర వంగకవి సార్వభౌముఁడగు బంకించంద్రునిచే రచింపఁబడినది. పదపడి శ్రీ క॥ భాస్కరరావుగారు పై పేర దాని నాంధ్రమునకు మార్చిరి. ఈగ్రంథకర్త చే నదేపేరఁ జిన్నపద్యకావ్యమొకటి రచింపఁబడి మానససేవపత్రికలోఁ బ్రకటితమైయున్నది.

బయటి గృహాంగణములో నెవరో మాటలాడుచుండిరి; కాని కమల యామాటల నంతగా గమనించుచుండుటలేదు. తటాలున నొక నూతనధ్వని.

“ అనంతనాథుని సమాచారమేమైనఁ దెలియునా? ” యని ప్రశ్నించుట యామెచెవులంబడియెను. కమల తటాలున లేచినది. కిటికీలోఁ జూడఁగా తన తండ్రితో నతనిబంధువగు నొక నడివయసు వాఁడు సంభాషించుచుండెను. ఇతఁడు తంత్రీవార్తాప్రేషణాలయములో నొకయుద్యోగి. పేరు చంద్రశేఖరుఁడు.

వాని సంభాషణము వినవలయునను కుతూహలము కమలకు జనించెను. ఆహా! ఆనామాక్షరములపై నాబాల కెంతప్రేమయో!

“ అతని సమాచారము నాకేమి తెలియును ? ఇంతకు నేమి సంబంధము ?

“ కాదు. తెలియునా యని యడిగితిని”

“ లేదు. ఏమి విశేషము ? ”

“ అనంతనాథునినుండి నేఁడొక తంత్రీవార్త వచ్చినది. ”

“ వాని మోహంపురాణికిఁ గాఁబోలు ! ”

“ అవును ’

“ ఏమని వచ్చినది ? ’

“ అనారోగ్యము. తోడనేరమ్ము అని ’

కమల హృదయ మదర నారంభించెను. కన్నులును మొగమును వివర్ణమయ్యెను, కాళ్లుగడగడ వడఁక సాఁగెను. చేతనున్న పుస్తకము తనంతఁ గ్రిందజారెను.

“ అనారోగ్యమా ? ఏల ? వివరము లేదా ? ”

“ కలరా తగిలినదఁట. ప్రాణసందేహమఁట. తత్క్షణము వచ్చి చూడుమని వార్త నంపినాఁడు,

తరువాత నతఁడే ముచ్చరించెనో కమల వినలేదు. ఆమెజ్ఞానమున నపూర్వముగ నంధకార మావరించెను. కన్నులు మూతఁబడియెను. వేఁడి నిట్టూర్పొకటి మోమునుండి వెలువడియెను. ఉత్తరక్షణమున నామె నిశ్చేష్టితయై మూర్ఛిల్లి నేలవ్రాలెను!

---

## పదునాల్గవ ప్రకరణము.

---

### “ కాళరాత్రి ”

“ ...... ....... ... ... ...
కి మేదమాపడిదమ్,
హిమవది దివ్వోసహిఅ
సీసే సహోసమావిట్ఠో ”

(ముద్రారాక్షసము. అం. ౧)

రాత్రి యెనిమిదిగడియలగుచుండెను. అంధకారము నిండి దిశలెల్ల వ్యాపించియున్నది. చెన్నపురిలో ననంతనాథుని గృహమున మునుపటి వినోదమింతయుఁ గానరాదు. మైనపువత్తిదీపము వెలుఁగుచుండెను. మంచముపై రోగగ్రస్తుఁడైన యనంతనాథుఁడు శయనించియుండెను. తలకడ నొక్కయువతి కూర్చుండి విషాదభిన్నమైన చెక్కిలినొకచేత వాల్చి వేరొక్కకరమున నొక వీవనఁబూని మౌనమున నారోగికి విసరుచుండెను. నడుమ నడుమ నాయువతిమోమునుండి వెలువడు దీర్ఘనిశ్శ్వాసములుదప్ప వేఱొక శబ్దమందు వినరాదు. భయంకరముగ నుండెను.

ఆహా! యేమిదైవమాయ! ఇఁక రానున్నక్షణమున మనకేమి వాటిల్లనున్నదో మనమంతయు నెఱుఁగఁజాలముగదా! ఆబ్రహ్మాక

ల్పము మనియుండువారివలె మూఢులమై మనము, ఈసుఖము, ఈ యానందము, ఈప్రపంచము స్థిరమని నమ్మి యాశావిష్టులై గొంతెమ్మ కోరికలఁ గోరుచుందుముగాని, నిక్కమని పలుమాఱు నెఱింగియు నజ్ఞానము మానలేమే! ఏక్షణమున నేవిపత్తు పొసఁగునో, యేనిమిషమున నే కలరాతల్లి, యేప్లేగుదేవి, మనల నొక్కగుక్కన నోరవేసికొని నమలకయే మ్రింగి జీర్ణించుకొనునో, యే యాకస్మికత మన జీవకళిక నార్పివేయునో, యే మహాత్మ్యఁడెఱుఁగును?

అక్కటా! చదువరులారా! కంటిరా! అనంతనాథుఁడు తలఁచినదేమి? అతనికి వచ్చినదేమి? ఇంతటి మహానగరమున నెందఱో కాటికిఁ గాళ్ళుచాఁచుకొని 'చచ్చినఁ జాలు' ననిపించు నిరర్థక జీవితులుండ, నీమారికావ్యాధి, ఇంతయాకస్మికముగ, తనకే దాఁపురమగునని యతఁడు కలనైనఁ దలఁచియుండెనా? కాళరాత్రిఁబోలు నీవ్యాధికిఁ జిక్కి మృత్యువువాత దుమ్ముగొట్టి రాఁగలనను ధైర్యమేవూరునకుండఁగలదు? పట్టపరీక్షలోఁ గడతేరి బిరుదమునందవలయు! పట్టిన పట్టుగెలిచి మరల బెంగుళూరుచేరి సరళకౌఁగిట నిద్రించవలయు! మానవజన్మ సాఫల్యమునందవలయు!! అయ్యో! ఇంకెక్కడికోరికలు మారికిఁ జిక్కినపిదపఁగూడ!!

అనంతనాథునకు కలరా సోఁకినతరువాత నిది రెండవ రాత్రి. ఆమునుపటి సౌందర్యమును విలాసమును హాయియుఁబెను నేఁడెందుఁ బోయినవో యెఱుఁగరాదు. ముఖమునఁ గళ సంపూర్ణముగ మాసియుండెను. దేహమెల్లఁ జాలఁగృశించినది. వెడఁదలైన యతనికన్నులు గుంటలుపడి యుండెను. జ్వరము మిక్కుటముగఁబొంగి నూటునయిదు మెట్లు సమీపించి యుండెను. కన్నులు మూఁతలు వడినవి. అంగములు చలించుటలేదు. నాసికారంధ్రముల నుష్ణనిశ్శ్వాసవాతములు వెలువడు చుండెను. ఈప్రపంచముపై జ్ఞానమే శూన్యమయి పోయినది.

నిశ్శబ్దము. ప్రక్కబల్లపై నొక్క గడియారము మాత్రము "టక్కుటక్కు" మనుచుండెను. గడియ కొకతూరి యేమిద్దెలోనో, యేగోడపైననో బల్లి యొకటి యిష్టానుసారముగఁ బలుకుచుండెను. అపు డపుడు మశకము లొకటి రెండు, రోగి దేహమ్మునందలి రక్తమును గడుపారపారణచేసి 'గిమ్మ' నుచు లేచి పరువిడుచుండెను. ఒక్కొక్క సారి రోగియు తాపమును సైఁపఁజాలక కాఁబోలు, నతి భయావహముగ మూల్గుచు తలనట్టిటు త్రిప్పుచుండెడివాఁడు. అతని తలకడఁ గూర్చున్న సుందరియు నపుడపుడు కన్నుగపఁ జెరఁగునఁదుడిచికొనుచు "ఉస్సు" రని దీర్ఘముగ నూర్చుచుండెను. గడియకొకతూరి యామె లేచి బయట కరిగి తొంగిచూచి వచ్చి మరల గడియారము వంకఁ జూచుచు తన పనిలో జాగరూకయై యుండెను.

ఇంతలో పదిగంటలు గొట్టెను. బయటనుండి యెవరో తొంగి చూచి "అమ్మాయీ! యెట్లున్నది?" అని యడిగిరి.

ఆయువతియు రోగిని మరలఁ జూచి మెల్లన

"యథాస్థితి" యనియెను.

"అతఁడు రాలేదా?"

"వచ్చుచున్నట్లున్నది."

అనుచుండు నంతలో వాకిట ద్విచక్రశకట మొకటి వచ్చి నిలుచుట వారు వినిరి. తోడనే దీర్ఘకాయుఁడైన యొక తరుణుఁ డుద్యోగపదవిని సూచించు నుడుపుల ధరించి చేత రెండు సీసాలను బట్టుకొని గదిలోఁ బ్రవేశించెను.

"జ్వరము తగ్గినదా?" అతఁ డాతరుణి నడిగెను.

"ఇంకను లేదు" అని లేచి యాయమ మెల్లనఁ బల్కెను.

చేతనున్న కాచపాత్రము నందలిబల్లపై నునిచి యానూతన పురుషుఁడు తన యంగరకాలోనున్న జ్వరమాపకయంత్రమును దీసి

రోగి బాహుమూలమున క్షణమాత్ర మునిచి చూచెను. అటుమీఁద నొక్కింత తడ వారోగిముఖమువంకఁ దదేకదృష్టితో వీక్షించి, యతని మణికట్టున నాడిని పరీక్షించి హస్తము నట్లే విడిచి యీవలకు వచ్చెను. ఈపరీక్షాసమయమునం దంతయు నాతని ముఖభావమును బాగుగ గమనించుచుండిన యాయువతి కిపుడు హృదయమున నొక గొప్ప శూలము ప్రవేశించిన ట్లయ్యెను. గుండియ లతివేగమునఁ గొట్టుకొన సాఁగెను.

„అయ్యో! ఏమట్లు చూచి చేయివిడిచితిరి ? అని పల్క ప్రత్యుత్తర మెట్టిదివచ్చునోయని యత్యాతురయై యతని మొగమువంక జూడసాగెను.

ఆపురుషుఁడును ఇంచుక యెడముగ వచ్చి,

„భయములేదు. జ్వరము తగ్గుచు వచ్చినది. ఇఁకఁ గొంత ప్రొద్దుకు దేహము చల్లఁబడును. ఈ రెండు ద్రావణములు నిండే యుంచెదను. గంట కొకతూరి” అని యొకసీసాచూపి, „దీని నిచ్చుచునుండ వలయును. ఒకవేళ దేహమున సహజోష్ణముగూడ తగ్గుచు వచ్చెనా యీ రెండవది గంట కొకతూరి యిచ్చిన మే లగును. ఈరాత్రి గడచినచో రోగికి భయ ముండదు. మరల నే నుదయమునకు వచ్చెదను. కాని యీరాత్రి మీరు మాత్రము చాల జాగ్రత్తతో నుండ వలయును.”

అని యామందులనిచ్చి తనకై తట్టలోనుంచియుండిన యయిదు రూప్యములను తనంతన స్వీకరించి చొక్కాలోఁ జేర్చి యావైద్యుఁడు వెడలి తన బండినెక్కి క్షణములో నదృశ్యుఁ డయ్యెను.

అతఁ డందేయుండి యుండునుగాని, యారాత్రి నింక నెన్ని గృహములలో తన ఋణమును దీర్చుకొనవలసి యుండెనో !

మరల నిశ్శబ్దము. క్షణక్షణమునకు హృదయతాపమునఁ బొరలాడుచుండిన యారోగి ప్రక్క నాయువతి యొక్కతయే! గది వెలు

పల శాలలో నొక్క పురుషుఁడు శయనించి ముసుకు వెట్టి తడవ కొక తూరి "అమ్మాయీ!" యని పల్కరించుచు నందుకు బదులుగ నాయువతి మెల్లిన మూల్గఁగా మరల ముసుకు వేసికొనుచుండెను. గడియగడియకు నాయువ యనంతనాథుని చెక్కిలిపైఁ దనమృదుకరము నుంచి చూచుచు గంటకొకమారు వైద్యుఁ డుపదేశించిన చొప్పున నాద్రావణము నొక్క కాచపాత్రలోఁ బోసి యారోగి ముఖమున నతి ప్రయాసతోఁ బోయుచుండెను సారెసారెకు నగ్గలమగుచున్న హృదయతాపమున నారోగి "హా" యనుచు వికారముగఁ గన్నులు దెఱచి యూర్ధ్వముగఁ జూచుచు మరలఁ గన్నులు మూసికొనుచుండెను. తేప తేపకు నాప్రక్కనున్న గడియారము "మానవుల యాయువుల నేనింత లింతలుగ మ్రింగుచున్నా" ననిస్పష్టముగఁ జాటురీతి "గణ గణ" యని మ్రోఁగుచుండెను.

అర్ధరాత్రము మాత్రము మీఱినది. ద్రావణము మరల నొక తూరి యిచ్చి యాయువతి రోగి దేహమును స్పృశించి పరీక్షించెను. జ్వరము చాలవఱకు తగ్గుచు వచ్చియుండెను. ఆ యువతి హృదయమున మరల నాశయంకురింప సాఁగెను. తదేకాయత్తయై యుండుకతంబున పొరబాటు కలిగియుండవచ్చునా యని యించుక సందేహించి మరల పట్టిచూచెను. కాని భ్రమకాదు! నిజముగ శరీరమున జ్వరము తగ్గియుండెను. అంగములు శీతలములగుచు వచ్చుచుండెను. కృతజ్ఞత దోఁప మనసున నొక్కసారి యాసర్వరక్షకుని స్మరించి యాతరుణి యాతనికృపనుఁ జాలఁగొనియాడెను.

బయట శయనించియున్న యాతఁడు

"అమ్మాయీ!" అనియెను.

"జ్వరము తగ్గినది."

,, తగ్గినదా ? అయినఁ జాలసేపైనది. నీవు పండుకొనుము. నేనుండెదను ''

వలదు. నేనే యుండెదను. నాకు నిద్రరాదు. ''

మరల నామె యౌషధము నొకసారి యొసంగెను. కాని యది దక్కలేదు. రోగికి శ్వాసము బలముగనుండెను. మరల నాతరుణి శరీరమును స్పృశించిచూడఁగా చలువలు మూసివచ్చుచుండెను. నాళనాళములను భయము ప్రవహించెను. వైద్యుఁడు చెప్పిన పల్కు స్మరించి రెండవ మందును రోగినోట నతిశ్రమతో నొకగ్రుక్కెడు విడిచెను.

మూఁడు గంటలగుచుండెను. రోగి యథాస్థితిలో మార్పులేదు. హృదయము దక్క తక్కినయంగములెల్ల హిమప్రాయతను బొందినవి. అక్కటా! తెల్లవారువఱకును జీవకళిక యుండఁగలదను నమ్మకమెవ్వరికిఁ గలదు ? క్షణక్షణమునకు నౌషధము నిచ్చుచునే వచ్చెను. నిమిషములు యుగప్రాయములుగఁ దోఁచెను. ఎన్నిమార్లు కిటికీలో తొంగితొంగి చూచినను దెల్లవారలేదు! నాఁటినిశి యెంతదీర్ఘముగ నుండెనో యాతరుణి కెరుకగాని మనమెట్లెఱుంగఁ గలము ?

కట్టా ! అనంతనాథుఁ డెంతనిర్భాగ్యుఁడు ? ఏమో శాశ్వతముగ జీవించువానివలె నెన్నెన్నియో పాట్లుపడెనుగదా! పట్టపరీక్షలోఁ గడతేరవలయునన్న యతనికుతూహలము నేఁడేమైనది ? గదిలో పుస్తకములన్నియుఁ జిందరవందరగా మూలఁబడి పొరలుచునతనికై దుఃఖించుచున్నట్లు కాంతివిహీనములైనవి ! ఈయల్పజీవితునకా యీనిరుపమానమయిన యంగసౌందర్యము ! ఈమూఁడునాళ్ళముచ్చటకా యేకర్మము నెఱుఁగని కమలను అనాగరకయని పరిత్యజించినది ! ! సరళను బరిణయమాడినది ! ! పాపము ! సరళమాత్రమేమి సుఖించెను ? ఏమన్న నేమిఫలము ! వారివారి యదృష్టఫలమెవరు తప్పింపఁ జాలుదురు ?

ఆయువతి కన్నులనీరుగార శవప్రాయముగఁబడియున్న యాతనిని జూచిచూచి లోలోన నెంతయో దుఃఖించెను. కాని మరల ధైర్యమావశ్యకమనితలఁచి కాఁబోలు కన్నులఁదుడిచికొని లేచి మరల మందు నిచ్చెను. హృదయమునం దింకను ఉష్ణము తగ్గలేదు. తెల్లవారినదేమోయని చూడ బయటికి వచ్చెను.

"అమ్మాయీ! ఎట్లున్నదే!" శయనించితివా యని యతఁ డడిగెను.

"చలువలు వచ్చినవి!"

"ఆఁ! చలువలా!!"

తటాలున నతఁడు పైకిలేచెను. ఇరువురును గదిలోఁ బ్రవేశించిరి. ఆపురుషుఁడును రోగిదేహమును ముట్టిచూచి

"సరి!" అనియించుక యెడముగఁబోయి కన్నులనిండ నీరుగ్రమ్మ,

"నిర్భాగ్యుఁడా! ఇంతమాత్రమునకా సరళ సరళయని—"

అనియేమోయనఁబోవుచుండ నాయువతి యడ్డమువచ్చికన్నులనీరుగార గద్గదస్వరమున

"ఇది సమయమా! వలదు వలదు! శయనింపుము!"

అనివారించెను. అతఁడును గది వెడలియుస్సురనుచు నొకమూలఁగూలఁబడియెను. ఆయమ మందును మరలనిచ్చి చెంతఁగూర్చుండెను. గడియారము నాల్గుగంటలఁ జూపుచుండెను. ఇంక రెండుగంటలుగడచునాయనుకొనుచు నాతరుణి మరల రోగి యంగములఁ దాకి చూచెను. కొంచెముష్ణము దోఁచుచుండెను. భ్రమయనుకొని మరల ముట్టిచూచెను, గాని నిజముగా నుష్ణమే. ఆశపొడమెను. తనయిలువేల్పును ధ్యానించుచు మరల నొకమారు మందునొసంగెను. క్రమక్రమముగ నుష్ణము దేహమంతటను వ్యాపింపఁ దొడఁగెను. ఊపిరితిత్తులనుండి వచ్చు వాయువులవలె నెంతయు వేగమున నరుదెంచుచున్న నిశ్వాస

ము లించుక మందగించెను. ఆతరుణీమణిహృదయమున నాశ బలముగ వేళ్లూనెను.

ఎట్టకేలకు రాత్రి ముగియఁ జొచ్చెను. అరుణోదయము గావచ్చెను. గడియారము మైదున్నర గంటలఁ జూపెను. అనంతనాథుఁడు గూడ నొక్కసారి కనులువిచ్చి, తలవంచి తన్నుఁ గాంచుచుండిన యాతరుణినిగాంచి, హీనస్వరమున,

“సరళా!” యనియెను.

“సరళను గాను!”

అనంతనాథుఁడు కనులు మూసికొనినాను. యువతికి మరల భయము జనించెను. కొన్నిక్షణముల కతఁడు మరలఁ గన్నులు విచ్చి,

“సరళ రాలేదా?” యని యడిగెను.

నిముష మూరకుండి యవ్యక్త స్వరమున నామె

“ఇంతలో వచ్చును” అనియెను.

అనంతనాథుఁడు మరల నిమీలితనేత్రుఁ డయ్యెను. మరల మాటాడలేదు.

అంతలోఁ దెల్లవారెను.

—

# ప్రణయసరణి

## పదునైదవ ప్రకరణము.

### ఇందిర.

"కా త్వం శుభే కస్య పరిగ్రహో వా
కిం వా మదభ్యాగమ కారణం తే?"

[రఘువంశము. ౧౬. సర్గ]

అఘటన ఘటనాధురంధరుఁడైన యాసర్వేశ్వరుని మాయ యిట్టిదని యేమహాత్ముఁడు తెలుపఁగలఁడు? ఈప్రపంచమేమో, యీసృష్టియుద్దేశమేమో, యీయాలయమెందుకో తెలిసినమహనీయుఁ డెవఁడు? మానవకోటిని సృజించి, జీవన సామగ్రులం గల్పించి, వారిచే వెఱ్ఱివెఱ్ఱియాటల నాడించి కనులారఁ జూచుచు తుదకు వారి నాధివ్యాధుల కప్పగించి పేరులేకుండఁ జేసిన నతని కేమి యానందమో యేతత్త్వశాస్త్రజ్ఞుఁడు తెలుపఁగలఁడు? నిన్న ప్రాణ సందేహము గలవాఁడు నేఁడు పైకి లేచి పారాడుట యెట్లో? నేఁటి యారోగ్యశాలి రేపు మంటఁగలయుటేమో, యేతత్త్వశాస్త్ర మెఱుఁగఁ జెప్పఁగలదు? వేలకొలఁది మతములు ప్రబలినవి. లక్షల కొలఁదిగ "నేను తత్త్వజ్ఞుఁడను, నేను తత్త్వజ్ఞుఁడ"నని వాదులాడుచుఁ దమ జీవితకాలమంతయుఁ గడపిన మతాచార్యు లెందఱో యవతరించి కీర్తిశేషులైనారు; ఒకటికన్న నొకటి మిన్న యనఁదగి కోట్లకొలఁది మత తత్త్వగ్రంథము లెన్నియో బయలుదేరి పని నిర్వహింపలేక పురుగుల పాలైనవి. అయిన నేమి? యీమతములు, నీమతాచార్యులు నీమత గ్రంథములు నామహేశ్వరుని ప్రభావమున శతసహస్రాంశమునైనను దెలియఁ గలవా?

కథాంశమునకు వత్త్రముగాక. క్షణక్షణమునకు ననంతనాథుని దేహమున రోగ చిహ్నములు తగ్గుచు వచ్చెను. ఆరోగ్యము తలసూప నారంభించెను. ప్రాణభయము లేదని యతని కుపచరించుచున్న యా తరుణి నమ్మెను. ఆమెముఖమునఁగూడ నించుక కళ యతిశయించుచు వచ్చెను. కాని యనంతనాథున కింకను సంపూర్ణారోగ్యము గల్గుటకుఁ జాల కాలము పట్టును.

మరునాఁడు మరల వైద్యుఁడు వచ్చి రోగిని పరీక్షించి తన మందుల ప్రభావముంబొగడి వేఱుమందులనిచ్చి తన బహుమతిని స్వీకరించి వెడలిపోయెను. ఆతరుణి యామందుల నియమప్రకారముగ నతని కిచ్చుచు పరిచర్యలో నేమరక అన్నివేళలలోను రోగిని గాచి యుండెను. క్షణమయిన నాగదిని బాయుట లేదు.

మరునాఁడు రాత్రి యనంతనాథుఁడు మంచముపైఁ బరుండి నిద్రించుచుండెను. ఆతరుణిగూడ ప్రక్కనఁ గూర్చుండి మౌనమున నేమో తలపోయుచుండెను. మాటిమాటికి నామె వేఁడి యూర్పుల నిగిడించుచు బాష్పయుతములగు తన విశాలనయనముల ననంతనాథునివంకఁ దిలకించుచుండెను. ఆమె హృదయమున నత్యంత సంతాప మడఁగి యున్నట్లు వ్యక్తమగుచుండెను. నిజము, మృత్యువువాతఁ బడిన యాతరుణుఁడు మరలి వచ్చునని యెవ రూహించి యుండఁ గలరు? నవమోహనమగు నాసుందరతరుణుని మోము మారి సోఁకి యపూర్వముగఁ గళమాసి యుండుట కనులారఁ గాంచికాంచి యెవరు దుఃఖింపకుందురు? అక్కటా! సరళ వచ్చి యీయవస్థలనెల్ల నాలోకించి యుండినచో నెంత పరితపించుచుండునో! సరళ భాగ్యశాలిని యని యాతరుణి తలఁచెను.

అనంతనాథుఁడు చలించెను. ప్రక్కకుఁ బొరలెను. యువతి యును కన్నుల చెరఁగునఁ దుడిచికొని వీవనతో విసరసాఁగెను. కొంత

పడికి రోగి కన్నుల నల్లన తెరచి యాయువతి మొగముకడ నట్టె వీక్షించి యేమో పలుక నుంకించెను గాని మరలఁ గన్నులు మూసి కొనియెను. క్షణకాల మట్లుండి నయనములు విచ్చి యిట్లనియెను.

„ మాసరళ యింకను రాలేదా ? ”

„ సరళకు బదులుగ నేను వచ్చినాను ”

„ ఏల ? సరళ యేల రాలేదు ? ” అనంతుఁడు నిట్టూర్చెను.

„ తరువాత చెప్పెదను. ఇపుడు నిద్రపొందు. నిద్రకు భంగము గలుగరాదు.”

„ నిద్రింతును గాని, దయ యుంచి చెప్పుము.”

„ సరళ గర్భవతి. ఇదిగాక వారము దినములనుండి జ్వరము వచ్చుచుండెను. మీమామగారుగూడ నేదో రాజకీయ కార్యమునకై కలకత్తాకుఁ బోయినారు. సరళయే విధిలేక నన్నంపినది.”

„ఆఁ! జ్వరము వచ్చుచున్నదా !”

అనంతనాథుఁడు పైకి లేవఁబోయెను. ఆమె వారించి „వలదు. జ్వరము నిలిచినది. భయపడకుఁడు” అనియెను.

రోగి కొంతవఱకు నాయువతివంకఁ దదేకదృష్టితో వీక్షించి యిట్లు పలికెను.

„ క్షమింపుము. నాపయి నింత యపూర్వముగ దయఁజూపుచున్న నాజీవన దాత్రి యెవరో నేనెఱుఁగవచ్చునా ? ”

„ యెఱుఁగరాకేమి ? ఇపుడు నిద్రింపుఁడు. నిద్రకు భంగము గల్గినచో ననారోగ్యము గలుగును. రేపు చెప్పెదను.”

యువతిమోమున నించుక మందహాస మంకురించెను. నిరుత్తరుఁడై యనంతనాథుఁడు క్షణ మూరకుండి కన్నులు మూసికొని నిద్రించెను.

అతఁడు మేలుకాంచునరికిఁ జాల ప్రొద్దెక్కియుండెను. గదిలో

నెవ్వరు నుండలేదు. లేచిచూచెనుగాని యంగములలో శక్తి చాలకుండ లేకుండెను. అల్లుశయనించియుండ నతనికొక చింత జనించెను. సరళ యనారోగ్యమును విన్నవాఁడు గావున నతని హృదయము చాలభారముగ తోఁచెను. తనకారోగ్యభాగ్యమున్నచో తానరిగి సరళను జూడఁగలిగి యుండునుగదా! కాని యిపుడట్లు పోఁగలఁడు? ఇంతకును తనకింకను పూర్తిగ నారోగ్యము గలుగవలయునన్న నెన్నిదినములు పట్టునో! అక్కటా! అదృష్టవశము గాకున్నచో తానుమరలబ్రదుకుటయన్న నెక్కడిమాట! ఇపుడు మఱొక్కవిషయము తలఁపునకు వచ్చెను. పరదేశమునఁ దనకిట్టి సమయమున నుపచరించుచు నపారకృపను జూపుచున్న యీనూతన తరుణి యెవరు? తలిదండ్రులకు దూరమై మనోహారిని బాసి యీనగరమున దిక్కులేనివానిభంగి నీఘోరమృత్యువువాతఁ జిక్కినతన్ను కంటిరెప్పవలెఁ గాచి ప్రాణదాన మొనరించిన యీమెకృపకు నతఁడేమి ప్రతి యొనరింపఁ గలఁడు?

అతఁ డిట్లాలోచించుచుండ నంతలో నాతరుణి యాత్రమున నాగదిలోఁ బ్రవేశించెను

„ఎంత సేపయినది మెలుకోని?"

„ఇపుడే"

„ఆహారము సిద్ధమయినది. మెల్లన లెండ

ఆతరుణి యనంతనాథుని చేయిపట్టి మెల్లనఁ గూర్చుండఁ బెట్టి మృదువైన రవగంజి తెచ్చియిచ్చెను. త్రాగినతరువాత నించుక నేదతేఱి కృతజ్ఞతఁ జూపుదృష్టి నామెవంక నిగిడించి యనంతనాథుఁడు,

„ఇప్పుడైన నీపరిచయ మియ్యరాదా?" యనియెను. క్షీణమయిన స్వరముతో నాతరుణి యిట్లనియె.

„నేనును సరళయు నక్కసెల్లెండ్రము!"

అనంతనాథుఁ డులికిపడి

"ఏమిని సోదరులా?" యనియడిగెను.

"కాదు వరుసలో"

"పే రడుగ వచ్చునా?"

"ఇందిర"

అతఁడుకొంతసే పేమేమో యాలోచించుకొనెను.

"నివాసమెచ్చట?"

"ప్రకృతము బెంగుళూరిలోనే యున్నాను"

"ఎపుడో నేను జూచినట్లున్నది. కాని గుర్తింప లేకున్నాను"

"మీవివాహమునఁ జూచియుందురు"

"ఉందును కాననేగుర్తింప నైతిని. మన్నింపవలయును"

"నాయట్టి దురదృష్టు రాలి నెవరు గుర్తింపఁగలరు?"

అనంతనాథునిపై నాయువతి తనదృష్టినిబరపెను. ఆయమ మనంబున నేమోపరితాప మున్నట్టు లతఁడూహించెను. తనప్రాణ మిత్రమగు లక్ష్మీకాంతుని భార్య పేరిందిర యని యనంతనాథుఁ డెఱుంగును. కాని యామె నతఁ డెన్నఁడును జూచిన జ్ఞప్తి లేదు. సరళ వివాహ కాలమున నేమైన వచ్చి యుండెనేమొ కాని మరల తానున్న కాలములో నామె యెన్నఁడును బెంగుళూరికి రాలేదు. ఇందిర తన చెలియలని యెన్నఁడును చెప్పలేదు గాని, సరళ, తనకుఁ గూర్చిన మిత్ర మని మాత్రము ప్రస్తావ వశమునఁ బలుమారు నుడివి యుండెను.

అయిన నీమె లక్ష్మీకాంతుని భార్యయై యుండునా? ఉండ వలయు! ఇదియే సరియైన యూహా! కాకున్న నితరులకుఁ దనపై నింత శ్రద్ధాభక్తు లేల యుండును?

అనంతనాథుఁడు క్షణమాత్ర మాకాంతముఖమువంక రెప్ప వాల్పక చూచెను. ఆమెను మున్నెప్పుడో చూచినట్లుగూడ స్ఫురిం

చెను. నిజము! సరళవివాహ సమయమునసే చూచి యుండవలయును! ఇంకను రెండేండ్లైనను గాలేదు. ఇంతలోనే తా నామెను సంపూర్ణముగ మరచినందున కతఁడు తన్నెంతో నిందించుకొనియెను.

"అమ్మా! నామరపు క్షమింపుము. నామిత్రుఁ డెందున్నాఁడు? అతఁడు కుశలమా?"

తరుణిమొగమున నేమో యొకభావము స్ఫురించెను. తటాలున మరుగు పరుచుకొని యతని యభిప్రాయమును గ్రహించి,

"ఎందున్నాఁడో నాకుఁ దెలియదు" అని తలవంచి పల్కెను.

తన యూహ నిజ మని యనంతనాథున కిపుడు గోచర మయ్యెను. అతఁడు మరల నేమో సంభాషింపఁబోవునంతలో నాతరుణి వారించి,

"ఇపుడు వలదు. చాల నలసితిరి. ఇంచుక విశ్రమింపుఁడు"

అనుచు లేచి మరుగున కరిగెను.

కొంతతడవు తనలో నేమో తలపోయుచుండి యతఁడు

"మనోవ్యాధి కెన్నియో కారణములు. ఇదే యని నాకెట్లు తెలియును. రే పడిగి చూచెదఁ గాక"

అనుకొని యెట్టకేలకు నిద్రించెను.

---

# ప్రణయసరణి.

## పదియాఱవ ప్రకరణము.

"హతభాగిని"

"......విశుద్ధామపి యత్సమక్షం
..................అహాసీః
ప్రతీస్య కిం తత్సదృశం కులస్య?"

[రఘువంశము. ౧౪ సర్గ]

రెండు రాత్రులు గడచినవి. మూడవనాఁటి రాత్రి ఏడుగంటల

సమయమున ననంతనాథుఁడు మంచముపై శయనించి యుండెను. నాఁటి పగలు నిద్రింప రాదని యతఁ డూరక మేలుకొనియే యుండెను. సాయంకాలమున కతనికిఁ దెలియకయే నిద్రవచ్చినది. కన్నులు విచ్చి చూచుసరికి క్రమప్రకారముగ నాహారమును దీసికొని వచ్చు నిందిర ముఖమండలము దృగ్గోచర మయ్యెను. కాని యామె ముఖ మేటికో కళాహీనముగఁ దోఁచెను. ఆయమవచ్చి మంచము ప్రక్క నొకపీటపైఁ గూర్చుండి తలవంచి యతనివంక సకరుణముగ దృష్టినిబరపుచు మెల్లన,

"నిద్రించి యుంటిరా? మధ్యాహ్న మంతయు మీరు నిదిరింపనేలేదు." అని పలికెను.

"ఔను. నాకుఁ దెలియకయే నిద్ర వచ్చినది."

అని పల్కి లేచి కూర్చుండి యతఁ డాహారము భుజించి చేతులు గడుగు కొనియెను. ఇందిరయు నతనికి సమీపముననే, కూర్చుండెను. అనంతనాథున కపు డాయమముఖమును గాంచి నంతనే యేమో సందేహముపొడమెను. ఆతరుణియు తనముఖభావమును మఱుఁగు పరుప నెంతో ప్రయత్నించెను గాని సాధ్యముగాలేదు. కొంత పొద్దూరకుండి యనంతనాథుఁడు !

"అమ్మా! నిన్ను నేనొకటి యడుగుదునా?" యనియెను.

మొగమున నేమో యతృప్తి దోఁప నాయమ మెల్లన నూర్చి "ఏమి? అడుగుఁడు" అనియెను.

"నీహృదయమున నేమో పరితాప మున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. నిజమా?"

ఇందిర బదు లియ్యలేదు. తల నర వంచెను.

"నాయూహ నిజమైనది" అనుచు ననంతనాథుఁ డించుక ముందుకువచ్చి యనియె "నీచింతకుఁ గారణము నాతోఁ జెప్పఁ గూడదా?"

"మీ రేమియుఁ జింతింపవలదు. నా కేచింతయు లేదు."

అని మెల్లన నిందిర బదు లిచ్చెను. కాని యనంతనాథుఁ డిది నమ్మఁ డయ్యెను. కళాహీనమై వాడువారిన యాతరుణీవదనబింబ మును గాంచిన వాఁ డెవఁడును నామాటను నమ్మఁజాలఁడు.

"నన్నేల మోసగింపఁ బూనెదవు? నీహృదయ తాపమును వదనమే చాటుచున్నది. నాప్రాణదాత్రిమనోవ్యథను కనులారఁ జూచుచు నే నూరకుండఁజాలను. నాశక్తికొలఁది నీమనస్తాపమును వారింపఁ జూచెదను. నేనిపు డశక్తుఁడుగ నున్నను నాకనేకులు మిత్రు లు గలరు. నీమనోగత మితరు లెఱుంగ వచ్చునట్టిదైన కరుణించి నాకు మఱుఁగు పెట్టకుము!"

బాష్పబిందువొకటి యామెకన్నుల నుదయించి కనురెప్పల సందున మాటువడియెను. అనంతుఁడది చూడకపోలేదు.

"నావంటి నిర్భాగ్యురాలి మనోవ్యథ నెవరును వారింప జాలరు. అందుకై మీరాలోచింపవలదు"

అనంతనాథుఁడు చాల ఖిన్నుఁడయ్యెను. క్షణ మూరకుండి యనియె.

"అంతరహస్యమా? అయిన నాజీవనదాత్రియెడ నేను కృత ఘ్నుఁడుగనే యుండవలయునా? ఏలసంశయించెదవు? ఎట్టిరహస్యమై నను నాయెడ గుప్తముగ నుండఁ గలదు."

మీయెడ రహస్యమేమి? నాసరళ మనోహరుని కన్న నాకువే ఱాప్తు లెవ్వరు? కాని నావంటి హతభాగినిచరిత్రము విని మీరు దుఃఖభాగులు గానేల?"

"అటుగాదు. నాయాన! నాసరళయాన!! నీవు చెప్పక దాఁచిన చో తోడఁబుట్టునకుఁ బోలె నిన్నాళ్ళు నాప్రాణమును గాపాడిన దంతయు వ్యర్థమని తలఁచెదను"

ఇందిర యదరి పడియెను. మరలఁ గొంతవడి దీర్ఘముగ నిట్టూర్చి కనుల వెడలు బాష్పములతనికిఁ గానరానీక తలవంచి

“నేనిపుడు చెన్నపురిని వదలవలసియున్నది” అని మెల్లననని యెను.

“వదలవలయునా? ఏల?”

“నేఁడొక జాబు వచ్చినది” మరల నదే హీనస్వరము.

“ఎక్కడనుండి? ఏమని?”

ఆసుందరి యేమోపలుక నుంకించెనుగానినాలుక యాడదయ్యె. రెప్పలతుదనానియున్న బాష్పకణ మొకటి వక్షముపై వ్రాలెను. మరల నదే కంఠాంతర్గతస్వరమున నామె పలికెను.

“అనుజ్ఞ యిచ్చినచో వెడలెదను”

ఇఁక ననంతనాథుఁ డేమనఁగలఁడు? ఆమె మనోగత మెంత రహస్యమో! ఎట్లు వెల్లడింపుమని నిర్బంధింపఁ గలఁడు? అతఁడుమరల,

“అయిన నిన్నెపుడు మరల నేఁజూడఁగలను?” అనిఁయడిగెను.

“నాజీవితకాలమున మరల మిమ్ము దర్శించు భాగ్యమున్నట్లు నాకుఁ దోఁపదు”

“నీమాటలు నాకర్థము కాలేదు”

ఇందిర మరల ననంతనాథుని ముఖమును జూచి దీనతఁదోఁప నిట్లనియె.

“మీకడ దాఁపనేల? ప్రపంచమున నాయట్టి నిర్భాగ్యురాలు వేఱొక్కతె యుండఁబోదు. నాజన్మ మీభూమికి భారము. నాజీవనము సంఘమునఁ బరిహాస్యము. నాజీవనమునకు సంతోష మనునదే నేటికి దూరమైనది. స్త్రీజన్మమున కేది ఫలమో, అసారమగు నీసంసారమున మావంటి గతిలేని యబలల కేదిగతియో యట్టిభాగ్యము నాకు దూరమైనది. వేయేల—”

ఇందిరకంఠమున గద్గదిక జనించెను. కనుల బాష్పములాఁపరా

దయ్యెను. మరల ననంతునిమోమును గాంచి నిట్టూర్చి యామె యిట్లనియె.

„వేయేల? నేఁటిదాఁక నున్న సందేహము నేఁడు స్థిరపడినది. మరియొకవనితమాయలకుఁ జిక్కి నాభర్త నన్ను నిష్కారణముగ త్యజించినాఁడు! నాహృదయమే నేఁడు శూన్యమయినది. ప్రపంచమే పాడుఁగ దోఁచుచున్నది!”

ఆయబల తలవంచి చేలచెరఁగున కన్నీరు దుడిచి కొనియెను. ఇదంతయు వినునప్పటి కనంతనాథుని కన్నులార్ద్రములయ్యెను. తన మిత్రుని వర్తనముఁ దలఁచి యెంతయు నాశ్చర్యము పరితాపమును బొందెను.

„అమ్మా! ప్రాణదాత్రి! నీచరితము చాల దుఃఖకరము. నీవంటి పరమసాధ్విని విడిచి యానిర్భాగ్యుఁడు వేఱేమిసౌఖ్యము నీప్రపంచమునఁ బొందఁగలఁడో నాకు తెలియదు. నీభర్త నాకెంతటి మిత్రుఁడైనను నేనీవిషయమున వానినెంతో నిందింప వలయును. దౌర్భాగ్య వశమున నే యతనికిట్టి బుద్ధి పుట్టినది. చింతింపకుము. నేనే యతనికిఁ జక్కఁగఁ జీవాట్లుపెట్టి మనస్సు త్రిప్పఁ బ్రయత్నించెదను. నామాటను వాఁడు మీరఁడను నమ్మకము గలదు. అతఁడిపుడెం దున్నాఁడు?”

„ఎందున్ననేమి? అట్టిప్రయత్నము నిరర్థకము”.

„అదియేమి? అట్లుతలఁపకుము. లక్ష్మీకాంతుఁడు నామాట మీరఁడు”

„కాదు. మగవారు స్వేచ్ఛాపరాయణులు. ఇట్టివిషయమున పురుషులందఱు నించుమించుగ సమానులే. ఇట్లంటినని కోపింపకుఁడు. మీరుగూడ నిష్కారణముగ భార్యను ద్యజించినవారిలో నొక్కరు గదా! పాప మామెగ్గతియేమి?”

మరలనామె యనంతనాథుని కడ దృష్టి సారించెను. ఆమెకడ పటిమాట లనంతనాథునిశ్రవణ పుటములఁ దూఱి హృదయమును దాఁకిమర్మభేదన మొనరించెను. కానిక్షణమూరకుండి యతఁడనియెను.

„నిజము అయిన నాదునాతప్పులేదు. నాయభిమతము నపేక్షింపక నాతలిదండ్రులు చిన్ననాఁడే మాకు వివాహబంధ మొనరించినందున నట్లుజరుగవలసి వచ్చెను. కాని నేనామెకు ద్వితీయ వివాహమునకనుమతి నిచ్చినాఁడను”

„నాకును నాపతి యిట్టియాజ్ఞ నిచ్చినాఁడు. కాని భారతమహిళలకు జన్మమున పతియొక్కఁడు గాని పలువురు గారు. మనసునకు వచ్చినట్లెల్ల పతులను మార్చుచుండుట యన్యదేశ పద్ధతిగాని యార్య బాలికల యాచారముగాదు”

„పతిప్రేమ యనునెట్టిదో యెఱుఁగని చిన్ననాఁడే నేను నాముండటి భార్యను వదలి మీసరళను పరిణయ మాడితిని. కాని నీయట్టి సాధ్వియగు తరుణివిషయమున నతఁడిన్ని నాళ్ళపై నింతటి క్రూరతఁ జూపుట చాల నన్యాయము!”

„మీహృదయ మామెను బ్రేమించియుండలేదని మాత్రము మీరాలోచించి యుందురు గాని, యాముగ్ధ హృదయ మెట్లులుండెనో మీ రెఱుఁగుదురా?”

అనంతనాథుఁడు నిరుత్తరుఁడై బేలుపోయెను. బదులు మాటయే యతనికి స్ఫురింప దయ్యెను. నిజము. కమలహృదయ మెట్లుండెనో క్షణమైన నతఁడు చింతించి యుండలేదుగదా!

మరల నిందిర యిట్లు పలికెను.

„ క్షమింపవలయును. ఈక్షణమున నాకు జనించిన హృదయ తాపముచేఁ గన్నుగానక మిమ్ము నాక్షేపించితిని గాని, యావైదికుని కూఁతురు మీకుఁ దగిన జోడు గాదని నాకుఁ దెలియును. ఇంతకును

మీయట్టి సరసులఁ జేపట్టఁగలభాగ్యము సరళ నోచియుండఁగా వేరెట్లు జరుగును ? పోనిండు. చాలకాలము నేనిందు నిలువఁజాలను. త్వరగా నేను చెన్నపురి వదలవలసి యున్నది. అనుజ్ఞయిండు. ఐన నాప్రార్థన మొకటి గలదు ”

“ అవశ్యము చేసెదను ”

“ ఇపుడు నాస్థితిలో చాల మార్పు గల్గినది. కారణము లెక్కువ చెప్పలేను. కాన నేనిందు వచ్చియుండుట మీరింక మరువవలయును. వేరెవరితోనైన నిది ప్రస్తావింపఁగూడదు. కడకు మాసరళకుఁ గూడ తెలుపకుండినచో తమకు నేనెంతో కృతజ్ఞనై యుండెదను. కృపయుంచి యీనాకోరిక తప్పక చెల్లింప వలయును.”

“ తప్పక యట్లే చేసెద. ఇంతేకాక నాజీవితకాలములో ఎప్పుడేపనిచేయు మన్నను నీయాజ్ఞ మీరు నంతటి కృతఘ్నుఁడను గాను. ఇప్పుడు ప్రయాణ మెచ్చటికో నేనెఱుఁగ వచ్చునా ? ”

“ ప్రకృతము బెంగుళూరికి. ఆమీఁద నెట్లగునో ! ఇపుడు చెప్పఁజాలను.”

“ ఒంటరిగ నీవెట్లు పోఁగలవు ? ”

“ ఆవిషయమున మీరేమియు చింతింపకుఁడు. నాయేర్పాటు లన్నియు నేఁ గావించుకొని యున్నాను. నాకు సెలవిచ్చెదరా ! నన్ను మరువరు గదా ! ”

“ అనాథుఁడనై మృత్యుముఖముననున్న నన్ను రక్షించిన పరమోపకారిణివి. నిన్ను మరువఁగలనా ? ప్రకృతమున నీకేమియుఁ బ్రత్యుపకృతి చేయఁజాలనందుకై నాకెంతో పరితాపముగ నున్నది. నీఋణమునుండి నేనెన్నఁడు విముక్తుఁడ నగుదునో తెలియదు. కాని యెన్నఁడైన నానుండి కాఁదగిన కార్యలేశ మున్నచో సందేహింపకుము. నీచే జీవదానము గొన్నను మరువకుము.”

అనుచుఁ జుట్టునుంజూచి యంతలో నేమో తలంపునకు రాఁగా తన చేతియందలి యంగుళీయక మొకటి వెలికిదీసి మరల నాయమతో నతఁడనియె.

"నాగుర్తుగ నిది నీకడ నుండనిమ్మా"

ఇందిర గ్రహించి వ్రేలినిడికొని మెల్లన లేచెను.

"ప్రొద్దైనది. సెలవిచ్చిన వెడలెదను."

"అమ్మా! పోయి రమ్మా! అనంతనాథుఁడను సోదరుఁ డొక్కఁడున్నాఁడని నీమనసున నుండినఁ జాలును"

ఇందిర బదులుమాటాడలేదు. మరల ననంతనాథుని మొగము వంకఁగూడఁ జూడలేదు. గది విడిచి వెడలిపోయెను.

బయట నెవరితోనో మెల్లగ మాటాడుచున్న ట్లనంతనాథుఁడు వినెను గాని, యాతఁడెవరో యెఱుగరాదయ్యె. ప్రయత్నించి లేచి పోయిచూచుసరి కందెవ్వరు నుండలేదు. ఇందిర వెడలిపోయియుండెను.

"ఎవరో యామె బంధువైయుండును. కాకున్న కూలివాఁడై యుండును"

అనుకొని యతఁడు మరలి యింటఁజొచ్చి శయనించెను.

---

# ప్రణయసరణి

---

## పదునేడవ ప్రకరణము.

### పశ్చాత్తాపము.

"ఎల్ల నెయ్యములకుఁ దల్లిదండ్రులయందు సుతులవలని నెయ్య మతిశయంబు ధనము లెంత గలిగినను సుతరహితుల కెమ్మియని మనఃప్రియమ్ము లేద."

[నన్నయ. భా. అరణ్యపర్వము.]

మరునాఁడు సూర్యోదయకాలమునకు బళ్ళారినుండి శ్రీనివాస శాస్త్రియు పార్వతమ్మయు వచ్చి చెన్నపురిఁ జేరిరి. వీరిట్లు వత్తురని మునుపటిదినమే యనంతనాథునకు తంత్రీవార్త వచ్చి యుండెను. ధూమశకటము నవతరించి వీథులంబడి విచారించుచు వారెట్లో ఎనిమిది గంటల ప్రొద్దున కనంతనాథునిగదిని వెదకికొని రాఁగలిగిరి.

జననీజనకు లనంతనాథునిఁగానక దాదాపుగ నిరువదిమాసములు గావచ్చినవి. ద్వితీయవివాహమునకై తలిదండ్రుల కెఱింగింపక వారిని మోసపుచ్చి బెంగుళూరున కరుగుదెంచిన దాదిగ మరల నతఁడు బళ్ళారి కడుగిడ లేదు. తన వివాహపువార్త మాత్ర మాతఁడు లేఖామూలమున వారి కెరింగించియుండెను; కాని ప్రత్యక్షముగ బోయి మాటాడఁడయ్యె.

కుమారుని వర్తనము చాల మనఃఖేదదాయక మైనకతమున శ్రీనివాసశాస్త్రియు నతనిఁ జూడఁగోరలేదు. నానాఁటికి పార్వతమ్మ మాత్రము కొడుకును దలఁచి కన్నులనీరు నించుచుండెను. రమ్మని యనంతునకు జాబు వ్రాయఁ బతి నెంతో ప్రబతిమాలెను. కాని హఠవాదియగు శాస్త్రి తన కవమాన మొనరించిన వాఁడు సుతుఁడే కాఁడనియు, తమకుఁ గుమారుఁ డను వాఁడే యీప్రపంచమున లేఁడనియు చెప్పుచు వచ్చెను. చెన్నపురిలో ననంతుఁ డొంటరిగ చదువుచున్నాఁ డని పార్వతమ్మ చాలఁ బరితాపమంది, తనభర్త కతనిపైఁ గల కోపవేగము నార్ప నెన్నియో మారులు తనయోపిన కొలఁది ప్రయత్నించెను గాని ఫలము లేదయ్యెను.

రెండుదివసములక్రిందట చెన్నపురినుండి వీరి కొకతంత్రీవార్త వచ్చినది. "అనంతనాథునకు మారి తగిలినది. సత్వరము రావలయును" అని. అనంతుఁ డీతంతివార్తనుబంపలేదని మన మెఱుఁగుదుము. జననీజనకులకు తనపైఁ గల యసూయ వాఁ డెఱుఁగనిది

గాదు. అయినను చెన్నపురిలో వాని మిత్రు లెందఱు లేరు? ఈరహ స్యమును దెలిసిన వారెవరో యీవార్తనంపి యుందురని తోఁచెడిని.

ఆవార్త విన్న వెంటనే శ్రీనివాసశాస్త్రిగారి కోప మంతయు మటుమాయ మయ్యెను. హృదయమున తన యేకపుత్రునికై పరి తాప మగ్గల మయ్యెను. ఇఁక పార్వతమ్మయవస్థ యెట్లుండెనో మేము చెప్పఁ బని లేకయె మాచదువరు లూహించుకొనఁగలరు! ఆహా! విశ్వాసమునఁ గన్నకడుపుతోఁ దులతూఁగు వస్తు వేదియు నీప్రపంచ మునఁ గానరాదు గదా!

ద్రోహి యైనను, మూర్ఖుఁడైనను, నీచుఁడైనను, పతితుఁడై నను, కురూపుఁడైనను, సుతుఁడు తలిదండ్రులకు ప్రేమపాత్రమే! బంధుమిత్రదారాదు లెందఱున్న నేమి? కన్నవారికన్న మిన్నగ మానవు నెవరు ప్రేమింపఁగల్గుదురు? బంధువుల విశ్వాసము ప్రత్యే కమున నే; మిత్రుల యాదరణము స్వార్థపూర్ణమగు వఱకే; జాయల ప్రేమ కొఱఁతవడక యార్జించు వఱకే; స్వార్థ మించుకయు లేక, నిష్కారణముగ, నిర్వ్యాజముగ, అవిచ్ఛిన్నముగ, నామరణాంత ముగ, కన్నకష్టములకైన నోర్చి, మనపై మన తల్లిదండ్రులు చూపు విశ్వాసము—దయ—ప్రేమ—వాత్సల్యము—సౌహార్దము—ఆద రము—వీనికై మన మెన్ని జన్మములు శ్రమపడినను ఋణవిముక్తు లము కాఁగలమా? కల్ల! మానవుని సుఖము, ఆరోగ్యము, ఆటలు, విలాసము, హర్షము, స్వేచ్ఛ మొదలగున వన్నియు జననీజనకులతో నిలిచి పోఁగలవుగదా! దుఃఖమయమైన యీసంసారమున మనుజుని కా వస్తుద్వయమే సకల సుఖ సాధనము; ఆనందమయము; విశ్వాస భాజనము. సమ్మానార్హము.

గదిచేరి, మంచముపైఁ బరుండి యస్థిచర్మావశిష్టుఁడైన యనం తుని జూచి చూడకమునుపే పార్వతమ్మ కనుల సంతతధారగ నశ్రు

వర్షము గురియ నారంభించెను. ఎలుఁగెత్తి పెద్దపెట్టున నేడ్చియుండునుగాని, యామె కంఠము రుద్ధమయ్యెను. పదములు వడఁకసాఁగెను. ఎట్లో సమీపించి రెండుచేతులుఁ జాఁచి యనంతుని జేరి „నాయనా !" యని ముందు నోరాడక గొల్లున రోదన మొనరించెను. పైఁట యంతయు నార్ద్రమయ్యెను. శ్రీనివాసశాస్త్రియు నుస్సురనుచు నా చెంతఁ గూలఁబడియెను. అతనికనులఁగూడ నశ్రుబిందువులొదవెను.

అనంతనాథుఁడును మెల్లన లేచి కూర్చుండి జననీజనకులను శాంత వచనముల నూరార్చెను. జీవిత సందేహముగల కాలము గడచినదనియు, నికపై ప్రాణభయము లేదనియు రోగము కుదురుచువచ్చినదనియు వారి కెఱిఁగించెను. బంధుజనులు లేని యీపరస్థలమున నుపచార మెట్లు జరిగెనని వారడిగినపుడిందిరమాట నోటి తుదకు వచ్చెనుగాని, యామె కొనర్చిన వాగ్దాన మంతలో తలఁపునకు వచ్చుటచే నామె పేరు నుడువక తన మిత్రులు తన్నుపచరించిరని మాత్రము వారికిఁ జెప్పెను.

ఆక్షణమునుండి యనంతనాథునకు సమస్తోపచారములును కొఱఁత లేక జరుగుచు వచ్చెను. రోగగ్రస్తుఁడగు సుతునికడకన్నతల్లి యున్నపు డేయుపచారము కొఱఁతపడును? ఇపు డనంతనాథుఁడు చాల లజ్జించెను. తల్లిదండ్రులకు తా నొనరించిన మనఃఖేద మెంత యని యిపు డతనికి బోధపడియెను. వారు తనయెడ ననాదరమున వర్తింతు రని నమ్మియుండెనుగాని, ఇట్లు తాను రమ్మనకున్నను తమంత నత్యాతురులై వచ్చి తనయెడ నింత విశ్వాసమును కరుణయు శాంతభావమును జూపుదురని కలనైనఁ దలంచియుండిన వాఁడుకాఁడు. వాత్సల్యమున కన్న కడు వెంతఘనమో బాగుగ నిపు డతనికి గోచర మగుచు వచ్చె. వారియెడల మహాపరాధ మొనరించితినని తలఁచి మనంబున నతఁడు చాల పరితాపపడెను. కాని యిట్లు మన్నిం

తు రని తెలిసియుండెనేని సరళను వివాహమాడిన మీఁదనైన తప్పక బళ్ళారిపురమున కరిగి నిజమును నివేదించి మన్ననవేఁడి యుండఁడా? సందియమేమి? తన్ను నిందించి పరాభవింతురని నమ్మియే తానటు చేయఁ డయ్యెను కాని వాస్తవ మిపు డెఱింగెను. తన తెలివి తక్కువకు చాల లజ్జించెను. పశ్చాత్తప్తుఁ డయ్యెను.

యుక్తమే! తన్నుఁగని, పెంచి, పెద్దఁజేసి, కన్నకష్టములకోర్చి, ధనమార్జించి, విద్యఁజెప్పించి పోషించిన మహానీయులు తలిదండ్రులు తనవలన నేమిసుఖము గాంచిరి! ఏమిప్రత్యుపకారము నందిరి? వార్ధకమున వారి కుపచరించుటకు మారుగ మహాపరాధ మొనరించి యెడ తెగని మనఃక్లేశ మొనగూర్చుటయా తనజన్మమునకు ఫలము? తాను చేసినది చాల నవివేకపుఁబనియని యనంతనాధుఁడు తలఁచెను. తనయనాలోచితకృత్యమునకై పలుమాఱు తన్నుఁ దా నిందించుకొనియెను. "బాలిశా! తలిదండ్రులకు నీవొనర్చిన మహాపరాధమునకు ఫలముగ నీవీమారికావ్యాధికిఁ జిక్కితివిసుమా!" జాగ్రత్తయని అతనిహృదయాంతరాళమున నొకయశరీరవాణి హెచ్చరించునట్లు తోఁచెను. ఆయ నిర్వాచ్యభాషణములు శ్రవణపుటములఁ బ్రతిధ్వనులిచ్చుచు నతని హృదయమునెంతో కలంచెను. నాఁటిరాత్రి స్వప్నమునందుఁ గూడ నతఁడనేక యాతనలననుభవించెను. నరకము ప్రత్యక్షమయ్యె. దిగ్గున మేల్కాంచెను. మనసున చాలభయమంకురించెను. పాపభీతి క్రొత్తగ నంకురించెను. స్వధర్మము మదిని జాగరితమయ్యెను. ఇఁక మీఁద నెన్నఁడైన తల్లిదండ్రులవిషయమున నిట్టితప్పు చేయనని శపథపూర్వకముగ నిర్ధరించెను.

దాదాఁపుగ వారముదినములు గడువవచ్చెను. అనంతనాధునకు నానాఁటికి శరీరమున నారోగ్యకళయభివృద్ధిచెందసాఁగెను. పార్వతమ్మయు సంతసించెను.

ఒకనాఁడు మధ్యాహ్నసమయము, జనకుఁడు సుతుఁడును మాత్రము గదిలోఁ గూర్చుండియుండిరి. శ్రీనివాసశాస్త్రి వీధిలోని కరిగియుండెను. పార్వతమ్మ కొడుకుచేరువఁ గూర్చుండి నిరంతరము శయ్యపైఁ బొరలాడుటచే చిక్కుపడి జడలుగట్టియున్న యతని కుంతలముల నల్లన చిక్కెడలించుచుండె. వారిరువురు నిట్లు సంభాషించిరి,

" అమ్మా! నేను మీయెడ మహాపరాధ మొనర్చితిఁగదా !"

" అది నీవే యోచింపుము " పార్వతమ్మ చిన్నన వ్వొకటి నవ్వెను.

" నిజము. నాతప్పును మీరు మన్నింతురని కలలోఁ గూడ నమ్మలేదు. నేఁజేసినదంతయు నాకిపుడు బోధపడినది. కాని పసితనము పొరఁబాటున యుక్తాయుక్త వివేకశూన్యుఁడనై మీమనస్తాపమునకు కారణమైతిని. ఇంతకును చిన్ననాఁటి వివాహ మాదికారణము. ఇంత యనర్థమున కిదియే మూలము. నామనోభీష్టమునకు సమ్మతింపరని వేరువివాహావృత్తాంత మే మరుగుపరిచి బెంగుళూరికిఁబోయి సరళను పరిణయమాడితిని. ఆకాలమున మీరు కోపించియుందురని నిశ్చయించి మరల బల్లారికి రా సాహసింపనైతిని. ఇప్పుడనుభవమైనది. పశ్చాత్తాపము జనించినది. నాతప్పును మరువవలయునని పలుమాఱు మిమ్ము వేఁడుకొనుట తప్ప వేఱేమియుఁ జేయఁజాలను. "

" మఱువక మేమేమి చేయఁగలము తండ్రీ! నీవివాహావృత్తాంతము వ్రాసినజాబుఁజూచి యెంతపరితపించి దుఃఖచితిమో నీకెట్లు తెలియును? ఈకాలమున కనిపెంచునప్పుడేకొడుకులు గాని పెరిఁగిన మీఁదఁగారు. "

అనునంతలో పార్వతమ్మ కనులనిండ నీరు నిలిచెను. మరల నించుకసేపూరకుండి [illegible] యిట్లనియెను.

" మారి సోఁకెనదని తంతివచ్చినప్పుడు నామనస్సెంత కళవళ

పడెనో దైవమున కొక్కనికిఁ దెలియును! నోట నూగింజ వేసికొని కూడు నీరు విడిచి"మరల చూడఁగలనా ?" యనినిలిచి నిద్రఁబోకయీయూరు చేరితిని "

పార్వతమ్మహృదయము స్తంభించెను. అనంతునిహృదయము చలించెను.

" అమ్మా ! నా తెలివిమాలినతనము మీకింత దుఃఖము దెచ్చినది. ఇప్పుడు నాకు తెలివివచ్చినది. క్షమించి యిఁక నన్ను నిందింపకుఁడు. నాహృదయమున పశ్చాత్తాపవహ్ని మండుచున్నది. అదేచాలు. పార్వతమ్మ కన్నీరు చెరగునఁ దుడిచికొని.

" పోనీ ! నీభార్యయైన ఇట్టివేళలో రాలేదా ? అనియడిగెను.

" గర్భవతి "

ఎన్నిమాసములు ?

" ఐదునెల లుండును. "

" అయిననేమి? మంచిలక్షణము ! పతికి పరస్థలమున మారిపోఁకి యుండఁగా తానుహాయిగపుట్టినింటఁ గూర్చుండవలెనా? దిక్కుమాలిన చోట నీకెవరుపచరింతురు ? ఏమో ! ఈకాలపువారిచర్యలు మీకే బాగున్నవి !"

" అమ్మా! అట్లుగాదు. సరళ యట్టియవివేకినిగాదు. శరీరమున అనారోగ్యముంటచే రాఁజాలకున్నది. అంతేకాని ఇట్టివిషయములలో నితరుల కుపదేశమియ్యఁజాలినది. చాల విద్యావినయములు గలపడుచు. నీవొక్కమారు చూచినచో నిట్లనవు. "

" ఏమోనాయనా ! నేచెప్పఁజాలను. ప్రాణము పోవనున్నఁ గూడ మాకాలపువారిట్లుండరు. పతికన్న ప్రాణముతీపా ? ఇంతకును మీరు " మునిఁగినది గంగ, మెచ్చినది రంభ ! " ఏమోలే ! పాలకి

వచ్చినదే పంచామృతము. మరచితిని. నీభార్య నెప్పుడైన మాకు చూపుదువా లేదా ?"

"చూపకేమి ? నవ్వుచు ననంతనాథుఁడనియె." ఈపరీక్షయైనతోడనే తప్పక సరళను పిల్చుకొని బళ్ళారికివచ్చెదను."

"ఐన కమలను నీవు విడిచినట్లే గదా !"

"నాఁడే జాబు వ్రాసినాఁడను."

"ఏమని ?"

"ఇష్టమున్నచో వేఱు పరిణయ మాడవచ్చు నని."

"ఎంతకఠినహృదయమురా ! మీయింగ్లీషుచదివినవారి నడతలునేర్చిన వా రట్లు చేతురేమోకాని, వైదికాచారముగలవారెవరైన నట్లు చేయుదురా? ఏల? ఆచిన్న దేమిపాపము చేసినది? నీవు వేరువివాహము చేసికొన్నమాత్రాన ఆచిన్నదానిని గ్రహింపఁగూడదా ?"

"అమ్మా ! మీకు శుద్ధమైన ప్రేమ యన నెట్టిదో తెలియదు. ప్రేమ కీప్రపంచమున నొక్కరే పాత్రముగాని పలువురు గానేరరు. ప్రేమలేక నిష్కారణముగ నాచిన్నదానిని నాయింట దాసివలె నుంచుకొని నిరంతర దుఃఖభాగినిఁగా జేయుటకు నా మన సొప్పదు. వివాహమాడి పరిత్యజించుట తప్పేగాని, ప్రేమింపక అనాదర మొనరించి జన్మావధి సుఖదూరను గావించుట యంతకన్న పరమ పాతకముగదా !"

పార్వతమ్మ యేమో ప్రత్యుత్తర మియ్యఁదలఁచెను. కాని యంతలో శ్రీనివాసశాస్త్రి వీథినుండి మరలి వచ్చినట్లయ్యెను. సంభాషణ చాలించి పార్వతమ్మ లేచి గది వెలువడి పోయెను.

---

# ప్రణయసరణి

—

## పదునెనిమిదవ ప్రకరణము.

### స్వామినాథసేనుఁడు.

"దంపత్యో ర్నిశి జల్పతో ర్గృహశుకే నాకర్ణితం యద్వచ
స్తత్ప్రాత ర్గురుసన్నిధౌ నిగదత స్తస్యాతిమాత్రం వధూః
కర్ణాలంబితపద్మరాగశకలం విన్యస్య చఞ్చూపుటే
వ్రీడార్తా విదధాతి దాడిమఫలవ్యాజేన వాగ్బన్ధనమ్."

[అమరుకము.]

మఱచితిమి! కథాప్రవాహమునం బడి మాచదువరులకు స్వామినాథసేనుని పరిచయమే యియ్యమైతిమి. తగినసమయముగూడ లభింపలేదు. ఇప్పుడైన నావిషయము గైకొందము.

స్వామినాథసేనుఁ డొకగొప్పబంగాళీబాబువంశస్థుఁడు. ఇతని పూర్వీకులనివాసము కలకత్తానగరము. వారేకారణముచేతనో చాలకాలముక్రింద బెంగుళూరికి వచ్చి చేరియుండిరి. స్వామినాథసేనుని కాలమునకు నతనియింటివారిం చుమించు బంగాళీ లనఁబడుటకన్న కర్ణాటకు లని పిలువఁబడఁదగియుండిరి. చాలవఱకు స్వభాషయగు వంగభాషను మఱచియుండి రనియే చెప్పవచ్చును. స్వామినాథసేనుఁడు తన చిన్నతనమునందే పట్టపరీక్షలోఁ గడతేఱి ఇంగ్లాండున కరిగి యందు న్యాయశాస్త్రము సాంగముగ నభ్యసించి బిరుదునంది మగల హిందూదేశమునకు వచ్చెను. దేశాంతరములోని యాచారవ్యవహారాదులను చక్కఁగ నెఱింగియుండినవాఁ డగుటచే నతనికి ప్రాచీనులయాచారములు గిట్టవయ్యెను. మనవారి ప్రతియాచారము నందును దోషమే యతని కన్నులకుఁ గన్పట్టుచుండెను. దేశాభివృద్ధికి

సంఘసంస్కరణమే ముఖ్యమని నమ్మి నాఁటనుండి సంస్కర్తలలో నగ్రపదముఁ బడయఁగోరి పనిచేయుచు తోడివారికి నిదర్శనము నొసఁగు చుండెను. పురాతనమతము లన్నచో నతనికితలనొప్పి. తొలుఁదొలుత 'దివ్యజ్ఞానసభ' కుఁ జేరియుండెనుగాని యటుమీఁద నదియు నిస్సార మనియెంచి బ్రహ్మసమాజమునఁ జేరెను. సంపూర్ణసోదర భావము, స్త్రీ పునర్వివాహము, స్త్రీస్వాతంత్ర్యవర్తనము, మొదలగు విషయములలో నతఁ డెక్కువపట్టుదలతో పాటుపడుచు సంఘమును చేతనైనంతవఱకు సంస్కరింప మొదలుపెట్టెను. ఇప్పటికాలపు సంఘసంస్కర్తలలో ననేకులవలె నూరక యుపదేశ మిచ్చుటతో మాత్రముపోక నిదర్శనముగ నుండుటకై యతఁడు తన కూఁతు రగు సరళకు ఆంగ్లేయ విద్యఁ జెప్పించి పదునాఱవయేట నామెకు స్వయంవర విధిని వివాహము చేసెను. సభాగమనములయందును, వ్యాయామ విహారములందును, సహవాస సల్లాపములయందును, సరళకు సంపూర్ణస్వాతంత్ర్యము నొసంగి, పురాతనమూఢాచారపిశాచగ్రస్త లగు ననాగరక తరుణీజనములకు తరణోపాయముఁజూపెను.

ఇతని యర్ధాంగలక్ష్మియగు "శకుంతలాదేవి" యీయుద్దేశములలో నతనికి సైదోడు వాదోడుగ నెంతో సాయ మొనరించుచుండెను; కాని ప్రపంచమున నిట్టి యనుకూల దాంపత్యమును దైవ మోర్చుట యరుదు. సరళ యుదయించినకొన్నిదినములలోనే యాపుణ్యసతి యాకస్మికముగ నీలోకమునుఁ బాసి నాథునిదుఃఖసముద్రమునఁ ద్రోచెను. ఈవఱకు నామె జీవించియుండినచో స్వామినాథసేనుఁ డింకను సంఘసంస్కరణ విషయమున నెంతపని యొనరించియుండునో!

న్యాయవాదమునఁగూడ స్వామినాథసేనునికి సాటివచ్చువారు లెక్కకు చాలఁ దక్కువ. వాదకౌశలమందును, న్యాయశాస్త్ర నైపుణ్యమందును, వాక్పాటవమునందును, కార్యశ్రద్ధయందును వానితోఁ

మలతూఁగు న్యాయవాదు లాపురమున లేరని చెప్పవచ్చును. ఆకారణమున నూతనముగ న్యాయశాస్త్రపరీక్ష నిచ్చిన విద్యార్థు లెందఱో యతనికడ నిలిచి వ్యవహార విషయముల బాగుగ నెఱింగి పేరుగాంచుచుండిరి. లక్ష్మీకాంతుఁ డితనికడ వాదవిద్య నభ్యసించియే యిపుడు మైసూరునందు స్వతంత్రముగఁ బని చేయుచున్నవాఁడు.

ఇంతియగాక గొప్పగొప్ప వ్యవహారము లన్నియు నాతని కడకే వచ్చుచుండెడివి. నిరంతరము నతని యింటి హజారమున ననేకులు కాచుకొని యుండువారు. ఒక సమయమున నతఁ డొక గొప్ప జమీందారుని వ్యవహారమునుగూర్చి యాలోచనల నిచ్చుచుండును. మఱియొకవేళ నొక పాళెయగానిపరముగ వ్యవహరించుచు వాద సాధనముల నేర్పఱుచుచుండును. వేఱొక కాలమున దొరతనమువారి పరమున నొకానొక తగవును దీర్చుపనిఁ జింతించుచుండును. క్షణమైన నతనికి విరామముండుట యరుదు. కార్యభార మెక్కుడై యించుక విసుకు తలసూపినపు డాతఁడు తన గారాబుబిడ్డకడ కరిగి సంపూర్ణవాత్సల్యమున నాతన్వంగితో మాటలాడుచుఁ బ్రొద్దుపుచ్చుచుండును.

నేఁ డాదివారము. న్యాయస్థానము మూయఁబడినది. మధ్యాహ్నసమయమున స్వామినాథసేనుఁ డొంటరిగ సౌధమందలి శాలలో నట్టిట్టుపచారుచేయుచు నేమో తలపోయుచుండెను. చేత నొక న్యాయగ్రంథము నునిచి పత్రములు ద్రిప్పుచు చింతించుచుఁ గొన్నిక్షణములు గడపెను. కొంతవఱకు విసుగు దోఁచినట్లైన పుస్తకము నందలిబల్లపైఁ బాఱవైచి గృహాభ్యంతరమునకరిగి యొకగదిలోఁ బ్రవేశించి „అమ్మాయీ!” అని పిలిచెను.

గదిలో గర్భవతి యగు సరళ యొకకురిచీపైఁ గూర్చుండి చేత నొక లేఖనుబట్టి చదువుకొనుచుండెను. దృష్టి యనిమేషముగ నాలేఖ

పై నిలిచినది. మేను నిష్కంపము. ఆమె హృదయమేదో దూరమున నున్న వస్త్వంతరముపై ధృఢాసక్తమైనట్లు ముఖభావము సూచించు చుండెను. వాకిటపక్క వీపు దిప్పి కూర్చుండి యుంటచే నామె జనకుఁడు ప్రవేశించినది చూడలేదు; అన్యమనస్కయగుటచే నతని కాలి చప్పుడుగూడ వినలేదు. కాని యాతని „ అమ్మాయీ !" అను పిలు పామె నిపుడు భావస్వప్నమునుండి తటాలున మేలుకొలిపెను.

ఆమె యులికిపడి తళతళలాడువిశాలనేత్రముల నాత్రమును సంభ్రమమునుదోఁప తనచేతియుత్తరము బల్లపైనుంచి యందుపై నొకపుస్తకము నాచ్ఛాదించి, మెల్లన బల్లనూఁతగొని పైకిలేచెను.

„అమ్మాయీ! అనంతనాథునినుండి జాబేమైన వచ్చినదా ?"

„ నేఁడే వచ్చినది. "

„ ఆరోగ్యమేకద ? "

అనుచు స్వామినాథసేనుఁడాప్రక్క మరియొక కురిచీనీడ్చుకొని కూర్చుండెను.

„ ఆరోగ్యమే "

„ నీపతి చెన్నపురికిఁబోయి దాదాఁపుతొమ్మిదినెలలు గావచ్చి నవిగదా ! పట్టపరీక్షనిచ్చువఱకు నీయూరికిరాడు గాఁబోలు ! "

స్వామినాథసేనుఁడు మందహాసముచేసి మరల ననియెను.

„ హాతముననైననేమి ? కోపముననైననేమి ? నీమగఁడుచాల పట్టుదలతో వ్యాసంగము చేయుచున్నాఁడు. ఈసంవత్సరమున తప్పక కడతేరఁగలఁడు. భగవదనుగ్రహమునకు కొఱఁతవడదేని నీ కుమారో దయమును నీపతిపరీక్షాజయమును రెండునించుమించుగ నొక్కమారే చూచి విని యానందింపఁగలనను నమ్మిక నాకెంతయో గలదు. "

సరళ తలవంచి ప్రక్కకుతిరిగి ముఖమున నుదయించుచున్న భావమును జనకునకెఱుఁగరానీక మఱుఁగుపఱచెను,

రెండు నిమేషము లెవరును మాటాడరైరి. బల్లపై సరళ పుస్తకము నాచ్ఛాదించి యుంచియుండిన లేఖ పూర్ణముగ మఱుఁగుపడక అందలి మొదటి పుటలోనివి కాఁబోలు కడపటి పంక్తులు కొన్ని కానవచ్చుచుండెను.

“ వాఁ్రియఁజాలను. నీవియోగవేదనాభర మతిదుర్భరమై నా మనంబు గలంచుచున్నయది. ఎంతయూఱడించుకొన్నఁగూడ హృదయము కార్యాంతరములకుఁ జొరదు కాని యిప్పటిస్థితిలో నేనైనె నాహృదయేశ్వరిసన్నిధిఁ జేరి ధన్యతఁగాంచఁ జాలకున్నాఁడను. కాని విధిలేదు. ఐనను నాజీవిత సర్వస్వదేవతయే నన్ను అనుగ్ర ”

తరువాత నాలేఖలోనేమున్నదో కానరాదు. తటాలున సరళ యాదిక్కు చూచెను. లజ్జాభయములు మనసుననిండి ముఖమునఁ దలసూపెను. తోడనే యాచతుర బల్లచెంతకరిగి యేమియు నెరుగనిదానివలె జనకునిదృష్టి కడ్డముగనిలిచి మెల్లన యొకచేత నాలేఖను సర్వమును మూసివైచెను. తరువాత జనకుని మొగమువంకఁ దిలకించెను కాని యతఁ డదిగ్రహించియుండలేదని యామెకు గోచరమయ్యెను.

సరళవంటి విద్యావతియగు తరుణికి లజ్జాభయములేల? చదువరులిట్లు సందేహపడుదురు. కాని యెంతవిద్యావతియైన నేమి? ప్రణయసూచకములగు రహస్యలేఖ లితరులకంటఁ బడుసమయము తటస్థించినపుడు ముగ్ధలకు లజ్జ యుదయించుటేమియరుదు? సరళమాత్ర మేమి ప్రౌఢయా? పదునెనిమిదియేండ్లు సయితమింకను బూర్ణముగా లేవు గదా! ఇఁక భయమేలయందురో? ఎంత ప్రేమ యున్నను జూచువాఁడు జనకుఁడు కదా!

గురుజనముకడ తగినరీతి భయభక్తులుగల్గి మెలఁగుట వినయవతుల కుచితముగాదా? విద్యాసంపన్నులైనంతమాత్రాన రహస్యోచితములగు కార్యములు మాననీయులగువారికి గోచరించురీతి నడుపఁగూడునా?

ఎవరియభిప్రాయమెట్టులైనను సరళభావమున నప్పుడా రెండును తప్పక జనించినవి.

కొంతతడవూరకుండి జనకునివంక ప్రేమార్ద్రములగు చూపులఁ బఱపి సరళయిట్లనియె.

« నాయనా ! నాదొకవిన్నపము గలదు ”

« తల్లీ ! ఏమి ? ”

« నేఁటిరాత్రి మైసూరికి పోయివచ్చెద ”

« ఏల ? ఈయూరికిరాను మనసురాక నీభర్త మైసూరికివచ్చి యున్నాఁడా ? ”

« అట్టిదేమియులేదు. రేపచట « మహిళాసమాజ ” మను విద్వత్తరుణీసభ యొకటి జరుగఁ గలదు. అందుకై పోఁదలఁచినాను ”

« రేపా ? ”

« అవును ”

« అవశ్యము పోయి రమ్మ. దీనికై యింతవేడనలెనా ? కాని నీకు సహాయు మెవరు ? ”

« లక్ష్మి వచ్చును ”

« కానిమ్ము. ఆరోగ్యమును మాత్ర మేమరవకుము ”

స్వామినాథుఁడు తనచొక్కా జేబునుండి యొక ద్రవ్యపత్రము విలువగు రాజకీయపత్రమునుదీసి “ తల్లీ ! ఇదినీవ్యయమునకుచాలునా?” అనియెను.

« సమృద్ధి ” అనుచు సరళ దానినందుకొని భద్రపఱిచెను.

స్వామినాథ సేనుఁడునుతనయకు విద్యావిషయమునఁగల శ్రద్ధకై చాల సంతసించుచు నామందిరముఁ బోసెను.

# ప్రణయసరణి.

—;o;—

## పందొమ్మిదవ ప్రకరణము.

—•—

### సంతోషవార్త.

"విశ్వామిత్రపరాశరాదిమునయో వాతాంబుపర్ణాశనాః
తేపిస్త్రీముఖపంకజం సులలితం దృష్ట్వైవ మోహంగతాః
శాల్యన్నం సఘృతం పయోదధియుతం యేభుంజతే మానవాః
తేషామిన్ద్రియనిగ్రహో యది భవేద్విన్ధ్యః ప్లవేత్సాగరే.
[భర్తృహరి,శృంగారశతకము]

కొలఁదికాలముననే అనంతనాథునకు పూర్ణారోగ్యము కలిగెను. పార్వతమ్మ కడుపుచల్లనయ్యె. నానాఁట నాదంపతులు సుతుని యపరాధమును మఱచి మునుపటికన్న నెక్కువగ నతనిఁ బ్రేమింపసాఁగిరి. రానురాను కమలనుగూడ వారు మఱచిపోవ నారంభించిరి. సరళను పరిణయమాడు టేమితప్పని వారు తలపోయఁజొచ్చిరి. ఈకాలపునవనాగరకులకెల్ల నిట్టిపిచ్చి తప్పక యుండఁగలదని మనసుసమాధానపఱచికొనిరి. నిజము! ఇట్టి యందగాని బొందఁగల భాగ్యము నోచలేని కమలది దురదృష్టముగాని, అక్కఱలేనిదానిని పరిత్యజించుటలో ననంతనాథుని దేమితప్పు? ఇదిగాక యనుపయోగమగు విషయమున పసివారివలె మోరకుపట్టు పట్టి 'గతజలసేతుబంధన' మొనర్పఁ జూచుటుచితమా? ఇంతకును దమయేకపుత్రుని నిందించి మనసునొప్పించుట వారికుచితముగఁ దోఁపలేదు. ముసలిముప్పున రతిమన్మథులఁ బోలు కోడలును కొడుకును తమకడఁ జేరి తమ్మాదరించుచుండఁ దలయూఁపను వారి కుండు టేమి యరుదు! విద్యాధికుఁడై చేతులకొలఁదిగ నా

ర్జన చేయఁగలకాలమున సుతునియభిమతముచొప్పున వర్తించుచు నానందింపక వారి కీచింతల నేమిఫలము ? ఎన్నియోవిధముల నాలోచించి వా రిది నిర్ధరించిరి. శ్రీనివాసశాస్త్రియు పార్వతమ్మయు తరువాత నొక్కనాఁడైన సుతునితో నీప్రసంగమే యెత్తరైరి. విషయమే మఱువసాఁగిరి.

ఇంచుమించుగ నొక్క మాసము గడిచెను. మరల వసంతనాథుఁడు కలాశాలఁ జేరి యిమ్మడియగుశ్రద్ధతో వ్యాసంగముచేయ సాగెను. పార్వతమ్మ యింకను గొంతకాలము చెన్నపురియందే నిలచి యుండఁగోరెను గాని, శ్రీనివాసశాస్త్రి బల్లారిపురమునకరుగఁగోరిత్వర పెట్టెను. వారిచట నిలిచినచో బల్లారిలో నింటివంకఁ జూచుకొనువారెవరు? సమయమని పొరుగింటఁ దోలివచ్చిన పశువుల నెన్నినాళ్ళితరులు కాపాడఁగలరు? ఇఁక వచ్చునవియా మాఘ ఫాల్గునమాసములు! మంచివివాహోపనయన లగ్నకాలములో మునుముందుగ పౌరోహిత్యము కుదుర్చుకొనక పోమరితనమున చెన్నపురిలో కొని తినుచుండిన సంసార మెట్లు జరుగఁగలదు ? విధిలేక పార్వతమ్మయు సమ్మతించెను. కొడుకునకు పలువిధముల బుద్ధిఁజెప్పి దేహారోగ్యము నేమరకుమని హెచ్చరించి పార్వతమ్మయు పయనమొనరించెను.

వారిరువురును చెన్నపురి వీడిరి.

పరీక్షాకాలము సమీపించుచు వచ్చె. విద్యార్థులు నిద్రాహారములు లేక పాటుపడఁ జొచ్చిరి. గ్రహచారవశమున తనకుఁ గల్గిన వ్యాధికతమున నొక మాసము వ్యాసంగ హీనుఁడైనందులకు వసంతనాథుఁడు చాల పరితాపమునంది పరిమితమైన యవధిం దలంచి వగచుచు నెక్కుడు పట్టుదలతో వ్యాసంగముఁ జేయఁసాఁగెను. దేహారోగ్యము చెడునను శంక యప్పుడప్పుడు గల్గుచుండెను. గాని తన శపథము తలంపునకు వచ్చి యితర చింతలఁ జేరనిచ్చుటలేదు. ఈతూ

గూడ పరీక్షలోఁ గడతేరకున్న నిఁక నాతని బ్రతుకు దుఃఖభాజనమే గదా? సరళ కతఁడు మొగ మెట్లు చూప గల్గును! బళ్ళారిపురమునకు వెండియుఁ బోవు టెట్లు? ఏమో భారముగఁ దోఁచెను. అనంతనాథునకు ప్రాణముపైఁగూడ నాస యుండలేదు. పరీక్షలోఁ గడతేరని నాఁడు నిశ్చింతగ జన్మము వదలవలయు నని నిశ్చయించుకొనియె. ఈపట్టుదలయే యతని యుద్యమమునకు సహకారి. అపు డపుడు సరళ కడనుండి వచ్చుచుండిన ప్రణయలేఖలుగూడ నతనికి భుజము దట్టుచుండెను. ఉద్యోగమున కుల్లాసమే కదా ముఖ్యము!

పరీక్షదినము లారంభమయ్యెను. విద్యార్థులహృదయములు సంచలింపసాగెను. సోమరులై చదువనివారు తమ కవమానము ఘటిల్లునని మునుముందుగ శీఘ్రబుద్ధిఁ జేసి, అనారోగ్య మను పేరుసఁ బరీక్షాశాల కరుగక తటస్థులగు చుండిరి. చక్కఁగ పాటుపడినవారు పరీక్ష యెపుడెపుడు వచ్చునోయని యుత్కంఠతో నెదురు సూచుచుండిరి. పరీక్ష యారంభింపఁబడెను.

ప్రథమదివస పరీక్షగడచెను. విద్యార్థులలో ననేకులమోములు తెల్లవాఱఁ జొచ్చెను. గ్రహచారమునకుఁ దోడుగ నాయేఁడు ప్రశ్నపత్రములుగూడ సులభముగ నుండలేదు. అనంతనాథునిహృదయమునఁగూడ నలుకు జనించెను. సందేహ మతని చిత్తసీమ నావరించె. స్థైర్య మల్లాడఁజొచ్చెను. ఊఁగాడు మనసుతో తన గదిఁ జొచ్చెను. ఇంచు మించుగ శూన్యహృదయుఁడై కురిచీపైఁ గూలఁబడియెను.

కాని యంతలో దైవ మతని నుద్ధరింప నెంచె- గాఁబోలు! ఒక సంతోషవార్త నంపెను. శుభసూచక మైనందున ధైర్యము ప్రొంగి మనసు కుదుటఁబడియెను. బెంగుళూరునగరమున నతనిమామ స్వామినాథుని కడనుండి వచ్చిన తంతీవార్త యది. అం దిట్లుండెను.

"సరళ సుతుని ప్రసవించి సుఖ మున్నది. పరీక్ష* ముగిసినంత తప్పక రమ్ము."

"స్వామినాథ సేన."

ఈవార్త చదివి అనంతనాథుఁ డెంత సంతసించి యుండఁడు? దైవము నెంత స్తుతించి యుండఁడు? అతని యుల్లాసమునకు సీమయే లేదు. తత్క్షణము మిత్రుల నందఱను తన్మందిరమునఁ జేర్చి వారికి విందొసంగెను. శక్తి కొలఁది బీదలకు దానము చేసెను. తలిదండ్రు లకుఁగూడ నీశుభవార్త నంపెను.

పరీక్షదినములు క్షణమువలెఁ గడచెను. సంతోషము సగము ప్రాణము గదా! కష్ట మేమిటను దోఁపలేదు. అతని నమ్మికలో పరీక్షాఫలమును తృప్తికరమే. అంతలో మరల బెంగుళూరినుండి యుత్తర మొకటి వచ్చెను. సరళకు కొన్ని దినములనుండి జ్వరమువచ్చుచుండి దేహము కృశించి బలహీన మైయున్న కారణమున గర్భమును పూర్ణముగ భరింపలేక యేడవనెలనే ప్రసవించెననియు, ప్రారంభమున నించుక భయముగ నుండినను మంచిమంచిమందుల నిచ్చుటఁ జేసి ఇపుడు భయములేదనియు, శిశువుతోడ సరళ యారోగ్యముగ నున్నదనియు, నాజాబునఁ దెలియవచ్చెను. సరళ కనారోగ్యమనుమాట చదివినపుడు అనంతనాథుని శరీరమాద్యంతముకంపము నొందెను. హృదయమున చలువలు మూసిన ట్లయ్యె. కాని లేఖ తుదముట్టఁ జదివి యతఁ డించుక నెమ్మది వడియెను. తనహృదయేశ్వరి కపుడపు డనారోగ్యముగ నున్న దనుట యతఁడే యెరుఁగును. ఆకారణమున నేడవ నెలలో ప్రసవమాయెనని యిపుడు వ్రాయఁబడి యుండె. ఇది తొలుదొల్త నాశ్చర్యముగఁ దోఁచెను. ఏడవనెలలో ప్రసవ మగునా? సరళ చెన్నపురికి వచ్చినదెపుడు? అతఁ డాలోచించెను. అది మే నెల. అనంతనాథుఁడు లెక్కించెను. మే—ఇది లెక్క

రాదు. జూన్, జూలై, ఆగష్టు, సెప్టంబరు, అక్టోబరు, నవంబరు, డిశంబరు, ఏడు నెల లైనవి. నిజము! అక్కటా ఉచితకాలము వఱకు గర్భభరమును సైఁపఁజాలుశక్తి సరళకు లేకుండును గదా! అయ్యో! అనారోగ్య వశమున నాయబల యెన్ని కష్టముల పాలయ్యెనో! ఆమె దేహ మెంత కృశించి యుండెనో! ఆతరుణుఁడు చాల చింతించెను. దుఃఖించెను. విషాదభరితుఁ డయ్యెను. కొంతతడవు పలు తెఱంగులఁ దలపోసి, "ఇంతకైన తల్లి పిల్ల సుఖముగ నున్నారు గదా! అంతే చాలును." అనుకొనియెను.

పాఠశాలలు మూయఁబడినవి. సెలవు దినములు వచ్చినవి. విద్యార్థు లందఱును పురము విడువసాఁగిరి. అనంతనాథుఁ డేమి చేయవలయును? కర్తవ్యము గోచరింపలేదు. చెన్నపురిలోనుండి తాను జేయఁదగిన కార్యమేదియుఁ గానరాదు. ఇంతవఱకున్న స్థితిలో నీవిరామకాలమున నిందేయుండ వలయు ననియు, పరీక్షాఫలము వెలువడు దాఁక బెంగుళూరి కరుగఁ జనదనియు స్థిరము చేసికొని యుండెను. కాని, ఇప్పటి బెంగుళూరివార్త యతనిమనసుఁ గలంచివైచినది. ఒక ప్రక్క నానందము. మఱియొకదెస నాత్మగౌరవము. క్షణక్షణమునను నిక్కుచు నహమహమికతో చెలరేఁగుచున్నవి. కాక, రోగగ్రస్తయగు సరళదర్శనోత్కంఠ యొకటి. అనంతనాథుఁ డితికర్తవ్యతామూఢుఁ డయ్యెను. ఇట్టి సమయమునఁగూడ రాత్రిగుండియ చేసి చూడఁ బోకున్నచో చూచువా రేమనరు? ప్రాణప్రియ సరళ యేమని తలంచును? లక్ష్మీకాంతుఁడైనఁ దన్నుతూలనాడకుండునా? ఇవన్నియునుండ నపుడు గాదిపు డాసుందరిని కన్నులారఁ గాంచవలయు నను నాస యతనికే జనించుచుండె. సుతునిముఖారవిందమును జూడ హృదయముగూడ తహతహపడుచుండెను. కాని నడుమ మాటిమాటికి స్వాభిమాన మొకటివచ్చి యాశాభంగముఁ జేయఁబూనుకొనియెను.

అనంతనాథునిచిత్త మనురణరంగమున నీరెండు తెగల భిన్నభావ ములకును ఘోరమగు సంకులసమరము సంప్రాప్తమయ్యెను. జయాప జయము లెవరి సొమ్ములును గావు. క్షణ మొకపక్షమున గెలుపు గాన వచ్చుచుండెను. విధియాజ్ఞ మీఱరానిది. తుదకు స్వాభిమానమే గెలి చెను. పట్టపరీక్షలో జయమొందుదాఁక బెంగుళూరు చేరనే రాదని యనంతనాథుఁడు కడసారి నిర్ధరించెను. తన కష్టముల నెల్లవివరింపుచు, సమయమున రాఁజాలమికై క్షమింపు మని తన మనోహారిణి కొక లేఖనుగూడ నతఁడు వ్రాసి యంపెను.

ఆహా! అతనిపట్టుదలయు, ఆత్మగౌరవమును, మనస్థైర్యమును ఎంతఘనములు! హృదయమును సంచలింపఁజేయుభావశతము లుద్రే కించినను, స్వాభిమానము కడకు పట్టినపట్టు సాధించితీఱెనది. అనుపమే యమైన యిట్టియుత్కంఠతోఁ జేరిన యుద్యోగమానఁగాక వట్టిగొంతెమ కోరికలతోఁ . మనుజునకు శ్లాఘాపాత్రమైన పర్యవసానమెయ్యది? ఇంద్రియనిగ్రహమున కింతకంటెఁ గొమ్ములుండునా? ఒకవేళ సరళ పైఁగల వ్యామోహచింత సడ్డుదెత్తురేమో? అసమంజసము. అందేమి తప్పు? పరధనపరాంగనాప్తికై యనంతనాథుఁడు పాటుపడుచుండలేదు గదా? ఎన్నఁడైన క్షణమాత్రమైన నట్టిభావమనంతనాథునికడఁ జేరుట మీ రెఱుంగుదురా? మొగమైనఁజూడని పరకాంత, యువతి, రూప వతి, యగు నిందిర యేకాంతమున తన్నుపచరించుచుండ నామెతో నతఁడెట్లువర్తించెను? మీ రెఱుఁగరా? అనురూప, అనుకూల, లావ ణ్యవతి, చతుర, తరుణి, విద్యావతి, సద్గుణశోభిత—యగు తన సహ ధర్మిణి, మనోహారిణి, తనపరోక్షమున, అందును రోగగ్రస్తయై, పరితపించుచున్నపుడు గూడ నామె నామస్మరణముఁ జేసిన పాపమా? కారవాదినరకము లెదురుచూచుచుండునా? ఇంతమాత్రము గూడ నోర్వనివారుందురేమో! ఉండిరి పో! వారీకలియుగమున, నీకర్మ

భూమిలో నుండ నసర్హులు! నిరంతర మడవులనుండి, వాతాంబుపర్ణాశనులై యూపిరి బిగఁబట్టి, ఇనుపకచ్చడాలగట్టిన మహార్షిమహాశయులే యేరంభయో, మేనకయో, తమముందు "తక్ధై" యన్న మాత్రాన, ఫలము ప్రత్యక్షమయ్యెనని, జపతములకు నూలు నీరు విడిచి, గంటుమూటఁగట్టఁబారవైచి వారివెంటఁ బడిపోవలేదా? అయినను వారింద్రియజేతలేకదా! అనంతనాథునియందుఁ గూడ మనము గుణమే గ్రహింతముగాక! ఇంచుకయు దోషములేని మనుజుఁడెవఁ డుండును? అత్రిగుణాతీతుం డొక్కండు దక్క!!

# ప్రణయసరణి

## ఇరువదవ ప్రకరణము.

జీవితోద్దేశము.

"భవతి హృదయహారీ కోపికస్యాపిహేతు
ర్నఖలు గుణవిశేషః ప్రేమబంధప్రయోగే"

[శార్ఙ్గధరపద్ధతి]

కడచిన యధ్యాయమునందలి యంశములు నడచి నేఁటికి దాదాఁపుగ మూఁడుమాసములు గావచ్చినవి. ప్రాతఃకాలము గడు మనోహరమై యొప్పారుచుండెను. నీలాకాశము చాలనిర్మలమై బాలసూర్యప్రభలదేదీప్యమాన మగుచుండెను. ప్రపంచము శాంతముగ నుండెను.

బెంగుళూరునగరమున మాధవశాస్త్రియింటివీథిలో వైదికుఁలును పుణ్యసతులును గుంపులు గుంపులుగ ధౌతవస్త్రముల ధరించి

యలంకరించికొని యేదోవిశేషమునకై యరుగుచుండిరి. వారందఱును మాధవశాస్త్రి యింటికే త్రోవతీసిరి.

ఇచ్చట నేఁడేమో విశేషముండవలయును ! అంగణమంతయు బచ్చగ నలికి చిత్రచిత్రముగఁ బిండిముగ్గులచే నలంకరింపఁ బడియున్నది. వాకిటఁ బచ్చని మామిడియాకులతోరణము కట్టఁబడినది. పసారాలోను లోపలను గూడ మంచి చిరుచాపలు పరువఁబడియున్నవి.

మాధవశాస్త్రి లోపలశాలలో ననుష్ఠానము తీర్చుకొని విభూతి రుద్రాక్షల ధరించి సాక్షాత్పరమశివుని మఱపించుచు నొక కృష్ణాజినమునఁ గూర్చుండి ముందు ముక్కాలిపీటపై నొక పుస్తకము నునిచికొని పారాయణము చేయుచుండెను. ఇది శ్రీమద్రామాయణమునందలి సుందరకాండము. అతఁడు సప్తమస్సర్గ పారాయణ మొనరించుచున్నవాఁడు. నేఁడు సంకల్పము ముగియునుగావునఁ శాంతిఁ జేయ నెంచి వైదికులను ముత్తైదువలను దాంబూలస్వీకారమునకై పిలచియుండెను. పిలువనివారిదే పాపముగాని, పిలుచువారున్నచో మనవారు ఆశాభంగ మెన్నఁడును జేయువారుగారు. వృద్ధులు, తరుణులు, బాలురు, బాలికలు, పుణ్యసతులు, పూర్వసుమంగలులు గూడ నీపుణ్యకార్యమునకు వేళ మీఱకవచ్చి క్రిక్కిరిసిరి. సుందరమ్మ వారినందఱ విచారించుచుఁ బరాకులోనుండెను.

గృహమంతయు నెంతయు శోభితముగ నుండెనుగాని యేమో కొంతకొఱఁతగ నుండెను. చుట్టుప్రక్కలవారెందఱున్నను మన పరిచితవస్తు వొకటియందుఁ గానరాదు. కమల కానరాకపోవుటచే నిల్లంతయు " బి " మ్మనుచుండెను.

పారాయణము యథావిధిగ నెరవేర్పఁబడియె. సరి. పూజాపునస్కారముల కేతక్కువయుఁ గలుగలేదు. పారాయణానంతరము పుస్తకముపై లాజలు పువ్వులు మంత్రాక్షతలును జల్లి, మాధవశాస్త్రి

క్షణమాత్రము కన్నులు మూసికొని యాద్వైతతత్త్వమును ధ్యానించి సంకల్పమును సాంగముగ ముగించెను. అందఱకును తాంబూలము ఫలము దక్షిణయు నియ్యఁబడెను. సుందరమ్మ ముత్తైదువలకెల్ల పసపు కుంకుమల నిచ్చి పూజించెను. వచ్చినపని యయినంత నందరును "పెళపెళ" మని యామందిరముఁ బాసిరి. వానవచ్చి నిలిచినట్లయ్యెను. ఉన్నవారి కింత యూపిరియాడ వీలు కలిగెను.

మాధవశాస్త్రి మంత్రాక్షతలను మంత్రోదకమును గొని గది లోపలికిఁ బోయెను. లోపల మంచముపై కమల రోగగ్రస్తయై శయనించి యుండెను.

"తల్లీ! తీర్థము దీసికో."

అనుచు మాధవశాస్త్రి యీఁబోఁగా కమల కృచ్ఛ్రముగ లేచి కూర్చుండి యది గ్రహించి యక్షతలు శిరమునఁదాల్చి మరల శయనించెను. మాధవశాస్త్రి తన యనుంగుబిడ్డకడ నొకమాఱు పూర్ణదృష్టితోఁ జూచి కన్నులనిండ నీరు పెట్టుకొని మాఱుమాటాడక వెడలి పోయెను.

కమల మంచముఁ బట్టి యించుమించు రెండుమూఁడునెలలు గావచ్చినవి. చిరకాలంబుగ నామె మనంబున నున్నరోగ మభివృద్ధిఁ జెందుచుండెను. ఆరోగమును గుదుర్పఁగలవైద్యుఁ డెవఁడు ? లోకమున 'తగిలిన కాలే తగులును' మనోరోగ మొక్కటియే చాలదని కాఁబోలు జ్వరముగూడ నెట్లో యామెదేహము నాశ్రయించి స్థాన మొనరించుకొనియె. దాని తోఁక వెంటనే కామిలాదులును వచ్చి చేరెను. అన్నియు చేరి తుదకు క్షయరోగముగఁ బరిణమింపసాఁగెను. దేహ మిపుడు చాలఁ గృశించినది. బలము క్షీణించినది. శ్వాసాది చిహ్నములు ప్రబలించినవి. పాపము!

కట్టా! కమల తన జననీజనకుల కేకపుత్రి. వారి హృదయ వ్యథకు పారమే కానరాదు. సంసార విచ్ఛిత్తిగలిగి నిరంతరసుఖ దూరయై, యపారదుఃఖమగ్నయై కట్టెదురనున్న తమ బిడ్డప్రాప్తికై చింతించి చింతించి వారిహృదయములు పరితాపముననిండియుండెను. పైనవారికీదుఃఖము! ఎట్లుభరింపఁగలరు? పోనీ బ్రతికిమాత్రమేమి సుఖము బొందఁగలదని తలఁచి కొన్నినాళ్ళు మందేమియు నిప్పింపరైరి కాని యీశ్మశానవైరాగ్యములు కన్నకడుపులవద్దఁ బనికివచ్చునా? "ఏమో! "జీవన్భద్రాణిపశ్యతి" ఇఁకముందెన్నఁడైన మేలుగలుగరాదా? కడకు పచ్చగ లక్ష్మిదేవివలె నెదుటనుండినను జాలును." అనుకొని యాత్రమున మందులిప్పింప మొదలు చేసిరి. ఉన్నదొక్కబిడ్డ. ఆమె యారోగ్యమున కేమివెచ్చించినను వ్యర్థము గాదుగదా! ఉత్తమోత్తమములగు మందులను జేయించి, తెప్పించి, యీసాఁగిరి. వాఁడు గాదు వీఁడని "వైద్యరాజులు, భిషగ్రత్నములు" పలువురు మార్చి మార్చి మందుల నొసంగిరి. అలసిరి. వసంతకుసుమాకరము, పరిపూర్ణమకరధ్వజము మొదలగు విలువగల యౌషధములెన్నియో కమలకడుపుఁ జేరినవి. బూడిదలో వేల్చినట్లు అవి యేమూలఁబడెనోగాని గుణము నింతయుఁ జూపవయ్యెను. మందులప్రభావముగానిచో కమల యీవఱకు నామమాత్రావశేషయయి యుండునని వైద్యులు ధైర్యము జెప్పుచు నూతనౌషధముల నియ్యసాగిరి. మైసూరుమహారాజుగారి కనియు, అయోధ్యబీగములకనియు, జాంనగర్ రాజాగారికనియు, తయారుచేయఁబడిన యౌషధములు గూడ కమల రుగ్ణతను మాన్పలేవయ్యెను.

ఈలోపల నొక జ్యోతిషికమణి కమల జాతకమును జూచి, "ఈమెకిపుడు శని చాలకున్నాఁడు. ఇదియుఁగాక పదునెనిమిదవ యేఁట నొక గండము గూడఁ గలదు. కాని శుభదృష్టి యుండుట

నది తొలఁగును. తరువాత శుభముగూడఁ గలుగును. గ్రహబాధ గావున జపహోమపారాయణాదులఁ జేయింపుడు” అని మాధవశాస్త్రి కుపదేశించెను. కన్నకూతు నారోగ్యమునకై యతఁడేమిటను వెనుదీయ డయ్యె. శక్తి కొలఁదిగ నవగ్రహదానము లొసంగి సుందరకాండసప్తమస్సర్గ పారాయణముఁ జేయసాగెను, ఆవిధిగూడ నేఁడు ముగిసినది. కాని ఫలమింకను ముందు చూడవలసియున్నది.

కమలగూడ నూరకుండలేదు. తాను నొక „పంచాక్షరీ” మంత్రమును జపించుచున్నది. జాగ్రదవస్థలో మాత్రమేగాదు; స్వప్నమందును! ఈమంత్రము సర్వోత్కృష్టమని యామె భావము. అట్టిదేది? శివపంచాక్షరీయా? కాదు. ఆమెకింకను అంతవేదాంతము ముదిరియుండలేదు. ఆమె మంత్ర మేకల్పమునందును జెప్పఁబడినది గాదు. స్వకల్పితము. మానసజనితము. „అనంతనాథ” ఈపంచాక్షరి యాశతోనే యామె జీవింపఁ గోరుట.

కమలకేమి పిచ్చియా? ఇన్ని నాళ్ళుగను దాను చచ్చినదియు బ్రదికినదియు విచారింపని నిష్కరుణహృదయుఁడగు నాయనంతనాథునికై యింతచింతయేల? ఎంతప్రేమించినను, ఎంతచింతించినను, అతఁడు తన ప్రక్కఁ దిరిగిచూడఁగలఁడను నాశగలదా? లేదే! ఇఁక జీవించి యేమిసుఖ మనుభవింపఁగలదు? హాయిగ కన్నులుమూసికొనరాదా? మందులేల? మంత్రములేల? మాకులేల ?

చదువరులారా! కమల యనంతనాథునేల ప్రేమింప వలయు నని మమ్ము ప్రశ్నించుటకన్న నాయమ హృదయమందున్న ప్రేమనే ప్రశ్నింతురేని సదుత్తరము లభించునేమో! దానిమార్గము లనంతములు. తనప్రేమకుఁ బ్రతిప్రేమ మీయకున్నచో నావస్తువును బ్రేమింపనేరాదని నిర్బంధముకల్గించుటకు మన కేయధికారమును లేదు. ఇఁకజీవింపనేల యందురో! తలఁచిచూడుఁడు. ప్రాణులకుజీవితమునకన్న

వేరెద్దితీపు? ఎట్టికష్టము లనుభవించుచున్ననేమి ? జీవితముపై నాశ యొవని కుండదు ? దుర్భరమైన దుఃఖవేగమునఁబడి కర్తవ్యజ్ఞానము నశించినపుడు అయ్యో! దైవమా! ఈబ్రదుకుకన్న మరణము మేలు'' అని వాపోవువారుందురుగాని, వాస్తవముగ నట్టిస్థిరబుద్ధి యేమహాత్మునకుండఁగలదు? దేహమశాశ్వతము. జలబుద్బుదప్రాయము. దానిపై నాశయసంగతము. జీర్ణవస్త్రమువలె నద్దానిని విడనాడవలయు ! '' నని యుపదేశించు శ్రీకృష్ణులెందఱున్నను, విను నరులసంఖ్య యీకాలమున నెంత యల్పము ! విని యాచరించువా రెందఱైనఁ గలరా ? ,, నహి '' యన్నను నిజమునకు దూరముగాదని యూనమ్మకము. మరియొక్కమాట! ఆయుపదేష్టలనే తమయుపదేశసారమును స్వానుభవగోచరముగఁ జేసి చూపుఁడన్నచో నపుడుగదా తత్త్వజ్ఞానము బైటఁబడును. నిజము, నిలుకడ, తుదమొదలు లేనివాదముల కేమి? అయినను జనులు తెలిసియో తెలియకయో పలుమారిట్టి వైరాగ్యపు దలంపులకుఁ దావిచ్చుచుండుట చాలనాశ్చర్యము. ఒకవేళ సహజమేమో?

ప్రారంభమున ననంతనాథుని ద్వితీయవివాహవార్త విన్నపుడు కమలకు గూడ నిట్టివేదాంతమే తగిలెను. వీరపతివ్రతలవలె లేక మానవతులవలె తత్క్షణమే తనప్రాణవాయువులను ,, ఉఫ్ '' అని యూఁదివేయఁదలఁపుగలిగెను. కానికమల చాలప్రజ్ఞావతియు, ప్రత్యుత్పన్నమతియును. ,, పరమునమాత్రము మోక్షము తనకై తలుపులఁ దెఱచుకొని కాచియుండునా?'' యనియామెయాలోచించెను. నిజము. ఇంటగెలచిగదా రచ్చలో! మరల నాశజనించెను. ప్రథమసంకల్పమును వదలి మనసు నామె దృఢపఱచుకొనెను. కాలానుగుణముగ శాశ్వతమైన మనోవ్యథకు పలుమారు చిత్తమున చోటియ్యవలసియున్నను, జీవితముపై మాత్రమామె యాశవదలుకొనలేదు. ఆకారణమున నిపుడుగూడ నామె తనయనారోగ్యమునకై చాలచింతించుచు

జాగరూకయై యుండెను. కాని ఫలమెవరి యత్నమునందులేదుగదా. రోగము వచ్చునపుడు చెప్పిరాదు. ఇక ఏమున్నవ్వ మాత్రమునం బోవునా?

ఒకనాటి సాయంకాలమున కమల మంచముపైఁ బరుండి యుండఁగా, రుక్మిణి చేతనొకవార్తాపత్రిక పట్టుకొని యాగదిలోఁ బ్రవేశించెను.

“కమలా!”

కన్నులు దెఱచి కమల “రా. కూర్చుండుము.” అనియెను.

“నిద్రించు చుంటివా?”

“లేదు. రమ్ము.”

“ఎంత నిర్భాగ్యురాలవే కమలా నీవు!” అనుచు రుక్మిణి చెంతఁ గూర్చుండెను.

“ఏల?”

“నీపతి పట్టపరీక్షలోఁ గృతార్థుఁడైనాఁడఁట!”

ఆత్రముగ కమల “ఎవరు చెప్పిరే?” యని యడిగెను.

“పాఠశాలలో నాజతకత్తెలతో మున్నుందుగఁ జెప్పి విచారించితిని. పత్రికలోఁగూడఁ జూచితిని. నిజమే.”

కమల కన్నులు మూసికొని క్షణము ధ్యానించి లేవఁజూచెను కాని శ్వాస మధికముగ నుండెను.

“రుక్కూ!” అనిరుక్మిణిమూఁపుపై చేయివైచి “నేను చాల ధన్యను” రుక్మిణి కామాటవిని యాశ్చర్యమును విషాదమును గలిగెను.

“ఏమిధన్యవే! అంగడిలోఅష్టభాగ్యములు! నీకువచ్చిన దేమి?”

“ఏమి రావలయును?”

“నీవైరాగ్యము నీకే తెలియును! ఎందుకు బ్రతుకుచున్నావో నిన్ను జూచిన పట్టరాని దుఃఖము వచ్చుచున్నది!”

"ఎందుకా? నేఁడు చెప్పెద. వినుము."

అనుచు నించుక చిరునవ్వుదోఁపఁ గమల మరలఁ బలికెను.

"రుక్మిణీ! అమూల్యమైన యీ దేహ మున్నంతవఱకును మన మేమైన కోరఁగల్గుదుము. భగవత్కృప యున్నచో కోర్కెలో శతాంశమైనఁ బొందఁ గలుదుము. తరువాత మనచే నేమగును? ఈజన్మమున నేను నాపతిదయకు పాత్రముగాఁగల నను నమ్మకము లేదని యొప్పుకొందును. దేహము వదలినచో మాత్రముకాఁగలనా? అట్టి నిర్దయగల వారిపై నీకెందు కింత ప్రాణ మని మీ రందఱు నన్న నెదరు. కాని యిది నాస్వభావము. ప్రాణము లున్న నెన్నఁటికైన మేలు గల్గరాదా! వలదు పో! నన్నెంత యనాదరించినను, నిరాకరించినను, నాపతికన్న ప్రియ మగువస్తు వేదియు నా కీప్రపంచమునఁ గానరాదు. బ్రతికియున్నచో నాప్రేమకును జన్మమునకును ఫలముగ నెన్నఁడైన నతనికి హితముచేయుభాగ్యము నాశింపఁ గలను. నేను జీవింపఁగోరుట యిందుకు! నాహృదయమున నెట్టియాశ లున్నవో వెల్లడించు శక్తి నాకిపుడు లేదు."

"అక్కా! నీయోర్పు నెంత కొనియాడినను దీఱదు. ఈప్రాయమున నిట్టిశాంతము నీ కుండుట చాల నరుదు."

చదువరులారా! నిజముగ నాశ్చర్యమే కాని యస్వాభావికముగాదు. కమల కీవైరాగ్యము నేమతాచార్యులును బోధించియుండ లేదు. ఒకవేళ బోధించినను వచ్చునదికాదు. మఱి శుద్ధమైన యవ్యాజప్రేమమే యామె కుపదేశ గురువు.

క్షణమాత్రము నిశ్చలమగు దృష్టితో నారోగ్యగ్రస్త ముఖము వంకఁ దిలకించి రుక్మిణి బాష్పార్ద్రములగు కన్నులఁ దుడిచికొనియెను.

"అయ్యో! నీయట్టి భార్యను నిరాకరించుటకు కతఁ డెంత నిర్భాగ్యుఁడే!"

"అట్లనకుము. నాయెడ నాపతికి ద్వేషముండు ననుకొంటివి గాఁబోలు. నిరాకరణమునకు కారణము వేఱుగలదు. లోకము భిన్న రుచి. మనోభావము లనంతములు. ప్రేమకు మార్గములు పెక్కులు. కులశీలరూపాదులు ప్రేమకు ముఖ్యములే యైనను కారణములు గావు. కారణము లైనచో నది తృష్ణగాని ప్రేమయనఁబడదు. ప్రేమ చాలనిర్మలము. దైవికము. రుక్మా! అనుభవముపై నిందలి సత్య మెఱుంగ గలవు."

రుక్మిణి నిర్వారగంది ప్రతి పలుక నేరనిదయ్యె. ఆబాల హృద యాంతరాళమున నూతన ప్రకాశ మంకురించెను. కమలపై నాబాలి కుఁగల యవ్యాజప్రేమ మినుమడించెను.

# ప్రణయసరణి

## ఇరువదియొకండవ ప్రకరణము.

—:o:—

సరససల్లాపములు.

"కిమపి కిమపి మన్దం మన్ద మాసక్తియోగా
దవిరళిత కపోలం జల్పతో రక్రమేణ,
అశిథిలపరిరమ్భవ్యాపృతైకైకదోష్ణో
రవిదితగతయామా రాత్రిరేవ వ్యరంసీత్."

[భవభూతి. ఉత్తరరామచరిత అం ౧.]

చైత్రశుద్ధ ద్వాదశి నేఁడు. రాత్రి చాలరమణీయము. ఆకా శము మేఘావృతముగాక నిర్మలమై యవ్యక్తకాంతులఁ బఱపుచుం డెను. చంద్రబింబము గగనసౌధము నెక్కి నిక్కుచుఁ దనరాజతదీ ప్తుల దిగంతరాళముల వెదఁజల్లుచు దేశమెల్ల దేదీప్యమానముగ నొనరింపసాఁగెను. గృహములు, కుడ్యములు, సౌధములు, వృక్షలతా

దులు, ఆరామసీమలు మున్నగునవి యన్నియు నాచంద్రికాసాంద్ర తరంగములలోఁ దళతళలాడుచుఁ గనులపండుగుఁ జేయుచుండెను. ఆరామసీమలలో నపుడపుడ వికసించుచున్న పండుమల్లియల ఘ్రాణహారిసౌరభమును మూర్కొని మందమారుతములు సంచరించుచు ననుభవించువారి జీవితములఁ జరితార్థములఁ జేయఁదొడఁగెను. సర్వము నానందమయము! సర్వమును భావోద్దీపకము!! సర్వమును ప్రకాశతరంగితము!!! మానవుల హృదయము లెల్ల చల్లఁబడియె. యోగులు వియోగులు, పండితులు, పామరులు, బాలురు, వృద్ధులు, వారు వీరనక యెల్లవారును మనంబుల నాహ్లాదమందిరి. లోకమోహనమైన యారాత్రియం దెవఁడు దుఃఖ మను మాట తలఁపోయఁ గలఁడు?

రాత్రి పదిగడియలు మీఱుచుండెను. సరళ యొంటరిగఁ దన శయనగృహమున మంచముపై శయ్యాతలము నధిష్ఠించి యుండెను. ప్రక్క నొకపట్టుమెత్తపై నామెచిన్నకుమారుఁడు కరపాదములు గదలించుకొనుచు కాచగోళములో వెలుఁగుచున్న ప్రదీపకళికను జూచి యఖండ మగు నానంద మనుభవించుచు నిరాలోచనగ నాడుచుండెను. నిజము! ఆనందమన్న నదియే గదా! ప్రపంచసంసారము నందలి పలుదెఱఁగులగు కష్టసుఖముల నేమియు నెఱుఁగని యాయానందము మన కెంతతపసుచేసిన నేఁడు లభించును? అప్పటి శాంతియు, నాయాత్మశుద్ధియు నేతపస్సిద్ధునికిఁ గలదు?

అపుడపుడు తన యాత్మభవుని మోముఁగాంచుచు నిర్భరానందమును బొందుచు సరళ తనలో నేమో యాలోచించుచుండెను. రాజమార్గమున నేదేని శకటమో జట్కాయో పోవు చప్పుడు వినవచ్చినంత వాతాయనమునఁ దిలకించుచు నది భవనద్వారముదాఁటినంత మరలి యాసీనురాలగుచుండెను. కొంతవఱకు కట్టుండి గడియారము వంకఁ జూడఁగా పదిన్నర గంటలు కావచ్చినవి.

"సరి. వేళమీరినది." అని యనుకొని యాసుందరి శయనింప నెంచి తలుపులు బిగించి శయ్యం జేరెను. శిశు వపుడు మూల్గసాగెను. వాని నెత్తికొని స్తన్యము నొసంగి యొడిలోనిడుకొని కొంతతడవు వానితో నర్థము లేనిమాట లాడఁజొచ్చెను. తరువాత నవ్యాజవాత్సల్యమున నాకందను ముద్దులనించుచు తన భాగ్యమునకు మేరయే లేదని తలపోసెను.

శిశువును బరుండఁబెట్టి యేమోయోచించి దిగ్గనలేచెను. కరపేటికనెత్తి యందున్నలేఖ నొకచేతఁబట్టుకొని వ్రాఁతబల్లకడ కేఁగియది విచ్చి లోలోన చదువుకొనెను. కొంతవఱకాపని ముగించి లేఖనసామగ్రుల నందుకొని తానును వ్రాయఁదొడఁగెను. యథావకాశముగ నాలోచించి వ్రాసి యా రెండులేఖలఁ గైకొని మరల శయ్యఁజేరి యానందమయమగు నిద్రాసుఖము ననుభవించుచున్న చిన్నకుమారుని నగుమోమునుగాంచి "నిద్రలోఁగూడనీకుమందహాసమా?" యని మెల్లనముద్దిడి తొట్టిలోఁబరుండబెట్టి తానునుమంచముపైఁబరుండెను. కొంతవడికి మరల నాలేఖలవిప్పిచూడ నారంభించెను. ఆలేఖలందలి యంశము లేవియోగాని యాతన్వికవి యపూర్వమనోహర్షము నొసంగఁజాలినవి.

బయటి తలుపునెవరో తట్టినట్లు చప్పుడు వినవచ్చెను. తటాలున నావంకఁ జూచి సరళ,

"ఎవరు?" అనియెను.

"నేను! తలుపుతీయుఁడు" అనిమెల్లన బదులువచ్చెను.

తనదాసి లక్ష్మిస్వరమని గుర్తెఱిఁగి చేతిలేఖల నందువిడిచి లేచి సరళ తలుపోరగాఁ దీసి,

"లక్ష్మి!" అనియెను.

"నేనే! యజమానులవారు వచ్చుచున్నారు!"

“ ఆ ! ఎక్కడ ? ”

“ అదో ! మేడనెక్కివచ్చుచున్నారు ”

అనుచు లక్ష్మి వెనుదిరిగి చూచెను. ఆవల శాలలో ననంత నాథుఁడభిముఖముగ వచ్చుచుండెను. లజ్జాసంభ్రమాదిభావశతములు మనమున ముప్పిరిగొన సరళ “ నీవుపొమ్మ ! ” అని దాసికి అనుజ్ఞ యొసంగి గదిఁ బ్రవేశించెను. శయ్యపై మునుపుదాసుంచిన రెండులేఖ లామెకు దృగ్గోచరములయ్యెను. నూతనభావ మొకటి మనమున నుద యించెను. లజ్జచేఁ గాఁబోలు సరళ యాత్రమున నాలేఖలనెత్తి మెత్త క్రింద దాఁచెను.

అనంతనాథుఁ డంతలో నాగదిఁ జొచ్చెను. తనపాలిటి భాగ్య రాశిం బోలు నాతరుణిని గాంచినంత నాతరుణుఁడు మోమున మంద హాసకళ లంకురింపఁగాఁ బల్కెను.

“ సరళాదేవిగారికి కుశలమా ? ”

సరళ యానందపారవశ్యమునఁ గాఁబోలు మాటాడఁ జాల దయ్యె. చేరవచ్చుచున్న నాథునిపై నొకసారి తీక్ష్ణదృష్టిఁబరపి యవ నతముఖియై నిలువఁబడియెను. ఆసరసుఁడును నవ్వుచుఁ బరిరంభణ కుతూహలుఁడై సమీపించి “—ఏమి ! కోపమా ” యనుచు నా సుందరిని కౌఁగలించుకొనియెను. సరళయుత్తరక్షణముననాతని పట్టువద లించుకొని భర్తశయ్యపైఁ గూర్చుండఁగా ప్రక్కలో నిలువంబడి యతనిఁ జూచుచు—

“ బండివచ్చి చాలసేపాయెనే ? ” యని పలికెను.

నిలుచున్నసరళను చేయిపట్టి ప్రక్కఁ గూర్చుండఁబెట్టికొని యనంతనాథుఁ డిట్లని ప్రతియిచ్చెను.

“ అవును ! నాతోఁగూడ వచ్చినమిత్రుఁడు భోజనమునకై నిర్బంధమున నన్ను తనయింటికిఁ బిలుచుకొనిపోయెను. విధిలేక పోవలసి వచ్చెను. అందుచే నింత విళంబమైనది ”

“ ఈవఱకు నేనును ఎదురు చూచుచుండి వేళ మీరినందున నేఁడు రారుగాఁబోలు ననుకొని యొకజాబుగూడవ్రాసి యింతకు మును పే శయనముఁ జేరితిని. ”

“ ప్రేయసికరము కరమున గీలించి యనంతుఁ డిట్లువల్కెను.

“ రేపు వత్తుననిగదా నేను వ్రాసినది? పోనీ! దేహమున నారోగ్యమేగదా ! ”

“ నాయారోగ్యముచింత మీ కేల? ” సరళ నాథునివంక తీక్ష్ణముగఁ గటాక్షించెను. అనంతనాథుఁడు చిరునగవుతో,

“ అదేమి ? ” యనియడిగెను.

“ అంతదయయుండఁబట్టికదా యింత శీఘ్రముగవచ్చినది. ”

అనంతనాథుఁడు నవ్వుచు,

“ సరళా ! రెండేండ్లు కావచ్చినవే, నాతలిదండ్రులను జూడక ! నేనటపోవుట తప్పా ? పోనిమ్ము. క్షమాపణ వేఁడుకొందును ”

అనుచు మనసుప్పొంగ నారమణిని తన రెండుచేతులనెత్తి పలుమారు ముద్దాడుచు,

“ సరళా ! ఇంతకన్న వేఱువ్యాసంగమే లేదందువా ? ”

యనుచు స్మితమొనరించెను. సరళగూడ నవ్వునాఁపలేక,

“ అవును ! మరలఁ గోపగించుకొని యొక సంవత్సరము పోవచ్చును ! ”

అనుచు లేచి పరుండియున్న శిశువువంక నీక్షించెను. అర్భకుఁడును అప్పుడే కన్నులువిచ్చి కదలుచుండెను.

“ అంతలో నిద్రచాలునా ? ” యనుచు, సరళ, సుతునెత్తికొని యాడించుచు నాథునికడకుఁ గొనివచ్చెను.

ఇదంతయు నొకనెపము ! తరుణీ జనసహజమైన మహేంద్ర జాలము ! పురుషవశీకరణ మంత్రము ! ! సుతు నాడించు కోర్కెకన్న

నాథునకుఁ జూపించుకోర్కె యే సరళకు ప్రధానము ! ! !

“ నిర్భాగ్యుఁడు! ” శిశువును రెండుచేతుల నెత్తి చూపుచు సరళ “ యెక్కడిదో క్రొత్త పోలిక ! ” అనుచు చిరునగవుతో నాథునిం జూచెను. శిశుహస్తమును ముద్దాడుచు జనకుఁడు,

“ ఎట్లున్న నేమి ? చిరాయువుగ బ్రదుకనిమ్ము ” అనియెను.

ఆనాఁడా దంపతుల యానందప్రవాహపూరము మేరయెఱుంగదు. అనంతనాథునికనులు సుతునిప్రథమదర్శనముచే చరితార్థములయ్యె. అనిమేషముదాఁక మునుపెన్నఁడు నెఱుఁగని నూతనభావమొకటి యతని హృదయాలవాలమున నంకురించెను. వాత్సల్యరసము జేసి చిత్తమార్ద్రమయ్యెను. ఈవఱకా నూతనభావ మెందుండెనో, ఇపుడు తనంత నెట్లు ఎక్కడనుండి, యుదయించెనో యనంతనాథుఁడూహింప నేరఁడయ్యెను. నిక్కము ! దైవమాయ యిట్టిదే !

ఆతరుణులిరువురును చిరకాల వియోగావసాన సహజములగు నర్మాలాపములను, తనూభవదర్శన జనితానందవిలాసములను, చాల తడవు వినోదగోష్ఠి ననుభవించిరి. ప్రస్తావవశమున సరళాదేవి నాథుని వంకఁ జూచుచు,

“ అనారోగ్యసమయమునఁ గూడ రానైతినని నాపై నపుడు కోపించియుందురుగద ! ” అనియెను.

“ నీకుఁగూడ నపుడారోగ్యముగా నుండలేదుగదా ! రాకున్న నేమి ? నీయనుగ్రహమున నేయుపచారములు నాకుకొఱఁతపడలేదు.”

అనునంతలో నిందిరమాట నాలుకతుదకువచ్చెను గాని, యామెకోసంగిన వాగ్దానము జ్ఞప్తికిరాఁగా నావిషయమువిడిచి యనంతనాథుఁడు మరలననియెను.

“ నాజననీజనకులు సమయమునకు వచ్చినందున నేనాగండమును దాఁటితిని. లేకున్న చాలఁ గష్టములపాలై యుందును ”

"సందేహామా! రాఁదలఁచి యెంతో ప్రయత్నించితినిగాని యిచ్చట నందఱు వలదు నిదానింతమనిరి. నాహృదయ మెట్లుండెనో నాయాత్మ యొకటి యెఱుఁగును! నాయదృష్టవశమున మరల మిమ్ముఁ జూడఁగల్గితిని." సరళ కన్నీరు నించెను. ఆమెకన్నులఁ దుడుచుచు వసంతుఁడు,

"నాప్రాణపదమా! నీస్వభావము నాకుఁ దెలియదా? చింతింపకుము. నీప్రేమయే నాకుఁబదివేలు!"

అనుచు జాయ నోదార్చెను.

నాఁటిరాత్రి వారు నిద్రించుతరికి ప్రక్కబల్లపైనున్న గడియారము "రింగు రింగు" మని రెండు గంటలుకొట్టెను.

---

# ప్రణయసరణి

## ఇరువదిరెండవ ప్రకరణము.

—:o:—

"కల్పవృక్షకోటరమునఁ గాల సర్పము"

"శ్రుతా సీత్వం ధారా త్పరిమళముపాఘ్రాయ మరుతా
సమాయాసీదస్మిన్ మధురమధులోభా న్మధుకరః
పరో దూరే లాభః కుపితఫణినః శ్చన్దనతరోః
పునర్జీవిన్యాయా ద్యదితదిహ లాభో యమతులః"

[ప్రాచీనసుభాషితము.]

విధిబలమును మించిన దేదియు లేదు. తదాజ్ఞ గడవ నేరితరము గాదు. ఆసర్వాంతర్యామియె విధిని మీఱఁజాలఁడని, లేక మీఱఁడని, మనవారి మతము! ఇఁక మానవుల మాటలేల?

ఉన్నట్టుండి మన యనంతనాథున కొక కష్టము ప్రాప్తించెను. అతఁ డొక దుష్కరమైన యతిదూర ప్రయాణ మాచరింపవలసి వచ్చినది. వాహనాది సౌకర్యములుగూడ లభింపలేదు. ధీరుఁడుగాన వెనుదీయక ప్రయాణ మాచరించెను. తన గమ్యస్థాన మిది యని కాని, ప్రయాణోద్దేశ మిట్టిదని కాని యతఁడే యెఱుఁగడు. మన మెట్లెఱుఁగఁ గలము? ఏకాకియై యతఁడు దారి సాఁగించెను. రాను రాను నిర్జనగహనప్రదేశమున నతఁడు పోవలసివచ్చెను. పోవఁబోవ మార్గము చాల భయంకర మగుచున్నది. కొంతతడవున కాప్రదేశ మంతయు మరుభూమి యయ్యె. ఏప్రక్కఁ జూచినను ఇంచుకంతైన నీడ గానరాదు. తరులతాదిగంధవిహీనము. సికతామయము. మహాసము ద్రముంబోలి చుట్టునావరించియున్న యాయెడారిలో ననంతనాథుఁడు నడువ సాగెను. ఎంతదూర మరిగినను ఎడారికిఁగాని ప్రయాణమునకుఁ గాని మేర యగుపడ దయ్యెను. ఒకటివెనుక నొక్కటిగ సికతా తరంగములు పొడచూపుచుండెను. ఇట్టి మరుస్థల మెందుండి వచ్చెను? అనంతనాథునికే యిది గోచరింపలేదు.

మట్ట మధ్యాహ్నము! అందును గ్రీష్మర్తువు! మార్తాండ మండల మతి ప్రచండమై యాకసము నడుమనుండి యగ్నిజ్వాలలు గురియుచుండెను. పిడుగులఁ జల్లుచుండె నన్నను ఆక్షేపణయుండదు! తీవ్రమైన ఝంఝామారుతముగూడ నందుకు తోడై యనంతనాథు నిపై నగ్నితునకలఁబోలు సికతాకణంబుల వర్షింపసాఁగెను. ఏమి కర్మము! అనంతనాథుని తల దిమ్మువట్టెను. తాపమగ్గలమయ్యెను. భరింపరాని యావేఁడిమిచే దృష్టి పచ్చన గాఁజొచ్చెను. దేహము శుష్కించెను. నాలుక పిడుచగట్టికొనియెను. శోష పొడమెను. నీరు కన్నీ రయ్యెను. తుదకుఁ జల దాఁచుకొనుటకు చేరెఁడు నీడ యెందైన లభించునేమో యని కనుమేర దాఁటువఱకును దృష్టిసారించెను. నిష్ఫ

లము ! కట్టా ! ముందుగతి ? పారమెఱుఁగని యాయెడారిని దలఁచి తలఁచి యతని మనసే యెడారి కాఁజొచ్చె. మరల నీడకై చుట్టును దిలకించెను. సవ్యపార్శ్వమున మార్గమున కొక్కింతదూరమునఁ నొక చిన్న చెట్టగపడియె. ఈగహనముఁ బ్రవేశింపక మున్నతనికి హితైషులు కొంద ఱావృక్షము తియ్యమామిడి యనియు, దానికడ నిలిచి సేదఁ దీర్చుకొనుట మేలనియు, నతని కుపదేశించి యుండిరి. కాని యీచెట్టు చాల చిన్నది. ఇంకను చిగిరించుచుండెను. నీడ యతిస్వల్పము. ఆప్రాంతమున వేఱు వృక్షము లుండకపో వనుకొని మరల చుట్టును జూచెను. మార్గమున ముందు నిర్మల నీలజలవాహిని యగునదియు, దాని గట్టున గొప్పతోపును గానవచ్చెను. ,,ప్రయాసలో ప్రయాస ! క్షణకాలమోర్చి నడచినచోఁ గష్టమెల్లఁ దీరును. ఈముష్టియేమి ?'' అనుకొని నడువసాఁగెను. అనుకొన్నంత సమీపమునఁ గాక యాప్రదేశము చాలదూరమున నుండెను. పోయిన కొలఁదిగ నదియుఁ ముందు నకుఁబోవుచుండెను. క్షణక్షణమునకును దాపమతిశయించుచువచ్చెను. అంతలో నొకసిద్ధుఁ డనంతనాథునికడ కరుగుదెంచి ,,మిత్రుఁడా ! నావెంట రమ్మా ! నిన్నుఁ గల్పవృక్షముకడకుఁ గొనిపోయెదను ! అందు నీకష్టము లెల్లఁదీరఁగలవు.'' అని పల్కెను. ఆశను జయించిన మహనీయుఁ డెవఁడు ? కల్పవృక్షముపేరు విన్నతోడనే యనంతనాథునకు నాల్గు భుజము లయ్యెను. మాఱు మాటాడక ,,చిత్త'' మని యాసిద్ధుని వెంబడించెను.

ఆసికతాద్రులలో నొక్కగుహ. అది కడురమ్యము. రామాయణములోని ,,స్వయంప్రభా గుహ'' వంటిది. భూభాగమంతయు స్వర్ణమయము. అచ్చటి గులకరా లన్నియు రత్నాలపలుకులే. అనంతనాథుఁడు గుహఁ బ్రవేశించి యక్కజమంద సాఁగెను. లోపల నొక వృక్షరాజము. ఆహా! వానిహృదయము చల్లనయ్యెను. కన్నులు

పండెను. ఏమి యావృక్షవైభవము! కాండములు స్వర్ణమయములు!! పత్రము లన్నియు గరుడపచ్చలప్రోవులు!! పుష్పము లన్నియు హీరమణిస్వరూపములు!!! పూవుపూవునుండియు నమృతమయమగు మరందధార స్రవించుచుండెను!!!

'ఇదంతయు స్వప్నమైయుండునా' యను సందేహ మొక్క క్షణ మాతని హృదయమున తలసూపెను. కాని యాయూహకు దగిన యాధారము లెవ్వియుఁ గానరావు. కనులారఁ జూచుచు ననుభవించుచున్నపుడు స్వప్నమెట్లు? నిజమే యని నిర్ణయించి యత్యాతురుఁడై యానంద సంభ్రమములు కుత్తుకబంటులై తన్నలయించుచుండ ననంతనాథుఁడు దూరమునుండియే పరుగెత్తికొని పోయి, యాకల్పవృక్షపు నీడనున్న మణివితర్దినై,

"ధన్యుఁడను. జన్మము నేడు సార్థకము."

అనుకొనుచుఁ గూలఁబడియెను. నీడఁజేరక మునుపే తాపము శాంతించెను. మకరంద మాస్వాదింపకయే దాహమడఁగెను. క్షుద్బాధ మందుకుఁగూడ లేదయ్యె. ఇంతియకాదు. సర్వమనోరథములును స్మరణమాత్రమునఁ బరిపూర్ణములగుచు వచ్చెను. ఆకరుణుఁడు తన్ను తా మఱచెను. ప్రయాణముమాట జ్ఞప్తికి రాలేదు. తనవారిని దలంపలేదు. వాని యూహాలో నట్టిదే బ్రహ్మానందము! బొందితో రివ్వన కైలాసమునకో వైకుంఠమునకో పోయిన యోగీంద్రునకునైన నట్టి సుఖము నట్టి యానందము నుండవు!!

అతఁడిట్లు తలపోయసాగెను.

"జను లెంత మూర్ఖులు! పాలఁబడినదే పంచామృతమని తలంచి కూపమండూకములవలె "విధి విధి" యని భ్రమింతురు. నేఁడు వారి మాటవిని నే నామామిడిమోటుకడనే నిల్చియుంటినేని, నాకీ కల్పవృక్ష మెందులభించుచుండెను! పురుషప్రయత్నమునకు ఫలము త

ప్పక లభించుననుట కిదియొక నిదర్శనము. ”

కొంతతడవున కతఁడు నిద్రింపఁగోరెను. మెత్తైనతల్పమొకటి సిద్ధమయ్యెను. సుఖప్రవాహమునం దేలుచు నెదపై చేయివేసికొని యనంతనాథుఁడు నిద్రించెను.

ఏపుట్టలో నేపామున్నదో యెవఁడెఱుఁగును! అనంతనాథుఁడు నిర్భీకుఁడై సుఖసుప్తుఁడైన యొక్కింతతడవున కా కల్పవృక్షపు మణిఖచిత కోటీరవివరమునుండి యొక గొప్ప కృష్ణసర్పము “భుస్సు భుస్సు” మనుచు నోట విషజ్వాలలఁ గ్రక్కుచుఁ గ్రిందికిదిగి రా సాగెను. అయ్యో ! అనంతనాథుఁ డిది యేమెఱుంగును! కట్టా! ఎంత మోసము ! దైవమాయ !! ఆకాలాహి మెల్లన నితనికడకే వచ్చుచున్నది ! ఏమిగతి ? మనచే నేమగును? అందు నిది కల్పవృక్షములోని కృష్ణసర్పము ! అక్కటా ! ఆపాపి మృత్యుదేవత యీనిర్భాగ్యునియెదపై కెగఁబ్రాఁకుచున్నది !! ఇంకను నిద్రించుచున్నాఁడో దీర్ఘనిద్రయే !! వీనియాశకు ఫలమిదియ కాఁబోలు! ఎవరైన మేలుకొలుపువారు లేరుగా !! అయ్యో ! దారిఁజూపిన సిద్ధుఁడెందో మాయమయ్యెను !! ఇకఁ దామసింపఁ జనదు !! మనమైన నీమందభాగ్యుని మేలుకొల్పుదము ! అనంతనాథా ! అనంతనాథా !! మూర్ఖా !! కృష్ణసర్పము !!! కృష్ణసర్పము !!! లెమ్ము. లెమ్ము !!!!

అనంతనాథుఁ డులికిపడి చేయి విదల్చికొనుచు దిగ్గున లేచెను. హస్తముమీఁదినుండి మృదువుగ జాఱుచు సర్పము తల్పముప్రక్కన పడినట్లయ్యెను. భయమున నొడలెల్లఁ గంపింప దిగ్భ్రాంతుఁడై శయ్య డిగ్గి సర్ప మెందుఁ బోయెనని పరీక్షించెనుగాని కానరాలేదు. క్రింద దాఁగినదికాఁబోలునని తల్పమెత్తి చూచెను గాని యొకటి రెండు లేఖలు దక్క నందేమియు నుండలేదు. చుట్టును దేరిపాఱఁ జూచెను.

తానుండున దెక్కడ? అనంతనాథుఁడు కన్నులు నులుముకొని చుట్టును దిలకించెను.

కాచగోళమున దీపము వెలుఁగుచుండెను. బల్లపైనున్న గడియారమున నాల్గుగంటలు కావచ్చియుండెను. శయ్యపైనతనియర్ధాంగి సరళ, సుఖనిద్రలోనుండెను. ఆమెకావలి ప్రక్కన శిశువు. తానుండుట సరళశయ్యాగృహములోనని యాతనికిపుడు బోధపడియెను. అయిన గల్పవృక్షము కథయంతయు స్వప్నమా! అనంతనాథుఁడు తనలోఁ దానే నవ్వుకొనియెను.

కాని హస్తముపైనుండి మృదువుగ జారిపడినదేది? అతఁడుక్రిందివైపు గమనించిచూచెను. అందొక మల్లెపూలహారము పడియుండెను. రాత్రి తానెదపై నుంచుకొని శయనించియుండినది.

అనంతనాథుని యాశ్చర్యము మీఱిపోయెను! నిజము! కొన్నివేళల స్వప్నము లట్టివి బాహ్యప్రపంచమునందు ప్రాణికింద్రియగోచరములగు విషయములను కాకతాళీయన్యాయమున గ్రహించి వలసినవేషములు వానికిచ్చి తమ నాటకమునఁ బాత్రములుగాఁజేసి ప్రదర్శించు నద్భుతశక్తి స్వప్నములకుఁ గలదు! అనేకులు స్వప్నముల ఫలాఫలవివేచనలకుం జొత్తురు. కొందఱవి నిష్ఫలము లందురు. మఱి కొందఱు స్వప్నమున ధనము లభించినచో తెల్లవార లేచి ధనమేమార్గమున నడచివచ్చునోయని నిర్నిమేషులై యుండువారు. వేఱుకొందఱి మతమున నవి యంతఃప్రపంచమున జీవుని ప్రవృత్తిఁ దెలుపునవి. అనంతున కివియన్నియు పిచ్చిభ్రాంతులు.

ఆతరుణుఁడు తల్పముఁ జేరి మరల నాసీనుఁడయ్యెను. సరళ సవ్యహస్తమును దలయంపిగ నిడి ప్రక్కవాటున నిద్రించుచుండెను. పూర్ణనిద్రలోఁగూడ నాముద్దరాలి మోమున మందహాసకళలు తేజరిల్లుచుండె. ఆవైద్యుతప్రదీపకాంతులలో నాతరుణీలలామముఖ మనుప

మూనమై యనన్యసామాన్య శోభాకరమై కానవచ్చె. "ఇదో నాపాలిటి కల్పవృక్షము" అనుచు నతఁడు సరళచుబుకమును స్పృశించి కరమును పెదవులఁ జేర్చెను. ఆసుందరినెమ్మోము నేఁడపూర్వలావణ్యభాసిత మని యతఁడు తలఁచెను. కారణమేమి? ప్రాణవల్లభుఁడగు తనరాకయే కాఁబోలు! పాపము! చిరకాలవియోగ మీసుకుమారి యెట్లోర్చియుండనోపు! నేఁడనంతనాథుఁడు రానిచో నెంతదుఃఖించియుండునోగదా! చాలప్రొద్దు తనరాకకై వేచియుండి నిరాశయై జాబుగూడ నొకటి వ్రాసెనఁట!

ఇపుడనంతనాథునకు శయ్యక్రిందనున్న లేఖలమాట జ్ఞాపకమునకు వచ్చెను. తనకై సరళ వ్రాసిన జాబదియే యై యుండనోపు! తటాలున తల్పము నోరఁజేసి యాలేఖల నందుకొనియెను. తన భాగ్యలక్ష్మి యాశాభంగము గల్గించినందులకై తన్నాజాబుల నెంతనిందించియుండునో చూచుటకై యతనిమనసు చాల తహతహఁ జెందుచుండెను. మోమున చిరునగవుగూడ మొలకలెత్తెను. లేఖనొకదానిని విచ్చి కుతుకమున నిట్లు పఠించెను.

బెంగుళూరు.

"నాబహిఃప్రాణామా! 24 ఏప్రిలు.

మీజాబునైనఁ గాంచుభాగ్యము నేఁడొదవినందున నెంతయో సంతసించితి. మందభాగ్యను. ప్రాప్తికిమించినఫల మపేక్షించినచో లభించునా?

మీప్రేయసి—కాదుకాదు—సరళకోర్కె చెల్లించుటకుఁ గాకున్న మీతనూభవదర్శనమునకైన రాఁదగదా? హృదయము లోహమయము గాఁబోలు. రావలయునన్న నాలుగంటల ప్రయాణమేగదా!

ముఖ్యము నాప్రాప్తి !

మీకృప నర్థించు ప్రేయసి,
"సరళ"

అనంతనాథుఁడు లేఖ సాంతముగఁ బఠించి చాల సంతసించెను. మనోహారిణిముఖము నొకసారిగాంచి మరల నాజాబును జదువుకొనియెను. బళ్ళారి ఆరుగంటల ప్రయాణమా! పొరఁబాటుననో హేళనముగనో వ్రాసియుండవలయును! అనంతనాథుఁడు బళ్ళారి నుండి వ్రాసినజాబు ముందుదినమే చేరియుండవలయు. భ్రమఁగాఁబోలు!

రెండవజాబును గూడ విచ్చిచూడసాఁగెను. అందలి యక్షరములు సరళవికావని ప్రథమదర్శనముచే బోధపడియెను. కుతూహలమున నందలి యంశముల నతిత్వరగా లోలోన చదువుకొన నారంభించెను. మనస్సున భావశతము లుద్రేకించుచుండినట్లు దోఁచుచుండెను. తటాలున ముఖము కళాహీనమయ్యెను! బొమలు ముడివడియెను. సంపూర్ణముగ ముఖభావము మాఱిపోయెను. ఆలేఖనుముగించి మరల మొదటిజాబును జదివి యేమియూహించెనో కాని తలయాడించెను. పలుమాఱు జాబును త్రిప్పిత్రిప్పి చదువుకొనెను. అవ్యవహితచిత్తునిబోలె, క్షణమాత్ర మటుచూచి మోమున దీనతను సూచించు "నుస్సు" రను దీర్ఘనిశ్వాసముదోఁప నాలేఖల నట్లే జారవిడిచెను. అపుడు సరళకింకను సుఖనిద్ర. ఆయువతిమోము గనుఁగొన్నంత నాతరుణుని కనులార్ద్రములయ్యెను. క్షణకాల మతఁడు ఱెప్పవాల్పక తన జాయకడఁ దిలకించెను. మరల నుష్ణనిశ్వాస మొకటి యాతనిమోమున వెలువడియెను. రెండుచేతులు ముఖమున నొత్తికొని నిమిషమాత్ర మతఁడు తలవంచి నిశ్చలతత్వమును బొంది యాలోచించెను.

"హా! ఇందిరా! నీవు మోసపోయినది చాలక నన్నుఁ గూడ మోసగించితివి!!"

అనుచు తటాలున నతఁడు మంచముడిగ్గి నిలువఁబడియెను. శిశువువంక నొక్కసారి తిలకించెను. అట్లే కొంతతడవుచూచి యాలోచించి, "ఇదిగో సాక్ష్యము!" అనియెను.

అనంతుఁడు మాఱుమాటాడలేదు. ఆజానుల రెంటిని గైకొనియెను. ఉత్తరీయము ముసుగువైచికొని యాక్షణమున నాగదిఁ బాసి వెడలిపోయెను. వెనుదిరిగి చూడలేదు!

---

# ప్రణయసరణి

---

## ఇరువదిమూఁడవ ప్రకరణము

—:o:—

### "ప్రమాదము"

"నవిషేణ నశస్త్రేణ నాగ్నినా నచమృత్యునా
అప్రతీకార పారుష్యాః స్త్రీభిరేవ స్త్రియఃకృతాః"

(కువలయానందము.)

నిజధర్మపరిపాలనమునందు మానవులకన్న నచేతనములగు యంత్రాది సాధనములకు చాలశ్రద్ధ! క్షణమైన నించుమించులేక యైదుగంటల పిరంగి గుండుమ్రోఁతకు సరిగ సరళాదేవి శయనాగారమునందలి గడియారము "ఘణఘణ" మని మ్రోఁగెను. సరళయు మేల్కొనెను.

ప్రక్కన శిశువు దీపమువంకఁ దిలకించుచు నాఁడుచుండెను. మేలుకాంచి సరళ నాథుఁడుశయనించియుండిన ప్రక్కఁ జూచెను. అనంతనాథుఁ డగపడలేదు. లేచి యాసీనయై సరళ పతికై నలువలఁకులఁ దేరి పాఱజూచెను. గదితలుపు లోరగ మూయఁబడి యుండెను.

అనంతనాథుఁడు గదిబైట కరిగియుండునని యామెకు గోచరమయ్యెను. అంతలోఁ దల్లినిజూచి శిశువు రోదనమొనరింపఁ సాఁగెను. నుతు నెత్తుకొని పాలిచ్చుచు నాలావణ్యవతి వాని ముద్దుమొగముఁ గాంచి యానందించుచున్న సమయమున మనమున నేదో స్ఫురణకువచ్చి యదరుపాటు జనించెను. తటాలున శిశువు నందు విడిచి మంచము డిగ్గి శయ్యనెత్తి చూచెను. అందేమియు నుండలేదు. సరళ గుండియలత్యుత్కటముగ నదురసాఁగెను. తొట్రుపాటు జనించెను. మిగుల నాత్రమున నన్నిప్రక్కలను మరలమరల వెదకెను. గాని యామెకోరిన దేదో లభింపదయ్యెను. ముఖమున నూతనభావ ముదయించి సందేహశతములు హృదయసీమ నంకురించెను. క్షణమాత్ర మూరక యాలోచించి తన పేటికను దెఱచి యందలి యరలలో నెల్ల వెదకినను ప్రయత్నము సఫలము కాలేదు.

శిశువుగూడ ఆఁకటివెల్లున పెద్దపెట్టున రోదనమొనరింప మొదలిడెను. కాని యప్పటి యామెయాత్రము మాతృవాత్సల్యమునుగూడ నొకప్రక్కఁ గట్టియుంచెను. అనంతనాథుఁడుగూడ మరలలేదు. గది వాకిటఁ దొంగిచూచి యందెవ్వరును గానరానందున మరలఁ దలుపోరగ మూసి శయ్యపైఁ గూలఁబడియెను.

హృదయమున నుదయించినయనుమానము లన్నియు నిపుడు స్థిరపడియెను. పరీక్షకై మంచముక్రింద దాఁగియుంచు నేమోయని పతికై మంచముక్రిందఁగూడ నాచతుర చూచి యందును లేఁడని నిర్ధరించుకొనియెను. కర్తవ్యాంశము లేశముగూడ నామెకు గోచరింపలేదు. ముఖము సంపూర్ణముగఁ గళావిహీన మయ్యెను. భ్రుకుటీబంధము స్వాంతమునందలి చింతల వెలిపుచ్చుచుండెను. మోమున నిశ్శ్వాసములు వెలువడుచుండెను. క్షణ మొకతీరున నిలువని యామెస్థితి హృదయమునందలి యస్వాస్థతఁ దెలుపుచుండెను.

నిమిషమూరకుండి గది వెడలి శాలలోనికరిగి ,,లక్ష్మీ! లక్ష్మీ!'' యని దాసిని బిలిచెను. గాఢనిద్రలోనుండి యులికిపడి ,,హాఁ!'' యనుచు నదియుఁ జేరవచ్చెను. ఇరువురును గదిలోఁ బ్రవేశించిరి. కన్నులు నులుముకొనుచు నాదాసి గదినంతయుఁ జూచి సరళకడ నాశ్చర్యమునఁ జూచుచు నిలువఁబడెను.

,,లక్ష్మీ ! నీ విప్పుడేనా మేలుకొంటివి?''

,,అవును. ఏల ?''

దీర్ఘనిశ్శ్వాసమును విడిచి సరళ,

,,లక్ష్మీ! ప్రమాదము జరిగినది!'' అనియెను.

,,ఏమి! యజమాను లెందుఁబోయిరి?''

,,నాకును దెలియదు!''

,,చాల నాశ్చర్యముగ నున్నదే!''

,,లక్ష్మీ! నేఁడు మనరహస్యము బైటఁ బడినట్లున్నది!''

,,ఆఁ! ఎట్లు?''

,,నిన్న యుదయము వచ్చిన జాబును రాత్రి చూచుచుంటిని. అంతలో నీవు వచ్చి చెప్పినందున నాత్రమున శయ్యక్రింద దాఁచితిని. మేలుకొని చూచువేళకు అతఁడుగాని యాజాబుగాని కానరావు. తప్పక యిది ప్రమాదముగా నున్నది. ఇపుడేమిచేయవలయునో తోఁచకున్నది!''

లక్ష్మియూరక వినుచు స్తబ్ధయై నిరుత్తరయై ముక్కుమీఁద వ్రేలుంచుకొనెను. క్షణకాల మది యేమో చింతించి,

,,అమ్మా! వచ్చెద నుండుము!'' అని యాగదిఁ బాసిపోయెను.

సూర్యోదయమున కరగడియ మిగిలియుండెను. బహిఃప్రపంచమంతయు నానందద్యోతకముగ నుండెను. సరళ హృదయమునమాత్ర మంధకారమే యావరించినది. చెక్కిలి నొకచేతఁ జేర్చి చింతించుచు

నామె తల్పమున నాసీనయై యుండెను. విషాదకరములై భయావహములైన యోచనలు క్రొత్తక్రొత్తగ మనసున నావిర్భావ మందుచుండెను. నిమిషములు పది గడిచెను. అంతలో లక్ష్మి మరల వచ్చెను.

„ఏమి?” అనుచు సరళ తలయెత్తి దాసిని గాంచెను.

„నిజముగ ప్రమాదము జరిగినది!” హీనస్వరమున నాదాసి ప్రతి పల్కెను.

„ ఏమైనఁ దెలిసినదా ? ”

„ అతఁడుత్తరీయము ముసుగువేసుకొని చేతిలో జాబు పట్టుకొని సుమారు నాలుగు గంటలవేళ చుట్టుగోడదాఁటి రాజమార్గమున కరిగెనఁట ! వాకిటి కావలివాఁడు చూచి పలుకరింపఁగా „ నేను ” అనిచెప్పి వెడలిపోయెనఁట ! సందేహములేదు. రహస్యమతఁడు తెలుసుకొనియే రోషమున నిలువెడలిపోయినాఁడు. నిజము. నీవేమైన నందువుగాని నీవెప్పుడును చాలనజాగ్రత్తతోఁ బనిచేయుదానవు ! ”

సరళక్షణమాత్రమేమియుఁ బ్రత్యుత్తరము నొసంగలేదు. మనసునఁగూడ స్ఫురింపలేదు. తుదకు దీనముగ దాసిని జూచుచు నిట్లనియె.

„ పోనిమ్మా ! ఇపుడేమి చేయుమందువు ? ”

„ అమ్మా ! నాకేమియుఁ దోఁపదు ”

„ ఒక్కపని నిర్వహించెదవా ? ”

„ చెప్పుము, చూచెద ”

ఇంతలో గదితలుపు తెఱువఁబడెను. దాసి వేఱొక్కతె లోపలి కరుగుదెంచి సరళతో,

„ అమ్మా ? ఎవరో యొకబాలిక మిమ్ముఁ జూడఁ గోరివచ్చుచున్నది ” అని సవినయముగఁ బలికెను.

„ ఎవరే యీవేళకు ! ” అని సరళ కసరెను.

ఇదిగో యీమె "

అనుచు ప్రక్కన నాదాసిచూపెను. రమారమి పదునైదేండ్ల వయసుగల బాలిక యొకర్తు వాకిట నిలిచియుండెను.

"నీవెవరు ?" సరళ ప్రశ్నించెను.

"నేనెవరైననేమి ? అనంతనాధశర్మగారున్నారా ?"

సరళయు దాసియు నాబాలిక నెగాదిగఁ జూచిరి.

"ఏల ?"

"ముఖ్యమైన పనియుండఁబట్టియే యడుగుచున్నాను"

"మాకుఁ జెప్పరాదా ?"

"అతనిని జూపినచోఁ జెప్పెదను"

సరళకు కోపము జనించెను.

"అతఁడు లేఁడు పొమ్ము !" అనియెను.

"ఎప్పుడు వచ్చును ?"

"మాకుఁ దెలియదు !"

ఆబాలిక మాఱుపల్కక గదిఁ బాసి వెడలెను. మఱుగుపడుదాఁక నామెకడ దృష్టినిలిపి తరువాత సరళ లక్ష్మిదిక్కు మొగమై,

"ఎవరిది ?" అనియడిగెను.

"ఏమో ! నాకుఁ దెలియదు"

సరళహృదయమున నూతనసందేహ మొకటి పొడసూపసాఁగెను. ఈబాలిక యెవరు ? అనంతనాధశర్మతో నీమెకుఁగల ముఖ్యమగు కార్యభారమెట్టిది ? తనతోఁ జెప్పరానట్టి పని యేముండును ?- సరళ కొంత తడవు పలువిధముల నాలోచించెను. కాని యిదియిట్టిదని నిర్ణయింప తగుసాక్ష్యములేవియు మనసున గోచరింపలేదు. తుదకామె యేదో నిర్ధరించుకొని రెండవదాసిని పొమ్మనిచెప్పి, లక్ష్మి చెవిలో నేకాంతముగా నేమేమో వచించి,

లక్ష్మీ! ఈకార్యము నెట్లు సాధించెదవో నాకుఁ దెలియదు. నామానసమును ప్రాణమును సర్వమును నీయధీనములై యున్నవి. కార్యము నిర్వహించినచో నిన్నెట్లు బహూకరింతునో నేనిపుడు చెప్పఁ జాల! పొమ్ము! ఎంత్వరలో వచ్చెదవో! నిన్నే చూచుచుందును" అని ముగించెను.

"అమ్మా! ఇంత చెప్పవలెనా? నీకై యెట్టికార్యమునైనను జేయుదును. నన్ను నమ్మి ధైర్యముగ నుండుము"

అనిపల్కి లక్ష్మి యామెయనుమతి వడసి తటాలున వెడలి పోయెను.

---

# ప్రణయసరణి

---

## ఇరువదినాల్గవ ప్రకరణము,

---

"అతః పరీక్ష్యకర్తవ్యం విశేషా త్సంగతం రహః
అజ్ఞాతహృదయేష్వేవం వైరీభవతి సౌహృదమ్"
(అభిజ్ఞానశాకుంతలము. ౫—౨౪)

సూర్యభగవానుఁడపరాద్రిమాటుఁజేర నుంకించుచుండెను. సాయంతనదీప్తులు గగనమునెల్ల వ్యాపించి పలురంగుల కాంతుల నీనుచుండె. పక్షిగణములెల్ల నవ్యక్తకలధ్వనిఁ జేయుచు, బారులుదీరి యాకసమున నీడాభిముఖములై పఱచుచుండెను. పరిశ్రమ చాలించి జనులెల్ల వ్యాయామవిహారములకుఁ జొచ్చిరి. నాగరకతరుణతరుణీ జనములు రాజమార్గంబులందును క్రీడారామములలోను విలాసవిహారము

లకుం దిగిరి. నగరమున కించుకదూరమున నాగరకులవిశ్రాంతివిహారములకై దొరతనమువారిచే నిర్మింపఁబడి రక్షింపఁబడుచున్న విశాలమైన క్రీడారామ మొక్కటిగలదు. అది చాల మనోహరము. రమ్యములగు మాకందాదితరుబృందములు బారులుదీఱి యాతపోటకోక నూతనశోభ నొసఁగుచుండును. మల్లికాదికుసుమలతలు జొంపములుగఁ బెరిగి నడుమ నడుమ ఘుమఘుమల నిచ్చుచుండెను. తన్మధ్యమున నందందు సుసజ్జితములయిన క్రీడామార్గములును, ప్రక్కల కృతకశిలావేదికలును చాల రమణీయములు. సాయంతనవేళల నాగరకతరుణులు, బాలురు, బాలికలును కడు విలాసముగ నాయారామసీమల విహరించుచుఁ బ్రొద్దుపుచ్చుచుందురు. మన సరళానంతనాథులు గూడ నిచట నెన్నియో సంధ్యాకాలముల నతిమనోహరముగ సవిలాసముగ గడిపి యుండిరి.

ఆయారామపు టుత్తరభాగమున నొక గొప్పజాజిపొద గలదు. లోపల గుప్తమైన నికుంజము. అప్రాంతమంతయు వృక్షలతాదులతో క్రిక్కిఱియుచుండును. ముఖద్వారమునకు దూరముగ నుండుకతంబున సామాన్యముగ వ్యాయామార్థ మురుగుదెంచువా రెవరును అప్రక్కజనరు. నేఁ డందలి పొదరింట నొకపురుషుఁ డవనతముఖుఁడై చింతించుచుఁ గూర్చుండి యుండెను. అతనిచేత నొకజాబును, ప్రక్కనొక సీసాలో నొక ద్రావణమును గానవచ్చుచుండెను. కనుల బాష్పధారలు వెలువడుచుండెను. ఇతఁడు మనయనంతనాథశర్మ !

అక్కటా ! ఎట్టివాని కెట్టిగతి ! దుఃఖమన్న నెట్టిదో కలనైన నెఱుంగని యనంతనాథు డిపుడు కన్నుల నపూర్వముగ నీరు గార్చుచున్నవాఁడు! దైవమాయ నెవఁడు గడవఁ గలఁడు !!

నిన్నటి యాతని ముఖవర్చస్సు నేడు మాసినది. దేహము కళావిహీనమైనది. దుఃఖమునఁ గన్నులెఱ్ఱవాఱినవి. అత్యుష్ణములగు నవవ

రత నిశ్శ్వాసధారలవెల్లున ముఖము వాడువడినది. వికాసము దక్కి నది. ఏడుగంటల కభిగమనపూజ జరుగకున్న నాఁకట మలమలమాడు వాఁడు: నేఁ డుదయమునుండి జలమును గూడ స్పృశింపకున్నను క్షుత్పిపాస లాతనిగొడవకు రాలేదు. మనోవ్యథయే కడుపునిండుగనున్నది. పొరలిపొఱలుచున్నది. అనంతుని కన్నులకిపుడు ప్రపంచమంతయు దుఃఖమయమై, దుఃఖకారణమై, దుఃఖసారమై, సాక్షాత్కరించుచున్నది. మునుపు మహానందమునఁ గనుఁగొన్న వస్తువులపై నతని కిపుడు జుగుప్స ! మునుపు కర్ణానందదాయకములుగ నున్న స్వరము లిపుడు కర్ణకఠోరములు ! అమృతమయముగనున్న మునుపటిజీవితమిపుడు హాలాహాలమయము !! కాలగతి !!!

అనంతనాథుని దుఃఖమున కిపుడు పారముగపడలేదు. కొంత తడవూరకయ కన్నులనీరు గార్చుచుఁ దలవంచి యుండును; కొంతసేపు భ్రాంతచిత్తునియట్లూరక పలవించుచుండును; ఒక్కొక్కమాఱు చేతనున్న లేఖను విప్పి యందుండు నంశముల లోలోనఁ జదువుకొనుచుఁ బొగులును. నడుమ నడుమ నుష్ణనిశ్శ్వాసములు విడుచుచు ""హా! దైవమా !"" యనుచు నిశ్చేష్టితుఁడగును; అపుడపుడు తలయెత్తి వికారముగ నాకసమువంక నూరక వీక్షించి, తటాలున రెండుచేతుల నెత్తి మోమునకడ్డముగఁ జేర్చుకొనును; తలవంచును; కనులుమూసి గొణుఁగును; తటాలున నేమో యోజించి రోషముజనింప నౌడుగరచి దిగ్గునలేచి రెండుమూఁడడుగులిడి మరల నేమో తలంచి యూరక నిలిచి చుట్టును దిలకించును; ఆశాభంగసూచకముగ నుస్సురుమని యూర్చి యథాస్థానముఁ జేరి హస్తములను స్వస్తికబంధమున హృదయసీమను జేర్చి కన్నులరమూసి లోలోన ధ్యానించును; కన్నులుఁ దెఱచి ""అయ్యో! సరళా !"" యనును; ""ఛీ"" యనుకొని ప్రక్కనున్న కా

చపాత్రముపై దృష్టినిబఱపును; మరల తలవాంచి కన్నీరు గార్చునట్లు అతని దుఃఖమపారము!

నిశ్శబ్దము! కొన్నిక్షణములు గడచెను. అనంతనాథుఁడు శిరమువంచి మౌనముద్రలో నుండెను. ప్రక్క నెవరో మెల్లన నడుచుచున్నట్లు పాదధ్వని వినవచ్చెను. అనంతనాథుఁడులికిపడి కన్నులువిచ్చి చూచెను. గాని యెవరును గానరారైరి. సందేహించి లేచి చుట్టును దిలకించెను. జనులెవరును సమీపమున గోచరింపమిచే భ్రమగాఁబోలుననుకొని నిర్ధరించి మరలఁ గూర్చుండెను.

„వృథాకాలహరణమేల? ఎట్లును నాప్రాప్తియిది!!"

అనుకొని ప్రక్కనున్న ద్రావణపాత్రమును గైకొని క్షణకాలమట్టె దానివంక నిదానించి చూచెను. మరలఁ గన్నుల నీరు నిండెను.

„అయ్యో! ఇంత యల్పాయుష్కుఁడగు నిర్భాగ్యుఁడనని తెలియలేకపోయితిఁగదా! నిన్న యీవేళలో నాకున్న యానందమేమి? నేటియీదురవస్థయేమి?—ఛీ! ఈపాపిజీవిత మెన్నినిమిషము లెక్కువ బ్రతికిన నన్నిమఱుఁగులు భూమికి భారము. చాలించుట మేలు!"

అని యాద్రావణము ద్రావఁబోయి, "కడసారి యీజాబును జదివెద గాక" యనుకొని సీసానందుంచి లేఖను విప్పిచదువసాఁగెను.

మైసూరు.

"నాభాగ్యపరిపాకమా! 23-4

నీనేఁటిలేఖ నాకపరిమితసంతోషము నొసంగినది. నీయనుగ్రహామృత మింతగ నాపయిం బ్రసరించుచుండుటఁ జేసి ఇహలోకమున నాకన్న ధన్యుఁడు లేఁడని త్రికరణశుద్ధిగ నమ్ముచున్నాఁడను. నీయనురాగమింతటి ఘనమని నేనింతకు మున్నెన్నఁడును తలంపమికి నాబుద్ధిమాంద్యముదక్క వేఱుకారణము లేదు. నిజమునొప్పుకొని క్షమింపుమనుట తప్ప వేఱేమియు బ్రతి వ్రాయఁజాల. ఇపుడు నీవలన

నొకవిషయము బాగుగ గ్రహింపఁ గల్గితిని. నిజమైన ప్రేమ యవ్యాజమై, చాలనిర్మలమై, స్వచ్ఛందముగ విలసిల్లునుగాని, బాహ్యవిషయము లెన్నియైనను దన్మార్గమును నిరోధింపనేరవనుట. నామిత్రుఁడగు ననంతనాథుని హీనజీవితమునకై యొక్కింత నామనసునొచ్చెను గాని, పైసిద్ధాంతమే తగినయుత్తరము నొసంగినను సమాధానపఱచినది. వానివర్తనముఁ గూడ నిందులకొక్కతార్కాణము !

నీకరుణకై కృతజ్ఞత నీలేఖమూలమున నేనుజూపనశక్తుఁడను. ఇపుడే వెడలి నినుజేరి నీమన్ననఁ బడసి యానందింపనెంతో తహతహపడుచున్నాఁడను, కాని యిప్పటికార్యగౌరవము వారముదినముల దాఁక నన్నీపురినుండి వెడలనీయకున్నది. విధిలేక దినములెంచుచుందును. వేఱుదలఁపకుము. క్షమింపుము. సాధ్యమైనచో నేటిరాత్రికే వచ్చువాఁడను. కాని దృఢముగ వ్రాయఁజాలను.

ఇట్లు, భవత్ప్రియుఁడు,

లక్ష్మీకాంతసేనుఁడు.

జాబు తుదముట్టఁ జదువుసరికి అనంతనాథునికనుల సంతతధారగ బాష్పపూరములు ప్రవహించెను. ఆలేఖ పూర్ణముగఁ దప్పదోఁగెను. పట్టరానిహృదయతాపమును సూచించుచు గొప్పవేఁడియూర్పొకటి బయలువెడలెను. అంతరంగమున దుఃఖప్రవాహములు తరంగములై, కల్లోలములై, కొండలు కొండలై పొంగివచ్చుచుండెను. గాఢాంధకార మావిర్భవించి హృదయమున జ్ఞానకళికను చుట్టుముట్టసాఁగెను. కుడిచేయి ముఖమున నుంచుకొని యతఁడిట్లు సైఁపలేక గట్టిగ విలపించెను.

" అయ్యో ! సరళా ! సరళా ! పాపిసరళా !! నీకేమిద్రోహము చేసితిని ! సర్వకాల సర్వావస్థలయందును త్రికరణశుద్ధిగ నిన్నునమ్మి, నీస్వరూపమునే హృదయాధిదేవతవలె సదా ధ్యానించుచున్నందులకా

తుదకు నాకీఫలము ! నిర్మలమై యనన్యసాధారణమైన యమృతతుల్య మైన నాయనురాగమున కిదియా నాయర్థాంగియగు నీవిచ్చు ప్రతి ఫలము ! తల్లిదండ్రుల మాటగూడ మీఱి, శ్రమలెన్నియైన నోర్చి, అగ్నిసాక్షిగఁ బరిణయమాడిన కన్యనుగూడ వదలి, నిన్నుఁగోరి వరించి బహిఃప్రాణముగ నిన్నుఁజూచుచున్నందు కిదేనా నాకీలోకమున బహు మానము !! అయ్యో ! లోకోత్తరమైన నీరూపలావణ్యములకును, శ్లాఘనీయమైన నీవిద్యకును, అసామాన్యమైన నీనాగరకతకును కడ కిదే గదా పరిణామము !!! మొదలే నిజముఁ దెలిసి నీమనోగత మెఱింగించి యుండినచో నాకెంతయో యుపకారము చేసియుందువు గదా! ఇట్లు మోసగించి నన్నుభయభ్రష్టుని జేయుటకు నేఁ జేసిన తప్పేమి ? నాయెడ నీవుచూపిన ప్రేమయంతయు నవ్యాజమనియు మోసమనియు స్వప్నమునఁగూడ నెంచియుండలేదే ! నీమాటలకును నీచేఁతలకును వేఱొకయర్థము గలదనికుణమైనస్ఫురింపదయ్యె! నావిద్యయు, నాబుద్ధియు నీచాతుర్యము ముందు గవ్వకుఁగూడఁ బనికిరాదయ్యెనుగదా! నన్నిట్లు పరిభవించుట నీకు వినోదమా! లేక ఆఁడుజాతియంతయునింతేనా ? లేక నాదురదృష్టమా! నిజము! దైవసమానులైన తల్లిదండ్రులయాజ్ఞనుల్లంఘించి వారికి నేకవిధముల మనఃక్లేశ మొదవించిననాకు నిది తగిన ప్రాయశ్చిత్తము ! విహితదండనము !! అయ్యో ! నాఁడు చెన్నపురిలో మారి సోఁకిననాఁడే మరణించి యుండినచో నాకీదుఃఖములుండి యుండవు గదా !—హా ! నారీమణీ ! ఇందిరా ! నీవుగూడ నన్ను మోసగించితివి! సరళ లక్ష్మీకాంతునియందనురక్తయని నాఁడే నాకు జెప్పియుంటివేని నాకీపాటు నేఁడు గలిగియుండదుగదా ! —లక్ష్మీకాంతా ! గోముఖవ్యాఘ్రమా !! ప్రాణమిత్రునివలె నటించి తుదకు నాకు మృత్యువై పరిణమించితివి !!—కాలమా ! నీప్రభావ మవాఙ్మానసగోచరము ! అపరిమితము !!—సరళా! ఛీ !! ఇంక నీపాప

నామాక్షరము లుచ్చరించినవాని నాలుక చీల్పవలయును ! ! — తండ్రీ! నీయెడఁ దిరస్కారముఁ జూపినందుకు ఫల మనుభవించు చున్నాను ! క్షమింపుము ! నీసుతుననుగ్రహింపుము ! ! దురాత్ముఁడని నిందింప కుము !! అమ్మా ! తల్లీ ! నన్ను దిట్టకుము ! నీకడకురానైతినని కిని యకుము ! నీచుఁడని శపింపకుము !! నాప్రాప్తి యిట్టిది !!

అనంతనాథుని కనులనిండ వారి గ్రమ్మెను. కంఠమున గద్గదిక జనించెను. గట్టిగ విలపించెను.

" — నాప్రాప్తియింతే ! తల్లీ ! క్షమింపుము ! నీకు సుతుఁడు లేడనుకొనుము ! అమృతమయమగు నీకడుపు నాయట్టినిర్భాగ్యుని, అవిధేయుని, పాపాత్ముని, గని విషమయమైనది ! (ఆకసమువంకఁ జూచుచుఁ జేతులు జోడించి) ఓ సర్వేశ్వరా ! సర్వరక్షకా! క్షుద్రవస్తువుల స్మరించినంతలో సగపాలు నిన్ను స్మరించియుండిన నెంతో ధన్యుఁడనగుచుంటిని ! కాని నాయజ్ఞానము నన్నింతకుఁ దెచ్చినది ! ఇదే నిన్ను శరణుజొచ్చినాఁడను ! నాయాయువు సమీపించినది ! ! మొరాలింపుము ! కరుణింపుము ! ! క్షమింపుము ! ! ! "

అనంతనాథుఁడు దండప్రణతిఁ జేయుచు గబాలునబోరలుగ నేలపైఁబడియెను. అతనికి మూర్ఛవచ్చెను. చేతనాశక్తి లయమందెను.

———

# ప్రణయసరణి

## ఇరువదిరెండవ ప్రకరణము.

"సాకేతరాముని సంకల్పము"

"ధృతి రస్తమితా మతి శ్చ్యుతా !
విరతం గేయ ! మృతు ర్నిరుత్సవః !!"
(కాళిదాసుఁడు, రఘువంశము.)

కడచిన యధ్యాయమందలి యంశములు నడచి దాదాపుగ నరగడియ యగుచుండెను సరళదాసియగు లక్ష్మి యపుడొంటరిగ రాజమార్గమునందు స్వామినాథసేనుని మందిరమున కభిముఖముగ నడుచుచుండెను. ఆదాసి ముఖ మానందకళలఁ దూఁగాడుచు కృత కృత్యతను సూచింపఁజాలి యుండెను. వలచేతఁ జిటికెలు వైచుచు సన్నగ మృదుస్వరమున నొక గీతమును బాడుచు నడుమ నడుమ డల యూడించుచు నది తనదారి సాఁగించెను. తనకుఁగల యానందా తిరేకమున నెవరుపిల్చినను నామె చెవిఁగొనక యరుగుచుండెను. "నేఁడు నాగ్రవేలి కొకయుంగరమైన లభింపకపోదు చూడవలయు నిందుపై నాయదృష్టము !" అనుకొనుచు చిటికెనగ్రవేలనున్న యంగు ళీయకమును మాటిమాటికి వెలికిఁదీసి నూర్చిమార్చి వేళ్ళనిడుకొనుచు నాదాసి తనంత నడచెను.

అంతలో మరల సమీపమునందే తన్నెవరో పిలిచినట్లయ్యె:

"ఎవరది!" అని కసరుకొనుచుఁ దలయెత్తి యాప్రక్క దృష్టి సారించెను. కమారమి పదునైదేండ్ల వయసుగల పడుచొక్కతె తన కభిముఖముగ వచ్చుచుండెను. ఒక్కసారి చూచుటతోడనే నాఁటి

యుదయమున సరళ భవనముఖ కరుగుదెంచిన పద్మ చేమెయని యా దాసి యెఱిఁగెను.

„దీని రహస్యముగూడ నెఱుఁగుట మంచిది. మాట్లాడించి చూచెదను.'' అనుకొని యాపడుచుం జేరఁ జనుదెంచెను.

„అమ్మాయీ ! సమాచారమేమి ? మాయింటికిఁ బోయి యుంటివా ?''

„అవును''

„అనంతనాధశర్మగారికై కాఁబోలు ! వారింట నుండిరా?''

„లేదు. నేఁ డుదయమునుండి తిరిగి తిరిగి వేసరితిని''

లక్ష్మి కన్ను గీటుచు „లేరా ? సరళాదేవి యేమన్నది ?'' అని యడిగెను.

„ఆమె యెఱుఁగదఁట. ఇదంతయు నేమో యింద్రజాలముగ నున్నది''

„ఇంచుమించుగ నింద్రజాలమే!'' అనుచు లక్ష్మి చిన్నగ నవ్వెను.

„ఏమి ! నీకేమైన తెలియునా ? తెలిసియున్నచో దయచేసి యతఁడున్నచోటు తెల్పుము. నాకెంతో మేలు చేసినట్లగును?''

„సరిగాని, అతనితో నీయట్టి యువతి కేమిపని'' లక్ష్మి మరల నవ్వెను.

„అమ్మా ! నీవెట్లు తలఁచిననేమి ? నే నొక ఘనమైన కార్యమునకై యతనిని వెదకుచున్నాను''

„ఆతఁడు నీవుతప్ప నితరులారహస్యమెఱుఁగఁగూడదేమో?''

„అమ్మా ! తెలిసినఁ జెప్పుము. నాకు పొద్దగుచున్నది !''

„ఇంకను సమృద్ధిగ రాత్రి యున్నది లెమ్ము !''

అనుచు లక్ష్మి కను బొమ లాడించెను. ఆపడుచును గోపగిం చుకొని యిట్లనియె.

"నీహాస్యమునకిది వేళగాదు. నాచెలివద్ద కతనిని బిలుచుకొని పోవలసియున్నది. నే నిక్కడ దామసింపరాదు. కార్యము మీఁఱును. నీ కతఁ డున్నచోటు తెలిసినచో నామాట చెప్పినఁ జాలును. వెళ్ళెద"

"ఊఁ! నాకుఁ దెలియదు పో!"

"ఇంతమాత్రమునకా యింత వాగ్వాదము!"

అనుచు వేసరి యాపడుచు తనదారి సాగించెను. లక్ష్మియు మూఁడు నాలుగడుగులు ముందునకరిగి నిలిచి యేమో మనంబున నించుకతడవు తలపోసి, "చెప్పుటయే మంచిది" అనుకొని గిరుక్కున వెనుకకు మరలి,

"ఇదో! ఇదో! అమ్మాయీ! చెప్పెద రా!" అని పిలిచెను.

ఆపడుచును తిరిగిచూచి "ఏమి! హాస్యమా!" అనుచు నిలువఁబడెను.

"కాదు! నిజముగ! రమ్ము!"

అనుచు లక్ష్మి యాపడుచుం జేరఁబోయి నవ్వుచు,

"అతఁడుండుచోటు నీకంత యావశ్యకమా!" యనెను.

ఆమెయు బొమలు ముడిపెట్టి యించుక రోషమున,

"అవును! ఇష్టమున్నఁ జెప్పుము. లేకున్నఁ బోయెదను!" అనెను.

"చెప్పెదను రా!"

అని లక్ష్మి యామెను జెంతకుఁ బిలిచి చెవిలో నేమేమో కొంత చెప్పి,

"త్వరగాఁ బోవలయునుసుమా !" అని ముగించెను.

"నిజమా! హాస్యము గాదుగదా!"

"సత్యము! నా సాక్షిగ !"

ఎవరు వారిత్రోవం జనిరి. ఆపడుచు వడివడిగ నేగుచు పౌరారామమువంక దారి తీసెను. నడుమ నెందును నిలువక త్రోవ నెదురైనవా రెవరితోడను మాటాడక నాసాహసిని కడునాత్రమున నందందుఁ జూచుచు నాయారామపు టుత్తరభాగముఁ జేరెను. పండువెన్నెలగావున నాప్రాంతములందలి రహస్యస్థలములనెల్ల నరయుచుఁ దుదకామె యొకానొక పొదరింటికడ కనుదెంచెను. క్రిందఁబడియున్న యొకానొకవస్తువును గాంచి యులికిపడెను. నిదానించి చూడ నొక పురుషుఁడు బోరగిలఁ బడియుండెను. ఆవిగ్రహమును గుర్తించి యాతనిస్థితికి చాల నాశ్చర్యమునందుచు నామె చాలఁజింతించి కారణ మరయలేక కొంతవరకట్టె వీక్షించుచు నిలువఁబడెను.

దాదాపుగఁ బదినిమిషములు గడచెను. నిద్రయో లేక మూర్ఛయోయని కొంతతడ వాలోచించుచు, నిట్టియకాలమున నీరీతినిద్రయుండదని నిర్ధరించుకొనెను. తత్క్షణమే చేరువఁగూర్చుండి మొగముపై చల్లనిగాలి వీవనారంభించెను. అనంతనాథున కట్టిస్థితియెట్లుకలిగెనని యామెయెంత యోచించినను గోచరముగా లేదు. హృదయమనేకవిధములుగ సందేహింపఁ జొచ్చెను.

మఱికొన్ని నిమిషములు గడచెను. అనంతనాథుఁడుచలించెను. ఆబాలయునించుక ప్రక్క నిలిచెను. ఆతరుణుఁడు తటాలున "హాఁ !" యనుచులేచి భ్రాంతుఁడై వెక్కలఁబరికించుచు నిలువఁబడెను. సమీపమున నిలుచున్న బాలిక నొకదానిఁగాంచినంత నాశ్చర్యమును సంభ్రమమును జనించి యతనిహృదయము నొక్కింతసేపు కలంచెను. తటాలున స్మరణకువచ్చి లేఖకై వెదకెను గాని యది మాయమైయుండెను.

ఆ త్రమున చుట్టును జూచెను, గాని ఫలము లేదు. లేఖయొక్కటి మాత్రముగాదు. ద్రావణపాత్రముగూడ నదృశ్యమై యుండెను. అనంతనాథుని యాశ్చర్యమునకు మితిలేదు. సంకల్పమునకు భంగమొదవి నందులకై మనంబునఁ జాలఖిన్నుఁడై కొంతతడవు కర్తవ్యమేమియుఁ దోఁపక యూరక పిచ్చివానివలె నిలువఁబడెను. ఇంతలోనిట కెవరు వచ్చిరి ? సహజముగ నాబాలపై ననుమానము పొడమెను. ఈమె యెవరు ? ఇచట నేమిపని ?

" అమ్మాయీ ! నీవెవరు ? "

ఆపడుచు బదులియ్యలేదు. చెరగున దాఁచియున్న యుంగరము నొకదానిని వెలిదీసి యనంతనాథుని చేతనుంచెను. అదిచూచినంతనే యాతనికొక భావాంతర ముదయించి యాయుంగరము కనుల కొత్తుకొని " హా ! నా ప్రాణదాత్రీ ! " యని కన్నులనిండ నీరునించెను. కొంతవడికా బాలతోననియె.

" అమ్మా ! ఇది నీకెవరిచ్చిరి ? "

" మీమిత్రతనుగు ఇందిర. తమకిది చూపితోడితెమ్మని నాకాజ్ఞ యిచ్చెను "

" ఆమెయిపుడెందున్నది ? "

"నావెంట రండు. ఆమెయున్న చోటికిఁ బిలుచుకొనిపోయెద."

" అనంతనాథుఁడు వేఱుయోచింపక పయనమయ్యెను. అంతలో లేఖమాటజ్ఞప్తికి వచ్చెను.

" అమ్మా ! ఇందొక లేఖయుండెను. చూచితివా ? "

ఎందు? నేనెఱుఁగనే ! " ఆశ్చర్యమున నాపడుచు ప్రతియిచ్చి చుట్టును గాంచెను.

" సరి ఐన నేనిందున్నానని నీకెవరు చెప్పిరమ్మా ! "

" నేటియుదయమునుండి పలుమారు మీకై యింటికిఁబోయి

యుంటిని. కాని తామందుండలేదు. ఎందున్నదియుఁగూడ నెవరును నాతోఁ జెప్పరైరి. వెదకి వెదకి వేసరిమరల నేను బోవుచుండ, నాయదృష్టమువశమున సరళాదేవిగారిదాసిగాఁబోలు, నొక్కతె యింతకు ముందు నాకెదురుగవచ్చుచు తామిందున్నారని చెప్పెను. వచ్చితిని.''

ఈమాటలు చెవి సోఁకినంత నా తరుణమున కేమో స్ఫురణకు వచ్చి ''ఓ! సరి!'' యనియెను. జాబును బోఁగొట్టుకొన్నందుకై విషణ్ణుఁడై చాలఁ జింతించెను. కాని తుదకు నిశ్చింతుఁడై యిట్లు తలంచెను.

''పోని లెమ్ము! అదియున్నమాత్రము నే నేమిసాధింప నలయును?''

ప్రపంచమున నన్నివిషయములందును మనసున నసూయ జనించియున్నను గూడ ననంతనాథున కొకకోర్కి మిగిలి యుండెను. తనకు సమయమున మహోపకృతియొనరించిన ఇందిరకు తనకృతజ్ఞతను గనుపఱుపవలయుననుట ! లోకమునఁ గడు నీచమైన తన జీవితకాలమున నింతటి సమయమొకటి తన కొదవినందులకై యతఁడు దైవము నెంతయో స్తుతించెను. ఈకార్యమునకైయే తన యాయువు శేషించియున్నదని యతఁడు నమ్మెను. చదువరులారా ! చూచితిరా ! కాలగతి యనంతనాథుని భావముల నెట్లు మార్చినది !

మాటాడక యాబాల ముందరుగుచుండెను. మనసున నేమియో చింతించుచు ననంతనాథుఁడు గూడ బొమ్మవలె నామె వెంటఁ జనుచుండెను.

చంద్రబింబ మాకసమునఁ బండువెన్నెలలు గాయుచుండెను. నిర్మలమైన యాకాశము శాంతచిత్తునిహృదయము వలెఁ బొలుచుచుండెను. ఆయారామవృక్షలతాదుల నల్లల్లన కదల్చుచు మందమారుతము కమ్మతావు లీనుచుండెను. నిశ్చింతచిత్తవృత్తులై మోహి

కసుఖము నాసించి తిరుగు తరుణులకు నాయారామముకన్న, ఆపండు వెన్నెల చెలువునకన్న, అకృతకశిలావేదికలకన్న, నానందదాయకము లెవ్వియైనఁ గలవా ?

కాని, మన యనంతనాథుఁడు వంచినతల నెత్తలేదు. ప్రక్కఁగల యెన్నియో పొదరిండ్ల నెందఱో తరుణులు, బాలురు, నిరర్గళవిహారము లాచరించుచున్నారు. కొందఱాట లాడుచున్నారు. కొందఱు మానసోల్లాసకరముగ బాటలు పాడుచున్నారు; మఱికొందఱు వినోదముగ నర్మాలాపము లాడుచున్నారు; కాని యనంతనాథున కిపుడీవిహారములన్నియు విషమయములైనవి. ఈవిహారములలో నొకటియైనను అతఁడు చవిచూడనిది లేదు; ఆనందింపనిది లేదు; ఎందుఁజూచినను బూర్వమతఁడు సరళాదేవితో విహరించినచోట్లే! వారు విహరింపని ప్రదేశములుగాని, పండని పచ్చికనెలవులుగాని, కూర్చుండని నీలశిలావేదికలుగాని, యాయారామసీమలో లేవు. కాని కాలగతి వేఱుగాఁ బరిణమించినది. నిన్నటి యమృతము నేటివిషము ! తనకు పూర్వపరిచితములైన చోట్ల నతఁడు కన్నెత్తియైనఁ జూడలేదు. ఆకస్మికముగ నేదేని పూర్వపరిచితప్రదేశము కంటఁబడినచో నేదేని పూర్వవిహారస్మృతి తలపునఁదట్టి యొకక్షేమాత్రాతని హృదయమున సహస్రవృశ్చికములు గుట్టిన ట్లగుచుండెను. కావున నతఁడు తలయెత్తక యాబాట వెంబడి నడుచుచుండెను.

వారిత్రోవ కించుకసమీపమున విహారమందిరమున నెవరో యొకగీతముఁ బాడుచుండిరి. అనంతనాథునకు ప్రకృతము గానమునఁగూడ జుగుప్సయున్నను అప్పటి యాగీతమునందలి యర్థగౌరవమును మెచ్చుకొనుచు క్షణమాత్ర మతఁడందు వినుచు నిలువఁబడియెను. ఈగీతము నింతకు మున్నెప్పుడో వినియుండినట్లతనికి జ్ఞప్తి కలిగెను. నిజము! నాఁడు వివాహమునకు ముందు, సరళ హార్మోనియముతోను

వాయించుచు శ్రుతి మధురముగ నాలపించిన గీతమేయిది?

"ప. సంకల్ప మెట్టిదో మనసా !
సాకేత నిలయుఁడౌ రాముని
పంకేరుహాసనాసీనుఁడైన
బ్రహ్మకైనఁ దెలియునో తెలియదో!"

ఈగీతపు టర్థమును అనంతనాథుఁడు నేఁడు బాగుగ గ్రహించెను. కొంతతడవు విని మరల నాబాలవెంట నడుచుచు నాక్రీడారామము దాఁటి రాజమార్గము నందెను.

---

# ప్ర ణ య స ర ణి

## ఇరువదియారవ ప్రకరణము.

" ఉద్దేశము నెఱవేఱెను "
" నిమిమీల నరోత్తమప్రియా
హృతచంద్రా తమసేవ కౌముదీ ! "
(రఘువంశము. ౮ సర్గము)

కాలగతి చాలవిషమము. ఎట్టి మహనీయులును దానిమార్గములను, వృత్తులను తెలియఁజాలరు. కొందఱకది సమ్మోదదాయకమును. వేఱు కొందఱకు దుఃఖదాయకమునుగా నేక కాలమందే పరిణమించును. అయినను మనుజులసంతోష విషాదముల కదియ కారణమనుట యసమంజసము. మనుజులచిత్తవృత్తుల ననుసరించి కాలస్వభావము భిన్నరూపములతో వారికిఁగాన వచ్చుచుండును. ఇదియెఱిఁగియే కాఁబోలు పెద్దలు దీనిని సాక్షాత్పరబ్రహ్మాత్మకమనిరి.

అనంతనాథుఁడు గూడ నిట్లే తలంచెను. జగన్నాటకమున నతని జీవితమొక మంచినిదర్శనము! అతఁడొక గొప్పయంశమును గూడ తనంత గ్రహింపఁగలిగెను. స్వయంవరణ విషయమున స్త్రీపురుషులు గమనింపవలసినది రూపముకాదు. మఱిపరస్పరానుకూలశీలమనుట. తక్కినయంశములెన్ని సరివచ్చినను పొత్తుకుదురదు. వివాహవిషయమున ననంతనాథుఁడెంతో యాత్రమున వర్తించెను. సరళను కనుఁగొన్నతరినుండి యితరప్రపంచమునే మఱచి తద్రూపముగ్ధుఁడై యన్యముఁ దలపోయక యామెను వరించి పరిణయమాడి ధన్యోస్మి యనుకొనెను, కాని తానొనరించిన కార్యము పొరఁబాటని యిపుడు బోధపడినది. ఆచార్యునికన్న ననుభవమెంతో మేలు. కార్యము చేయి మించినవి. స్వకృతమునకు ఫలము తానే యనుభవింపవలసివచ్చినది. అనుభవించి తీఱవలయును!

ప్రపంచమున నొకరొకరి కొక్కొకవిధమయిన పిచ్చి. లేక యొక్కొక కాలమున నొక్కటి! ఆపిచ్చియే మనుజునిజీవితమున కాధారము! మార్గదర్శకమును. అద్దాని కేవిధముననైన నాశాభంగము సంప్రాప్తమయ్యెనా యింక వానిగతి తుదముట్టినట్లే. తరువాత కాఁపునకుఁగూడ కొఱగాఁడు. అనంతనాథుఁడు గూడ నీవిధిని మించిన వాఁడుగాఁడు. అతనికి ప్రేమ పిచ్చి పట్టియుండెను. ఇపుడు తన్మార్గమున గొప్పయంతరాయము తటస్థించి తటాలున నతని కాశాభంగ మొనరించినది. వానిజీవితమునకు పట్టుగొమ్మ జారిపోయినది. కారణాంతరములచే గానిచో నీవఱకు నామమాత్రావశిష్టుఁడగుచుండెనేమో. ఇట్టివారు మనస్స్థైర్యము లేనివారనియుఁ గాపురుషులనియు ఝొత్త్రి నీతిజ్ఞులు గొందఱు వాదింపవత్తురుగాఁబోలు! అసలు వారికదియొక పిచ్చి! మనమేమిచేయుదము! వారిపిచ్చినిజూచి నవ్వు పిచ్చి మనది! ఎవరిపిచ్చి వారికానందముగదా!

రాత్రి యెనిమిదిగంటలయప్పుడు నగరమధ్యమున నొక వీథిలో నవకుంతనవతియగు తరుణియొక్కతె మునుముందు వడివడిగ నడుచు చుండఁగ నొక తరుణుఁడామె వెనువెంటనడుచుచుఁ బోవుచుండెను. అతఁడువంచినతలయెత్తక హృదయమున నేమోచింతించు చుండెను. ఇతఁడు మన యనంతనాథుఁడు కాక వేఱెవరు ?

వారిరువురును మాటాడక దారి సాగించిరి. కొంతవడి నడిచి యామె వేఱొకవీథిఁజొచ్చి యరుగనారంభించెను. కాని యందుఁ గూడ వారుచాలకాలముండలేదు. ఒకచిన్నసందువెంట కొంతసేపు నడచి యామెతన్మధ్యమున నొకచోట తటాలున నిలచెను. ప్రక్కన నొకద్వారమునఁ దలుపుమూయఁబడియుండెను. కాలయాపన మొన రింపక తటాలుననాతలుపులఁద్రోసికొని యామెలోనికరుగుచు రమ్మని యనంతనాథునకు చేసైగ గావించెను. మాఱుమాటాడక యతఁడు లోనికేగినంత నామె తలుపులముందుకుఁద్రోసి నడువసాఁగెను. లోపల నొక యావరణము. కొన్నిపూలచెట్లును తులసీబృందావనమునుగలవు. కొన్ని యడుగులలో వారిరువురును లోపల నొకగృహమును బ్రవేశించిరి. కాచగోళమున దీపములు వెలుఁగుచుండెను. అందెవ్వరు నుండ లేదు. ఇంటియావల ద్వారము తెఱువఁబడియుండెను. ఇరువురు నాగది లోఁ బ్రవేశించిరి.

మైనపువత్తియొకటి యొంటరిగ వెలుఁగుచుండెను. మంచము పై రోగార్తయగు స్త్రీయొకతె శయనించియుండెను. వయసున పదు నెనిమిదేండ్లకు మించియుండదుగాని యామెదేహము చాలశుష్కించి యుండినది. మొగము సుందరమే కాని యిపుడు తెల్లబాఱి దైన్యముఁ జూపుచున్నది. ముఖమున శ్వాసములు మిక్కిలిగ వెలువడుచుండినవి. జ్వరము మిక్కుటముగ నున్నట్లుండెను.

ఆనంతనాథుని గొనితెచ్చిన యాతరుణి లోనఁబ్రవేశించిన

తోడనే యామె మిగుల నాత్రమున " ఏమి! కాయా? పండా?" యని యడిగెను.

" ఇదో! వచ్చిరి! " యనియామె యనంతునిఁ జూపెను.

సంతోషసంభ్రమము లొక్కసారి యాయమ మనమును గల చెను. లేచికూర్చుండ నుంకించెనుగాని యాపనిచేతఁగాదయ్యె. స్వాగత వాక్యముల నాడ యత్నించినను నాలుక పనిచేయదయ్యె. వెడఁద కన్నులనిండ నీరుగ్రమ్మెను.

అనంతనాధుఁడామె ఇందిరయని యానవాలు గుర్తించెను. ఆ మెస్థితినిగని వివరింపరాని మనఃక్లేశమునను భవించెను. అతని నేత్రము లార్ద్రములయ్యె. పులిమీఁద పుట్ట, యన్నట్లు, అనిష్టసంఘటనమునఁ గుందుచున్న యతని కిష్టజనకష్టదర్శన మొకటి సంభవించినది. మును పే హృదయము భారము. ఇపుడు సంపూర్ణముగ దుర్భరమయి తో చెను. ఎట్టకేల కతఁడు ధైర్యమూతో ననియె.

" ఇదియు నాపురాకృత కర్మఫలమా! సర్వవిధముల నేను మనఃక్లేశముల ననుభవించి చావవలయుననియా ఆసర్వేశ్వరుని యుద్దేశము! నాస్థితి యిట్లుండ, నాకుపకృతిఁ జేసిన నీవుగూడ దుఃఖము పాలుగావలయుననియావిధి!! అయ్యో! పాపిదైవమా!! "

అని యించుకతడవు మోమునకు చేతులడ్డమిడుకొని కర్తవ్య మునూహించి యనంతుఁడు మరల ననియె.

" అమ్మా! నీ కీయవస్థ యెట్లు గలిగెను? భర్త యొనరించిన యవజ్ఞయా, లేక వ్యాధియా యిందుకు కారణము? ఇపుడు న చేయుమందువు? ఎట్లు నీ కుపచరింపఁగలనో సెలవిమ్ము! నీకై నా యీప్రాణమైన నొల్లక పనిచేయువాఁడను!"

" ధన్యాస్మి! ఈయుభయమే నాకు పదివేలు!"

అని యామె యరనిముషము కనులుమూసి మరల నతనితో ననియెను.

“ఇటుఁగూర్చుండుఁడు. నాకేయవస్థయు లేదు. నాభర్తయను గ్రహమును మరల సంపాదింపఁ గల్గితిని. కోర్కెయొకటి మిగిలియుం డెను. మరల నీజన్మమున మిమ్ముఁ జూడవలయుననుట. నేఁటికది చే కూడినది. ధన్యనైతిని !”

“ఏమీ ! భర్త మరల నను గ్రహించెనా?”

“అవును” ఇందిర నవ్వలేక చిరునవ్వు నవ్వెను.

“ఇందిరా ! ఇంకను నన్ను మోసగింపఁ జూచెదవా? నీరహస్య మంతయు నేనెఱుంగుదును గాన నిక దాఁచి యర్థములేదు. నాఁడు [illegible]లో నాప్రాణమును గాఁపాడి, జన్మశతముననైనను నాచేతఁ దీర్పరాని పరమోపకారము నాకొనర్చితివిగాని, యీవిషయమును మాత్రము నిజము దాఁచి నాకమితమైన మనఃఖేదము గల్గించితివి ! నిన్నన నేల ? నాబుద్ధిమాంద్యము నెంత నిందించుకొన్నను దీఱకు న్నది. సూచన లెన్నియున్నను గూడ నే నూహింపఁ జాలనైతిని ! నాకపుడు పట్టిన ప్రేమపిశాచము నన్నిట్లాడించుచు వచ్చెను. పోలు పొందులేని పిచ్చినమ్మకమొకటి యాధారముగఁ జేసికొని, నాసరి యీప్రపంచమున నే లేరని యూరక విఱ్ఱవీఁగితినిగాని, నాహీనజీవిత మును గూర్చి యింతయుఁ జింతింపనైతిని ! ఇపుడెంత చింతించిన నేమి ఫలము ! నాయపరాధమునకు తగిన శిక్ష యనుభవించి తీఱవలయు ! నాకుండిన గర్వమునకు ఫలమిది ! నేను భుజింపకున్నచో నింకెవరు చేయుద్దఁగలరు ! ఇందిరా ! నీవు నన్ను మోసగించి నిజమును గప్పి పుచ్చితివి ! కాని సత్యము నిన్న నే నెఱిఁగితిని ! క్షమింపుము! నిన్ను నిందింపఁజాల ! నావిధి యిట్లున్నది ! ఈమె—”

ప్రక్క నిలుచుండి తెప్పవేయక తన్నుఁ జూచుచుండిన తరుణిని జూపుచు,

"ఈమె వేళకురానిచో నీవఱకు నే నాలోకమునఁ బ్రాఁతవాఁడగుచుంటినేమో ! కాని నాప్రాణదాత్రికి నాకృతజ్ఞతఁ జెల్లింపఁ గలుగుట నాపుణ్యఫలమే ! అయ్యో ! ఇందిరా ! అపుడే నిజమెఱింగించి నామార్గ్యముఁ దెలిపియుండినచో నెంతో ధన్యుఁడగుదునుగదా! 'వేఱొక్క వనితమాయలఁజిక్కి నామనోహరుఁడు నన్ను త్యజించియున్నాఁడు' అని మరుఁగుపెట్టుటకుమారు 'సరళమాయకుం జిక్కి లక్ష్మీకాంతుఁడు నన్ను త్యజించినాఁడ'ని తెలిపియుండినచో బదివేలమడుఁగులు కృతజ్ఞుఁడ నగుచుందుఁగదా—"

అనంతునిమాటల వినుచున్న యిందిరహృదయమునఁ గ్రమముగ భయసంభ్రమాశ్చర్య విషాదములు ముప్పిరిగొనియెను. ఆమె కనులలో బాష్పము లంకురించెను. ప్రక్కన యాతనిచరిత్రమంతయు వినుచుండిన తరుణియు జనారామమునందలి యనంతనాథుని చేష్టితములకుఁ గారణమంతయు నిపు డూహింపఁగలిగెను.

"ఇంతకును ఎవ రేమిచేయుదురు ! నాయదృష్టమిట్టిది !!"

క్షణకాలమెవరును మాటాడరైరి. అనంతనాథుఁడు వివర్ణవదనుఁడై యవనతముఖుఁడయ్యెను. ఇందిరముఖమున నూతనవికార ముదయించెను. ఆమె దేహమున జ్వరముగూడ నధికము గాఁజొచ్చెను. రానురాను శ్వాసము లతిదీర్ఘములై సశబ్దములై వెలువడసాఁగెను. ఆమెచెలి యవన్నియుఁ జూచి చాల భయపడియెను.

ఎట్టకేలకు శిథిలమగుచున్న చేతనాశక్తి నతిప్రయాసముతో నిలిపి కొంతతడ వాలోచించి యనంతనాథునికడ దైన్యముఁజూపుచూడ్కుల నిగిడించి ఇందిర యిట్లనియె.

"నిజము దెలిపినచో నపుడు నన్ను మన్నించుదురా?"

“ఏమి? నేనా మన్నించుట ?”

“అవును. నేను మఱియొక యపరాధమును జేసియున్నాను”

“నేను నమ్మునంతటి మూఢుఁడనుగాను. ఒకవేళ శతాపరాధములున్నను, రాఁబోవుచున్నను గూడ నేనవి లెక్కింపను !”

“సత్యమా ?”

“ప్రమాణపూర్వకముగఁ జెప్పెదను !”

ఇందిర యనంతనాథునికడకుఁ దన సవ్యహస్తమును జాఁచెను. ఆయమ యాశయము నెఱింగి యాతరుణుఁడు “సత్యము !” అనుచు నామెచేతఁ దన కరముంచెను. తోడనే యామె కనులు మూఁతవడియె. కృశమై యస్థిసదృశమయిన యాతరుణహస్తము క్షణమాత్రము గడగడ వడఁకెను. గాత్రమంతయుఁ బచ్చపోసిన తెఱంగున దట్టముగ రోమాంచము లుదయించెను. తెల్లబాఱి కళావిహీనమైన మోమున నించుక వికాసము పొడసూపెను. ఆవ్యాధిగ్రస్త హృదయాంతరాళమున నపూర్వములును అనంతములును నగు భావశతము లావిర్భావ మొందుచున్నట్లు గానవచ్చుచుండెను. ఈజన్మమున నెన్నఁడు నెఱుఁగని యానందరసాతిరేకము నీమె నేఁ డనుభవించుచున్నదని యామె చెలి తలపోసి బాష్పాకులనేత్రయయ్యె. కారణ మెఱుంగనివాఁడయ్యును అనంతనాథుఁడును చాల ఖిన్నుఁడయ్యెను.

ఒక్కటి తరువాత నొక్కటిగ రమారమి పదినిమిషములు గడచెను. ఎట్టకేలకు ఇందిర కనులువిచ్చి సంతతధారగ బాష్పములఁ గార్చుచు శయ్యకడ నిలువఁబడియున్న చెలిఁగాంచి చేరువకురమ్మని సంజ్ఞచేసి ప్రక్కఁ గూర్చుండఁ బెట్టుకొని,

రుక్మిణీ ! నేఁటికి మన ఋణము చెల్లినది. నాయుద్దేశమును నెఱవేఱినది. నాకు సెలవొసంగుము. నాజనకుఁ డూరలేఁడు. వైద్యునికై చనిన అమ్మ యింకను రాలేదు. వారిని జూచు భాగ్యముగూడ

నాకిపుడు లేదు. నామారుగ నాయనకును అమ్మకును వందనము లొనర్పుము. నాకై దుఃఖింపకుము—"

అనునంతలో కంఠమున గద్గదిక జనించి ముందుమాట వెలువడదయ్యె. శ్వాసము లధికములగుచు వచ్చెను. రుక్మిణియుఁ బెద్దపెట్టున రోదనము చేయ నారంభించెను. వలదని యామెను చేసన్నచే వారించి మేరలేని యాశ్చర్యవిషాదములఁ దన్ను నిశ్చలదృష్టిఁ గాంచుచున్న యనంతనాథునిఁ గనుగొనియెను.

ఆమె శరీరమున జ్వరోష్ణము తగ్గుచువచ్చెను. చేతనాశక్తితోడ దృష్టిబలమును తగ్గెను. పెదవు లెండు వారియుండెను. అంగములలో సంచలనశక్తి క్షీణించుచుండెను. అతికృఛ్రమున నామె,

"రుక్కూ! దాహము!" అనియెను.

తటాలున రుక్మిణి చెంతనున్న కూజాలోని మంచినీటి నొక చిన్నపాత్రలో వంచి మెల్లన యామెకుఁ ద్రావించెను. రెండు గుక్కెళ్ళు ద్రాగి యించుక తెప్పిరిల్లి యిందిర యనంతనాథునివంకఁ జూచి కన్నుల నీరునించి దీనవాక్కున నిట్లనియె,

"నాకాలము సమీపించినది! నేను మహాపరాధము చేసిన దానను. నాతప్పులను— గణింపక నన్ను క్షమింపవలయును. అబలను—ముగ్ధను—అగతికను—హీనజీవితను—"

ముందుమాట వెలువడలేదు. కరంము స్తంభించెను. అనంతనాథుఁడును స్తంభీభూతుఁడై కదలక మెదలక నిలచి యూరక, చూచుచుండెను. కాని పలుకనేరఁడయ్యె. మరలఁ గొంతవడికి నామె పలికెను.

"క్షమింపవలయును—నిర్భాగ్యను—మ—మన్నింపుఁడు—ప్రే—ప్రేమింపుడు—ఈలోకము—వి—విడిచి పోవుచున్నాను—మా—మాధవశాస్త్రి బి—బిడ్డను. మీ—మీజాయను—క—క—కమలను—!"

మాటలు నిలిచిపోయెను ! భోరుభోరున వచ్చుచుండిన శ్వాసములుగూడ నిలిచిపోయెను ! ఆమెదేహమునుండి ప్రాణకళికయు వెడలిపోయెను ! అంగములెల్ల వివర్ణములయ్యెను !! మాధవశాస్త్రి యేకప్రియపుత్రి, అనంతనాథుని ప్రథమభార్య, కమలాదేవి, ఈలోకమును శాశ్వతముగ విడిచెను !!!

భూతావిష్టునిబోలె నూరక యీవఱకు వినుచుండిన యనంతనాథుఁడు కశాహతునిభంగి తటాలున నులికిపడి లేచి చుట్టును గనులు విచ్చిచూచి రుక్మిణివంకఁ దిరిగి ,, ఇదంతయు స్వప్నమా! '' అనియెను.

కన్నుల బాష్పవర్షము గురియుచుండఁగా గట్టిగ నేడ్చుచు రుక్మిణి యెట్టకేలకు గద్గదస్వరము నాఁపుకొని,

,, అంతయు నిజము ! ఈనిర్భాగ్యురాలు మాధవశాస్త్రి యేకపుత్రిక !! మీప్రథమ జాయ !!! కమల !!!! '' అనియె.

ఆక్షణము[illegible]న భూనభోంతరాళముల నేకముచేయు నుద్దేశముతో వర్షించు ప్రళయకాల ఘనాఘన బృందముల మధ్యమునుండి కన్నులు మిఱుమిట్లు గొలుపు శంపాలతికతోఁబాటు ,, పెళిలుపెళిల్లు '' మను జగద్భయంకరారావ మొనరించుచు వెలువడి యపరిమేయమైన పిడుగొక్కటి యనంతనాథుని హృదయమునఁదూఱి యావల వెడలినట్లయ్యెను ! మేరుమందర హిమాలయాదినగములన్నియు నొక్కపెట్టున నతనితలపైఁ బడినట్లయ్యెను !! ప్రపంచమునందలి ఘాతుక జంతువులు, విషజంతువులు నన్నియు నొక్కమాఱ యతనిదేహము నాశ్రయించి యెల్లెడలఁ గఱచినట్లయ్యెను !!! ఆకస్మికముగ నతని దృష్టికంధకార మావరించెను !!!!

క్షణమాత్రము శిలావిగ్రహముఁబోలె నిలిచి, యున్నట్లుండి రెండు చేతులుపైకెత్తి యాకసమువంకఁ జూచుచు నుచ్చైస్స్వరమున

,, హా ! మోసపోతిని ! కమలా ! కమలా ! నిజముగ నన్ను

మోసగించితివి ! ! నేను ద్రోహిని ! నీచుఁడను ! పాపాత్ముఁడను—ఛీ ! నాకుతగిన ప్రాయశ్చిత్తమిది ! ! ”

బలమైన యతని సవ్యముష్టిప్రహార మాతనిహృదయముపై గుండు వడినట్లుపడెను ! తోడనే నిశ్చేష్టితుఁడై యనంతనాథుఁడును దబాలున కమల ప్రక్కఁ బడిపోయెను ! ! ! !

—:o:—

# ప్రణయసరణి

—:o:—

## ఇరువదియేడవ ప్రకరణము.

—♦—

### పరిశిష్టము.

పాఠకమహాశయులారా !

మన నవల పరిసమాప్తి నొందుచు వచ్చినది. కూఁతురుజబ్బుకై వైద్యుని బిలుచుకొని రాఁ బోయిన సుందరమ్మ సమయమున కతఁడు లభింపమిఁ జేఁ దిరిగి తిరిగి సావకాశముగ నిలుచేరెను. వైదికవృత్తిమై గ్రామాంతరమున కరిగియున్న మాధవశాస్త్రియుఁ గొంచెమించుమించుగఁ బొగబండినవతరించి యామెకు జతపడెను.

ఇరువురు నింటికి వచ్చిరి. గదిచొచ్చి కమలానంతనాథుల మృతదేహములను గన్నారఁ గాంచిరి. జరిగిన సమాచారమంతయు రుక్మిణివల్ల చెవులార వినిరి. కడుపునిండ రోదనము చేసిరి ! కాని కార్యము మించినది. ఏమిచేసిన నేమిఫలము ! కూఁతురును జామాతయు మరల వత్తురా ?

సరి ! కాలము తప్పక యీసంగతి బల్లారిపురమును జేరెను. శ్రీనివాసశాస్త్రియొక్కయుఁ బార్వతమ్మయొక్కయు దుఃఖము లిట్టి

వని వర్ణింప నెవరితరము !

రుక్మిణియుఁ దన చెలికై పలుదెఱఁగుల విలపించెను. ఆసాధ్వియుపదేశములును ఆమెగుణములును పలుమాఱు తలంచుచుండెను. అచిరకాలమున నామె స్వీయనాథమందిరముఁ జేరి నిరంతరమును కమలను స్మరించుచు నామెను దనకాదర్శభూతగ నుంచుకొని సర్వవిధముల మెలఁగుచుండెను.

ఇఁక తక్కినవారిలో మన 'సరళాదేవి' చరిత్రము నెఱుఁగుటకై మాచదువరులు చాలఁ గుతూహలపడకపోరని మానమ్మకము. కాని వారు మమ్మావిషయమున క్షమింతురుగాత ! ఆవిషయమిప్పుడు తెలుపఁజాలము. ఆతగుణి యావలి జీవితమింకను బరిపూర్ణముగాఁ బరిణమింపలేదు. అదియు నింతంతలోఁ దెలుప నసాధ్యము. మఱల నొకమాఱాయమవిషయమై ప్రత్యేకముగ విన్నవింపఁదలఁచుకొన్నారము. అవకాశముండిన !

కమలానంతనాథుల జీవితమువలన మన నాగరకతరుణ జనులు నేర్చుకొనఁదగిన యంశము లేవైన గలవాయని యాలోచించుచు నింతటితో ప్రకృతము విరమింతముగాక !

